# బాల - ప్రౌఢ వ్యాకరణములు

## విశ్లేషణాత్మక అధ్యయనము

ప్రొఫెసర్ హరి శివకుమార్
తెలుగు విభాగము
కాకతీయ విశ్వవిద్యాలయము

శ్రీ కృష్ణ ప్రచురణలు
వరంగల్
1994

# బాల - ప్రౌఢ వ్యాకరణములు

## విశ్లేషణాత్మక అధ్యయనము

ప్రొఫెసర్ హరి శివకుమార్

తెలుగు విభాగము

కాకతీయ విశ్వవిద్యాలయము

శ్రీకృష్ణ ప్రచురణలు

వరంగల్

1994

BALA - PROUDHA VYAKARANAMULU
VISLESHANATMAKA ADHYAYANAMU



శ్రీకృష్ణ ప్రచురణలు - 7

ప్రతులు - 1000

ప్రథమ ముద్రణము - ఏప్రిల్, 1994

ధర: 50. 00

కాకతీయ విశ్వవిద్యాలయం - యు.జి.సి. శాఖ వారి

5,000 రూ॥ ల ఆర్థిక సహాయంతో ముద్రింపబడినది

ప్రతులకు :

ప్రొఫెసర్ హరి శివకుమార్

8-4-18, "శ్రీవిహార్"

శ్రీకృష్ణకాలనీ, వరంగల్ - 506 002 - ఏ.పి.

ముద్రణ: వేంకటరమణ ముద్రణాలయము, డి.టి.పి. - ఆఫ్‌సెట్ ప్రింటర్స్, వరంగల్.

# ప్రవేశిక

బాల-ప్రౌఢ వ్యాకరణాలను సూత్ర వ్యాఖ్యానాలతో యథాతథంగా అధ్యయనం చేయటం సంప్రదాయంగా వస్తున్న విధానం. ఆ రెంటినీ కంఠస్థంచేసిన పండితులకు కూడా, బాలవ్యాకరణ సూత్రాలకు ప్రౌఢవ్యాకరణకర్త ప్రతిపాదించిన సవరణలు చెప్పమని అడిగితే కొంత శ్రమపడక తప్పదు. అలాంటి పరిస్థితిని తొలగించి, బాల-ప్రౌఢవ్యాకరణాలను సమన్వయాత్మకంగా పఠించటానికి వీలు కలిగిస్తూ 'బాల-ప్రౌఢవ్యాకరణ సర్వస్వము' ను రచించారు స్ఫూర్తిశ్రీగారు. సూత్ర సమన్వయంతోపాటు సాగిన సముచిత వ్యాఖ్య, వ్యాకరణాధ్యయనంలో ఒక క్రొత్తమలుపు. బాల-ప్రౌఢవ్యాకరణాలపై వచ్చిన వ్యాఖ్యలన్నీ మూలనవడి, స్ఫూర్తిశ్రీగారి సమన్వయాత్మకరచన చాలా ప్రాముఖ్యాన్ని పొందటం గమనార్హం. వారి కృషి ప్రశంసనీయం. అది అధ్యయన విధానంలో వచ్చిన మార్పుకు సంకేతం.

. అదే విధంగా - "బాల-ప్రౌఢవ్యాకరణములు - విశ్లేషణాత్మక అధ్యయనం" అన్న ఈ గ్రంథాన్ని మరొక పద్ధతిలో వ్రాశాను. బాల-ప్రౌఢవ్యాకరణరచనలో తత్కర్తల దృక్పథము, వారి ప్రణాళిక, వానిని అవగాహన చేసికొనవలసిన విధానములను దృష్టిలో ఉంచుకొని ఈ విశ్లేషణాత్మక అధ్యయనం చేయబడింది. వివిధ సంధులను గురించి వారి అభిప్రాయాలేమిటి? ద్రుతకార్యము - విభాష-బహుళము వంటివానిని నిరూపించటంలో వారి ప్రణాళిక ఏమిటి? తత్పురుషము- బహువ్రీహి - ద్వంద్వము-ద్విగువు-వంటి సమాసాలు తెలుగులో ఎట్లా ఏర్పడుతున్నాయి? ఒక విభక్తి బదులుగా మరొక విభక్తి ఏయే సందర్భాలలో వస్తున్నది? సమాపక - అసమాపక-ప్రేరణార్థక క్రియారూపాలు ఎట్లా ఏర్పడుతున్నాయి? - ఇలాంటి విషయాలను సమగ్రంగానూ సులభంగానూ అవగాహన చేసుకోటానికి బాగా ఉపయోగపడాలనే ఉద్దేశ్యంతో, ఒక ప్రణాళికను ఏర్పరచుకొని ఈ గ్రంథ రచన చేయటం జరిగింది. వాస్తవానికి, బాల-ప్రౌఢవ్యాకరణాలలోని ఏ సూత్రమూ పరిహరింపదగినదికాదు. అట్లాగే, అన్ని సూత్రాలనూ అధ్యయనంచేయటమూ కష్టమైన పనే! అందువలన ఆ వ్యాకరణాలలోని ప్రధానాంశాలను మాత్రమే స్వీకరించి, ఈ గ్రంథరచన చేయటం జరిగింది. ముఖ్యంగా బాల-ప్రౌఢవ్యాకరణాల విశ్లేషణ ద్వారా, తద్రచయితల హృదయావిష్కరణే ఈ రచనోద్దేశ్యము. ఆ దృష్టితో ఈ గ్రంథం ఎంతో ప్రయోజనాన్ని సమకూర్చి, సహృదయ పాఠకుల మన్ననలకు పాత్రమవుతుందని కోరిక!

ఈ గ్రంధాన్ని కూలంకషంగా పరిశీలించి అమూల్యమైన సలహాలనిచ్చిన ఆచార్య రవ్వా శ్రీహరిగారికి, ఆచార్య ఎల్లూరి శివారెడ్డిగారికి, హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ గ్రంథవ్రాతప్రతిని సిద్ధంచేయటంలో సహకరించిన సోదరి డా॥ బి.రుక్మిణి గారికి కృతజ్ఞతలు!

ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహకరించిన అందరికీ నమోవాకములు.

వ్యాకరణాన్ని అధ్యయనం చేసే వారికి ఈ గ్రంథం ఏమాత్రం సహాయపడినా ఈనా ప్రయత్నం సఫలమైనట్లే భావిస్తాను.

వరంగల్

శ్రీభావ-ఉగాది

11-4-1994

**- హరి శివకుమార్**

# బాల-ప్రౌఢవ్యాకరణములు

## విశ్లేషణాత్మక అధ్యయనము

## విషయసూచిక

# I. బాల–ప్రౌఢ వ్యాకరణములు

## 1. చిన్నయసూరి

19 వ శతాబ్దపు ఆంధ్ర పండితులలో సుప్రసిద్ధుడు పరవస్తు చిన్నయసూరి. క్రీ. శ. 1806 నుండి 1862 వరకు జీవించిన సూరి శ్రీ వేంకటరంగ రామానుజాచార్యుల ఏకైక పుత్రుడు. 16వ ఏట శ్రీ కంచి రామానుజాచార్యుల వద్ద విద్యాభ్యాసము ప్రారంభించినప్పటికిని, ఏకసంథాగ్రాహి కావున త్వరలోనే సంస్కృతాంధ్రములలో మహాపండితుడైనాడు. తర్కశాస్త్రము, అలంకారశాస్త్రము, ఉభయవేదాంతములను కూడ అభ్యసించినాడు. అంతేకాక – అరవము, ప్రాకృతము వంటి భాషలతో కూడ ఆయనకు మంచి పరిచయము కలదు. వానితోపాటు ఆంగ్లభాషను కూడ బాగుగా అభ్యసించుటవలన హైందవులతో పాటు ఫాదరీలును, ఆంగ్లేయోద్యోగులును ఆయనకు శిష్యులై, సూరి వద్ద తెలుగు నభ్యసించినారు. అర్బత్ నాట్, సి.పి.బ్రౌన్ వంటి ఆంగ్ల పండితులును సూరి పట్ల విశేషాదరమును చూపినారు. వేదము పట్టాభిరామ శాస్త్రి, రావిపాటి గురుమూర్తి శాస్త్రి, వేదం వేంకటరమణశాస్త్రి వంటి పండితులు సూరికి సమకాలికులు. సూరి పాండిత్యమును గుర్తించిన అర్బత్ నాట్ దొర ఆయనకు 'సూరి' అన్న బిరుదము నిచ్చి, 'చిన్నయసూరి' అని చెక్కబడిన బంగారు కడియమును బహూకరించి సత్కరించినాడట.

ఆంధ్ర భాషా స్వరూపమును బోధించు వ్యాకరణము కాని, ఆంధ్రపదకోశముకాని, చక్కని వచనరచన కాని, ఆనాటికి తెలుగున లేకపోవుట వలన, చిన్నయసూరి ఆలోపమును పూర్తిచేయ తలపెట్టినాడు. అందువలన – చక్కని తెనుగువచనమునకు నిదర్శనముగా 'నీతిచంద్రికను' వ్రాసినాడు. అట్లే –అనేక ప్రాచీన గ్రంథములను పరిశీలించి, ప్రయోగములను సేకరించి, 1858 లో 'బాలవ్యాకరణము'ను వెలువరించినాడు. ముత్యములవంటి అక్షరములతో వ్రాసికొనిన పదజాలమును, ప్రయోగములను కూర్చి 'ఆంధ్రనిఘంటువు' నొకదానిని ఏడు సంపుటములలో సమకూర్చినాడు. 'శబ్దరత్నాకరము'న కిదియే మూలమని జనశ్రుతి. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు సేకరించి, సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణమున దానిని ఉపయోగించుకొని, నష్టపఱచిరని నిడదవోలు వేంకటరావుగారి అభిప్రాయము.

చిన్నయసూరికి పూర్వమే ఆంధ్రభాషకు వ్యాకరణ గ్రంథములు వెలసినవి. ఆంధ్రశబ్ద చింతామణి, వికృతివివేకము, ఆంధ్రభాషా భూషణము, కావ్యాలంకార చూడామణి, అప్పకవీయము, కవిలోక చింతామణి, కవిజన సంజీవని, కవిశిరోభూషణము, ఆంధ్ర కౌముది, సర్వలక్షణ సార సంగ్రహము, కవిసంశయవిచ్ఛేదము వంటి అనేక వ్యాకరణములు వెలసినవి. కాని అవి అన్నియును అసమగ్రములే యగుటవలన చిన్నయసూరి వ్యాకరణరచనకు పూనుకొనినాడు.

బాలవ్యాకరణ రచనకు పూర్వము ఆయన 3 వ్యాకరణములు వ్రాసినాడు:

1. 1840లో – మొట్టమొదటి ప్రయత్నముగా 'పద్యాంధ్రవ్యాకరణము' ను వ్రాసినాడు. "ఆంధ్రభాషకు నేబది యక్కరములు -----" అన్న విధానమున రచింపబడిన ఆ గ్రంథము, ఆంధ్రభాషాభూషణము, కావ్యాలంకార చూడామణుల ఫక్కిలో నడచినది.

2. 1842లో – 'శబ్దశాసన పద్యాంధ్రవ్యాకరణము' అనుపేర, అష్టాధ్యాయి ఫక్కిలో సంస్కృతమున వ్రాసి, రెండవ ప్రయత్నము చేసినాడు. "సిద్ధి ర్లోకతః శాసన మిదం దిక్ప్రదర్శనమ్ "–అన్న విధానమున రచింపబడిన ఆ వ్యాకరణము పూర్తిగా లభించలేదు.

3. 1853లో – 'శబ్దలక్షణ సంగ్రహము' అనుపేర, అష్టాధ్యాయి ఫక్కిలో తెలుగులో వ్రాసినాడు. 'డాకు లకాంరబగు; క గ చ త ప వ లు; నీ మీ లకు గాదు'–వంటి పద్ధతిలో వ్రాసిన ఈ వ్యాకరణము సుబోధకముగా లేదు.

నాల్గవ ప్రయత్న ఫలితము – 'బాలవ్యాకరణము'. 1858లో రచింపబడినది. సంస్కృతభాషకు 'సిద్ధాంతకౌముది' ఎట్టిదో, తెలుగుభాషకు 'బాలవ్యాకరణము' అట్టిదనుటలో సందేహము లేదు.

చిన్నయసూరి వ్యాకరణ రచనావిధానము బహుప్రశంసనీయమైనది. ఆయన రచించిన సూత్రములు తాళలయాన్వితములై, కంఠస్థము చేసికొనుటకు అనువుగా నుండును. ఉదా : ' ఇ టి తి వర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు" (బాల–ఆచ్చిక –28); "షష్ఠి వర్ణకంబు హేతువులగు గుణ క్రియల కగు" (బాల–కారక –14); "అందు వరుసను రెండేసి ప్రథమ మధ్య మోత్తంబు లనంబడు" (బాల–క్రియా –9).

అవసరమునకు మించిన అక్షరములు ఆయన సూత్రములలో కన్పించవు. "ఏకమాత్రా లాఘవేన పుత్రోత్సవం మన్యంతే వైయాకరణాః" అన్న ఆర్యోక్తి ఆయన

సూత్ర రచనలో కన్పించును. ఉదా: "లకారంబునకు డు ంబు వు రు ను ముఙ్ఙగు" (బాల-క్రియా -7); "రు- ము లు బహువచనంబులు, పెఱ లేకవచనంబులు" (బాల-క్రియా-10).

సూత్రముల క్రింది వృత్తులలోను ఈ లయాన్వితరచన గోచరించును. ఉదా: "ద్విరుక్తము యొక్క పరరూప మామ్రేడిత మనంబడు" (బాల-సంధి-10); "ప్రథమేతరవిభక్తి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని " (బాల-సంధి-9).

సూత్రముల సమన్వయమునకు చూపిన లక్ష్యములలో కూడ నాదసౌందర్యము పాటింపబడినది. ఉదా: రాముని కంటె నన్యుండు ధానుష్కుండు లేడు (బాల-కారక-12); గోవులలోపల కపిల బహుక్షీర (బాల-కారక-16).

సూరి అనవసరమైన చోట్ల లక్ష్యములను కూడ చూపడు. ఉదా: పయ్యెద పయ్యద (బాల-ప్రకీర్ణక - 5)

చిన్నయసూరి తన రచనాప్రణాళికకు అనువైన సంజ్ఞలను కొన్నింటిని పాణినీయము నుండి గ్రహించినాడు. సంధి, సమాస, కారక, క్రియ, విభక్తి, కర్త, కర్మ, ఉపయోగము, ఆఖ్యాతము, ఆగమము, ఆదేశము, కృత్, తద్ధిత - వంటి పదములు పాణినీయము నుండి గ్రహించినవే.

అవికాక తన రచనకు అనుకూలముగా కొన్ని సంజ్ఞలను ఏర్పరచుకొన్నాడు. డుమంతము, ముఙ్ఙు, ముత్తు, త్రికము వంటివి సూరి ఏర్పరచుకొన్న ప్రత్యేక సంజ్ఞలు.

ప్రాచీన లాక్షణికులును కవులును చెప్పిన విషయములను విమర్శించి చెప్పవలసి వచ్చినప్పుడు సూరి ప్రదర్శించిన సౌశీల్యము, విధేయత నిరుపమానము. ఉదా: ఆర్యప్రయోగంబు లదృష్టంబులు గ్రాహ్యంబులు (బాల-సంజ్ఞా-23); సంస్కృతీయంబునకు సంధియగునని యథర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిం బూర్వకావ్యంబులందు బ్రయోగంబు మృగ్యంబు (బాల-సంధి-4); వాగనుశాసనులు యదా తదా యని గ్రహించుట ప్రపంచార్థము (బాల-సంధి-13).

ఈ విధముగా ఒక చక్కని ప్రణాళిక నేర్పరచుకొని, 'బాలవ్యాకరణము'ను రచించి, ఆంధ్ర భాషకు ఒక సమగ్రమైన పరిపుష్టమైన వ్యాకరణమును సంతరించినాడు చిన్నయసూరి.

# 2. బహుజనపల్లి సీతారామాచార్యులు

శ్రీ సీతారామాచార్యులు 1827లో ద్రవిడదేశములోని నాగపట్టణములో జన్మించినాడు. వారిది మంచి పండిత వంశము. చిన్ననాట తండ్రి వద్దనే ఆయన విద్య నభ్యసించెను. చిన్నవయసులోనే నాగపట్టణములోని శ్రీ సౌందర్య రాజస్వామి వారిని స్తుతించుచు శబ్దాలంకారభరితమైన ఒక శతకమును కూడ వ్రాసెను.

ఆ తరువాత 'శబ్దరత్నాకరము' అనునిఘంటు రచనకు పూనుకొని బహుగ్రంథ శోధన చేసినాడు. ఆ నిఘంటు రచన నిర్విఘ్నముగా కొనసాగుటకు 'వినాయకశతకము'ను వ్రాసెనట.

'శబ్దరత్నాకర' రచన కుపక్రమించిన సీతారామాచార్యులు వివిధ గ్రంథములను పరిశీలించి చాల పదములను సేకరించినాడు. ఆవిధముగా సేకరించిన వివిధ పదము సహాయముతో విద్యార్థుల ఉపయోగము కొరకు – 'వైకృత దీపిక, సంస్కృతాంధ్ర ద్రవిడ హూణభాషా పదకోశము, అలఘుకౌముది' అను గ్రంథములను వ్రాసెను. అవికాక పిల్లల కొఱకు 'బాలచంద్రోదయము, నీతిమాల' లను వ్రాసెను. ఆ తరువాత భారతాది గ్రంథములలోని నీతులను సంగ్రహించి 'సతీధర్మసంగ్రహము' అను పుస్తకమును వ్రాసెను. పై గ్రంథములను రచించుచునే పట్టుదలతో 1855లో–'శబ్దరత్నాకర'మనునిఘంటువును కూడ పూర్తిచేసెను. ఇవికాక 'ప్రపన్నపారిజాతము', ఉపాధ్యాయబోధిని', 'ఆంధ్రశబ్దమంజరి' అను గ్రంథములను కూడ వ్రాసెను.

భారతాది వివిధ గ్రంథములను పరిశీలించు సమయమున లభించిన విశేష లక్షణ ప్రయోగములను సేకరించి 'త్రిలింగలక్షణశేషము' అను వ్యాకరణమును వ్రాసెను.

చిన్నయసూరి 'బాలవ్యాకరణము'లో వదలి పెట్టినవని తాను భావించిన లక్షణములను సీతారామాచార్యులు తన 'త్రిలింగలక్షణశేషము'న వివరించినాడు. సూరి చెప్పిన విషయములను తనకు నచ్చని వానిని సవరించుటకు ప్రయత్నించినాడు. ఆవిధముగా 'త్రిలింగలక్షణ శేషము'ను బాలవ్యాకరణమునకు పూరకముగా రచించెను. చిన్నయసూరి వ్యాకరణము 'బాలవ్యాకరణము'కాగా, బహుజనపల్లివారి వ్యాకరణము 'ప్రౌఢవ్యాకరణ'మని ప్రసిద్ధికెక్కినది. కవి, పండితుడు, బహుగ్రంథకర్త, అన్నింటిని మించి వైయ్యాకరణిఅయిన సీతారామాచార్యులు 20-3-1891న స్వర్గస్థుడయ్యెను.

# 3. బాల-ప్రౌఢ వ్యాకరణముల రచనాప్రణాళిక

చిన్నయ సూరియు, ఆయన ననుసరించిన సీతారామాచార్యులును వ్యాకరణరచనకు ఒక చక్కని ప్రణాళికను ఏర్పరచుకొని రచించినారు.

బాల-ప్రౌఢ వ్యాకరణములలో అధ్యాయములకు 'పరిచ్ఛేదము' అని వ్యవహారము. అధ్యాయము, అధికరణము, ఉల్లాసము, ఉద్యోతము వంటి పెక్కు పదములు వ్యవహారమున నుండగా బాల-ప్రౌఢ వ్యాకరణకర్తలు 'పరిచ్ఛేద'మను పదమునే స్వీకరించినారు. అది 'విభజనము' అన్న అర్థమునకు సన్నిహితముగా నుండుటవలన దానిని స్వీకరించుట సముచితముగా నున్నది. పేరునకు తగినట్లు సంజ్ఞ, సంధి, తత్సమ, కారక, సమాస, క్రియ వంటి పరిచ్ఛేదములలో ఆయా పరిచ్ఛేదములకు సంబంధించిన విషయములు, ఒకదానికి సంబంధించినవి మరొకదానిలోనికి దొరలకుండ జాగ్రత్తపడుట వారి రచనలలో కన్పించును. అందువలన 'పరిచ్ఛేద'మను పదమే యుక్తముగా నున్నది.

పరిచ్ఛేదవిభజన విషయమునను బాల-ప్రౌఢ వ్యాకరణకర్తలు చూపిన సామర్థ్యము ప్రశంసనీయమైనది.

### 1. సంజ్ఞా పరిచ్ఛేదము

భాషకు ప్రాథమికమైనవి అక్షరములు. అందువలన వర్ణసమామ్నాయము, ఆయా అక్షరములకు గల సంజ్ఞలు, ఇందు వివరింపబడినవి. ఇందులో రెండు విధములైన సంజ్ఞలు కన్పించును.

1. సాధారణ సంజ్ఞలు :- ఇవి అన్ని పరిచ్ఛేదములకు సంబంధించినవి – పరుషములు, సరళములు, స్థిరములు, తత్సమములు, తద్భవములు, దేశ్యములు మొదలగునవి.
2. విశేషసంజ్ఞలు :- ఇవి ఆయా పరిచ్ఛేదములలోనే చెప్పబడినవి-సంధి, వికల్పము, విభాష, బహుళము, కారకము, సమాసము, క్రియ మొదలగునవి.

మొదటిదైన సంజ్ఞాపరిచ్ఛేదములో అన్ని పరిచ్ఛేదములకును వర్తించు సాధారణ సంజ్ఞలను మాత్రమే చెప్పి, మిగిలిన వానిని ఆయా పరిచ్ఛేదములలో వివరించుట గమనార్హము.

### 2. సంధి పరిచ్ఛేదము

అక్షరముల కలయిక వలన పదము లేర్పడును. రెండుపదములు అత్యంత సన్నిహితముగా నుండుటవలన ఏర్పడుచున్న రూపభేదములు ఇందు నిరూపింపబడినవి.

సంధిజరుగు స్థలములు, సంహితయందు కలుగు ఆదేశము, ఆగమము వంటి వ్యాకరణ కార్యములును ఇందు నిర్దేశింపబడినవి.

### 3. తత్సమపరిచ్ఛేదము

తెలుగులోని శబ్దములు కొన్ని సంస్కృత ప్రాకృతములతో సమానమైనవి. మరికొన్ని నిష్పన్నమైనవి. కనుక సంస్కృత-ప్రాకృత శబ్దములు తెలుగులో ప్రయుక్తములైనప్పుడు పొందెడి మార్పులు ఈ పరిచ్ఛేదమున వివరింపబడినవి.

### 4. ఆచ్ఛిక పరిచ్ఛేదము

సంస్కృత సమేతరమైన భాష అచ్చ లేక ఆచ్ఛికభాష యనబడును. అనగా ప్రాకృత సమములు, సంస్కృత భవములు, ప్రాకృత భవములు, దేశ్యములు నైన శబ్దములు అన్నియు కలిసి ఆచ్ఛికపదము లనబడును. వాని రూపనిష్పాదనము ఈ పరిచ్ఛేదమున వివరింపబడినది.

### 5. కారక పరిచ్ఛేదము

తత్సమ - ఆచ్ఛిక శబ్దములపైన నామవిభక్తులు, ఔపవిభక్తికములు చేరి వాక్యార్థమును సంపన్నము చేయుటకు ఉపకరించును. ఏయే విభక్తులు ఏయే సందర్భములలో చేరునో ఈ పరిచ్ఛేదమున వివరింపబడినవి.

### 6. సమాస పరిచ్ఛేదము

నామములపైన చేరిన విభక్తులు సమాసవృత్తియందు లోపించుటవలన సమాసము లేర్పడుచున్నవి. అందువలన కారక పరిచ్ఛేదము తరువాత సమాస పరిచ్ఛేదము కూర్చబడినది.

### 7. తద్ధిత పరిచ్ఛేదము

భావార్థము, మతుబర్థము వంటి కొన్ని యర్థములలో, కొన్ని ప్రత్యయములు పదములపై చేరుచున్నవి. వానిని తద్ధిత ప్రత్యయములందురు. అట్లు చేరుటవలన కలుగుచున్న రూపములు తద్ధితపరిచ్ఛేదమున చెప్పబడినవి.

### 8. క్రియా పరిచ్ఛేదము

ధాతువులపైన వివిధ క్రియా విభక్తులు చేరి క్రియారూపము లేర్పడుచున్నవి. దానివలన వాక్యార్థము సంపన్నమగుచున్నది. ఆ క్రియారూపము లేర్పడుచున్న విధానము ఈ పరిచ్ఛేదమున వివరింపబడినది.

9. కృదంత పరిచ్ఛేదము

ధాతువులపైన కర్త్రృకర్మాద్యర్థములలో దుజ్చిన్న ప్రత్యయములు కొన్ని చేరి, విలక్షణార్థముల నిచ్చుచున్నవి. వానిని కృదంత ప్రత్యయము లందురు. అట్టి ప్రత్యయములు పదములపై చేరుచున్న విధానము ఈ పరిచ్ఛేదమున చెప్పబడినది.

10. ప్రకీర్ణక పరిచ్ఛేదము

పై తొమ్మిది పరిచ్ఛేదములకు సంబంధించినవి, అచ్చట చెప్పక విడిచినవి అయిన కొన్ని విశేష రూపములు ఈ ప్రకీర్ణక పరిచ్ఛేదమున వివరింపబడినవి.

ప్రౌఢవ్యాకరణ కర్త ఇట్టి విషయములను 'ముక్తలక్షణ వివేచనము' అను చివరి పరిచ్ఛేదమున చేర్చినాడు.

ఇట్లు బాలవ్యాకరణములోని పరిచ్ఛేద క్రమమున కూడ చిన్నయసూరి ఒక ప్రణాళికను పాటించుట గమనార్హము.

ఇక ప్రౌఢవ్యాకరణములోని విశేషములు రెండు గమనింపవలసియున్నవి।

1. శబ్ద పరిచ్ఛేదము

బాలవ్యాకరణములోని తత్సమ-ఆచ్ఛిక పరిచ్ఛేదములకు బదులు ప్రౌఢ వ్యాకరణమున శబ్ద పరిచ్ఛేదము ఒక్కటే కన్పించును. బాలవ్యాకరణములో సంస్కృతము నుండి నిష్పన్నమైన రూపములు తత్సమపరిచ్ఛేదముననను, తద్భవ - దేశ్యరూపములు ఆచ్ఛిక పరిచ్ఛేదముననను చెప్పబడినవి. ఇట్లు రెండుపరిచ్ఛేదములుగా చెప్పుట కన్న, తెలుగులో చేరిన తరువాత ఏర్పడిన శబ్దములన్నియు ఒకే విధమైనవి కనుక, వాని నన్నింటిని కలిపి 'శబ్దపరిచ్ఛేదము'గా ప్రౌఢవ్యాకరణకర్త చెప్పుటయు సమంజసముగనే యున్నది.

2. వాక్య పరిచ్ఛేదము

చిన్నయసూరి చెప్పని ఈ విషయమును, బాలవ్యాకరణమునకు పూరణముగా ప్రౌఢవ్యాకరణకర్త చెప్పుట సముచితముగా నున్నది.

ఈవిధముగా బాల-ప్రౌఢ వ్యాకరణ కర్తలు చక్కని ప్రణాళికలను ఏర్పరచుకొని తమ గ్రంథములను రచించుట గమనించవలసిన విషయము!

# II. సంజ్ఞా పరిచ్ఛేదము

## 1. వర్ణ సమామ్నాయము

భాష వాక్యముల వలన, వాక్యములు శబ్దముల వలన, శబ్దములు వర్ణముల వలన ఏర్పడుచున్నవి. కనుక ఏ భాషలోనైనను ప్రథమికమైనవి వర్ణములు. అందువలన చిన్నయసూరి బాలవ్యాకరణమును వర్ణసమామ్నాయముతో ప్రారంభించినాడు.

తెనుగు భాషకు ప్రారంభదశ నుండియు సంస్కృత ప్రాకృతములతో సన్నిహిత సంబంధమున్నది. అనేక పదములు సంస్కృత-ప్రాకృతముల నుండియే తెలుగు భాష లోనికి వచ్చినవి. ఇవి కాక మరికొన్ని దేశ్యశబ్దములు కూడ తెలుగులోనున్నవి. వానికి సంస్కృత-ప్రాకృతములలో మూలములు కన్పించవు. మొత్తము మీద సంస్కృత-ప్రాకృత-దేశ్య శబ్దములలోని పదములన్నియు కలిసి తెలుగుభాషయైనది.

తెలుగు భాషలో 55 వర్ణము లున్నవి. అందులో 50 వర్ణములు సంస్కృతాంధ్రభాషలకు సమానము. కాని తెలుగుభాషకన్న అత్యంత ప్రాచీనమైనది సంస్కృతము. అందువలన చిన్నయసూరి – "సంస్కృతంబునకు వర్ణంబు లేఁబది" (బాల-సంజ్ఞా-1) అని ప్రారంభించినాడు. అవి– అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః । క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ.

ప్రాకృతము సంస్కృత భాషావికారము. ఇందులో నలుబది వర్ణములు మాత్రమే ఉన్నవి. అందువలన– "ప్రాకృతమునకు వర్ణములు నలుబది" (బాల-సంజ్ఞా-2)- అని ప్రాకృతవర్ణములను తెలిపినాడు. అవి – అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః ।క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ స హ ళ. అనగా ప్రాకృతభాషలో సంస్కృతమున కన్న పదివర్ణములు తక్కువ. అవి – ఋ ౠ ఌ ౡ ఐ ఔ ఙ ఞ శ ష. ఈ పది వర్ణములు ప్రాకృత వర్ణమాలలో లేక పోవుట వలన అందు నలుబది వర్ణములే ఉన్నవి. కాగా – కొందరు ఏ ఓ లు (వక్రములు) ను, మరికొందరు ఐ ఔ లు (వక్రతమములు) ను, ప్రాకృతమున ఉన్నవని చెప్పినారు. కాని అది చిన్నయసూరికి సమ్మతము కాకపోవుట వలన నలుబది అనియే పరిగణనము చేసినాడు.

సంస్కృత సమేతరమైన దానిని అచ్చతెనుగు అందురు. సంస్కృతభవము, ప్రాకృతసమము, ప్రాకృతభవము, దేశ్యము అను నాలుగు రకములైన శబ్దములును కలిసి తెలుగుభాషగా వ్యవహరింపబడుచున్నది. అట్టి తెలుగు భాషలో 36 వర్ణములు మాత్రమే ఉన్నవి. అందువలననే సూరి-"తెనుగునకు వర్ణములు ముప్పది యారు" (బాల - సంజ్ఞా-3) అని చెప్పినాడు. అవి - అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః। క గ చ చే జ జే ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ - అనునవి. సంస్కృత వర్ణమాలలో లేకుండ, తెలుగు వర్ణమాలలో మాత్రమే కల వర్ణములు - ఐదుః అవి - ఎ, ఒ, ఁ, చే, జే - అనునవి. ఈఐదువర్ణములును ఏ పదములందు కన్పించునో అవి నిశ్చయముగా అచ్చ తెలుగులని నిర్ణయింపవచ్చును. అట్లే - ఋ ౠ ఌ ౡ ః ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష - అను 19 వర్ణములును తెలుగున వాడబడు సంస్కృత పదములలో కనిపించును (బాల-సంజ్ఞా-4). కనుక ఈ 19 వర్ణములలో ఏ వర్ణమున్నను అట్టి పదమును తత్సమముగా నిర్ధారింపవచ్చును.

పై వర్ణములను సమీకరించినచో-"ఆంధ్రభాషకు వర్ణంబులేఁబది యైదు" (ప్రౌఢ-సంజ్ఞా-1) అని స్పష్టమగును. అవి - అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అఁ అం అః। క ఖ గ ఘ ఙ చ చే ఛ జ జే ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ॥ వీనిలో ౡ కారము మంత్రశాస్త్ర ప్రసిద్ధమగుట వలన గ్రహింపబడినది. శకట రేఫము (ఱ) య వ ల వలెనే ప్రయత్న భేదముచే ద్వివిధము కావున ప్రత్యేక వర్ణముగా గ్రహింపబడలేదు. క్ష కారము సంస్కృత వ్యాకరణము అందును, నిఘం[illegible]వులందును చూపినట్లు కకార - ష కారముల కలయిక వలన ఏర్పడినది కావున దానిని సంయుక్తాక్షరముగనే పరిగణించిరి కాని ప్రత్యేకవర్ణముగా గ్రహింపలేదు. కాగా - ళ కారము మాత్రము వర్ణాంతరమే. ఇది ఏళులు, త్రాళులు వంటి శబ్దములలో బహుత్వమందు ర ల డ ల కాదేశమైన అలఘులకారమగు 'ళ' కన్న భిన్నమైనది. అనగా స్వతహాగా శబ్దమం దుండునది (ఉదాః సర్వమంగళ).

సంస్కృతములో అకారము మొదలు అః వరకు గల వర్ణములకు అచ్చులనియు, మిగిలిన వానికి హల్లులనియు సంజ్ఞలు. ఆభాషలో వానికి ఆ సంజ్ఞలు మాహేశ్వరసూత్రములవలన కలిగినట్లు చెప్పబడినది. సంస్కృతములో మొదటి నాలుగు మాహేశ్వర సూత్రములలోని ఆద్యంతాక్షరములైన 'అ-చ్' అనువాని ప్రత్యాహారము వలన 'అచ్' అను పదమేర్పడినది. తరువాత ఐదవ సూత్రము నుండి

పదునాలుగవ సూత్రము వరకు గల 'హ-ల్' అను అక్షరములను ప్రత్యాహారము చేయుటవలన 'హల్' అను పదము ఏర్పడినది. సూరి ఇచట ప్రత్యాహార ప్రక్రియ మాట నెత్తుకొనక రూఢముగా వాడుకలోనున్న 'అచ్చు, హల్లు' అను శబ్దములనే ప్రయోగించినాడు. అందువలననే మొదటి సూత్రములోని వృత్తియందే "ఇందకారాదు లచ్చులు కకారాదులు హల్లులు. అజ్ఝల్విభాగ మీలాగుననే మీద నెఱుంగునది" (బాల-సంజ్ఞా-1-వృత్తి) అని మాత్రము చెప్పి వదిలివేసినాడు.

అచ్చులకు స్వరములనియు, ప్రాణములనియు నామాంతరములు. స్వరములనగా స్వయముగా ప్రకాశించునవి. అనగా వేరొక వర్ణసహాయము లేకయే ఉచ్చరించబడునవి. అచ్చులులేని హల్లులను ఉచ్చరించుట కష్టము. కనుక హల్లులకు అచ్చులు ప్రాణముల వంటివి. కావుననే అచ్చులకు ప్రాణములు అని పేరు.

హల్లులకు వ్యంజనములనియు, ప్రాణులనియు నామాంతరములు. హల్లులు అచ్చులతో కలిసి పదము యొక్క అర్థమును వ్యక్తము చేయును కనుక వానికి వ్యంజనములని పేరు. అట్లే ప్రాణమువంటి అచ్చులతో కలిసియున్నవి కనుక ప్రాణులు అనియు పిలువబడినవి.

ఈ విధముగా తొలుత వర్ణనిరూపణము చేయబడినది.

## 2. సంజ్ఞలు

వర్ణసమామ్నాయములోని కొన్ని అక్షరములకు ప్రత్యేక సంజ్ఞలున్నవి. ఎ ఏ ఒ ఓ లు వక్రములనియు, ఐ ఔ లు వక్రతమములనియు వ్యవహరింపబడును (బాల - సంజ్ఞ -2 - వృత్తి). అచ్చులలో ఈ ఆరింటికి తప్ప, మిగిలిన వానికి ప్రత్యేక నామములు లేవు. అ ఆ లవలె కాక, వక్రములు భిన్నమైన ఉచ్చారణ కలిగియుండుట వలన వానికి వక్రములని పేరు కల్గినది.

కాగా, హల్లులలో - క చ ట త ప లు పరుషములనియు, గ జ డ ద బ లు సరళములనియు చెప్పబడును (బాల - సంజ్ఞా -5). వర్ణములను ఉచ్చరించుటకు స్థానకరణముల ప్రయత్నము అవసరము. స్థానమనగా నోటిలోని కదలని అవయవములు. కరణమనగా కదులునట్టి అవయవములు. ఈ రెండును స్పృశించుటనే ప్రయత్న మందురు. ఆ ప్రయత్నము పరుషమైనచో పరుషములును, సరళమైనచో సరళములను ఉచ్చరింపబడును.

"ఇతరములగు హల్లులు స్థిరములు" (బాల–సంజ్ఞా-6). అనగా-ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ల వ శ ష స హ ళ –ఈ 24 అక్షరములు స్థిరములు.ద్రుతము మీది పరుషములు సరళములుగను, ప్రథమ మీది పరుషములు గసడదవలుగను మారుచుండును. అట్లే సరళములును కొన్ని చోట్ల సహజములుగాను, మరికొన్ని చోట్ల ఆదేశసరళములుగాను కన్పించును. అట్లు ఏ విధమైన మార్పును పొందని పై 24 అక్షరములకు స్థిరములని పేరు.

చ జ ల ఉచ్చారణలో కొంత ప్రత్యేకత గోచరించుచున్నది. అనగా తాలవ్యములైన చ జ లు, దంత్యములైన చ జ లుగా కూడ కొన్ని శబ్దముల ఉచ్చారణలో కన్పించును. వాస్తవమునకు అవి సవర్ణములే. కాని ఉచ్చారణభేదముచేత అవి దంత్య తాలవ్యము లగుచున్నవి. నాలుకకొన తాలువును (అంగిలిని) తాకుటవలన తాలవ్యములును, దంతములను తాకుటవలన దంత్యములును ఏర్పడుచున్నవి. అవి ఏయే అచ్చులతో కూడినప్పుడు దంత్య తాలవ్యభేదము నొందుచున్నవో సూత్రీకరించినాడు సూరి:

ఇ ఈ ఎ ఏ లతో కూడిన చ జ లు తాలవ్యములు. ఉదా: చిలుక - చీమ - చెవి - చేమ - జిల - జీడి - జెట్టి - జేజే(బాల - సంజ్ఞా - 8). అట్లే - అ ఆ ఉ ఊ

ఒ ఓలతో కూడిన చ జ లు దంత్యములు. ఉదా : చేలి - చేప - చెక్క - చోపు చౌక్కు - చోటు - చౌక- జేముడు - జాతర - జెన్ను - జాలు- జొన్న - జోలి- జౌకు (బాల - సంజ్ఞా -9). ఐదంతములైన శబ్దములు తెలుగులో లేవు.

సంస్కృతమున ఈ విభేదము కన్పించదు. కాని తాలవ్య చజలు చివరనున్న కొన్ని సంస్కృతశబ్దములు బహువచనము పరమైనప్పుడు దంత్యములగుచున్నవి. ఉదా : రోచి - రోచులు ; వీచి - వీచులు ; రాజి - రాజులు; వాజి - వాజులు . కాగా- శ్లేషకావ్యములలో జకారమునకు దంత్య - తాలవ్య లక్షణములు రెండును కన్పించుచున్నవి. పింగళి సూరన రచించిన రాఘవపాండవీయమున "అకట పాండురాజ యశమెన్నవైతివి" (1-31) అన్న ప్రయోగములో భారతార్థమున 'పాండురాజ+యశము' అని విభజింపగా దంత్యోచ్చారణమును, రామాయణార్థమున 'పాండుర+అజయశము' అనివిభజింపగా తాలవ్యోచ్చారణమును కన్పించుచున్నది. అందువలన ప్రౌఢవ్యాకరణకర్త - "ఒకానొకచో జకారం బుభయంబు నగు" (ప్రౌఢ - సంజ్ఞా - 5) అని సవరించినాడు. ప్రౌఢవ్యాకరణ కర్త చెప్పిన పై లక్షణము జకారమునకే కాక చకారమునకును వర్తించుచున్నది. విజయవిలాసమున "తీయగఁ బంచదార వెనుదీయగ బల్కి ననున్ ద్వితీయగన్" (విజయ -1 - 159) అన్న ఉదాహరణములో పంచదార అనుచోట చకారము చక్కెర అను అర్థమున దంత్యమై, ఐదుగురికి భార్యయైన ద్రౌపది అను అర్థమున తాలవ్యమగుచున్నది. కనుక ప్రౌఢవ్యాకరణ కర్త జకారముతో పాటు చకారమును చేర్చినచో సూత్ర రచన బాగుండెడిది (బాల - ప్రౌఢ - వ్యాఖ్య - పు. 39).

"నకారంబు ద్రుతంబు" (బాల-సంజ్ఞా -11) అన్న సూత్రములో నకారమునకు ద్రుతమని పేరని సూరి చెప్పినాడు. ఇది మూడు రూపములలో కన్పించుచున్నది. అవి - ను, ని, న్ - అనునవి. ఇకారము మీద వచ్చినచో ను అనునది 'ని' గా మారును (హరిని, కరిని). హల్లుగాని అవసానముగాని పరమైనచో ను అనునది 'న్' అను రూపమును పొందును (పూచెన్ గలువలు, వచ్చెన్, పోయెన్). ద్రుతమునకు ప్రకృతిభావము కలిగినపుడు 'ను' అనియే ఉండును (పూచెను గలువలు). కాబట్టి 'ను' వర్ణమే 'ని' , 'న్' అను రెండు రూపములను పొందుచున్నది. ఈ మూడు రూపములందును మార్పు చెందక సామ్యమును సాధించుచు స్థిరముగా నుండునది నకారము. అందువలననే సూరి నకారమునే ద్రుతముగా స్థిరీకరించినాడు. ప్రౌఢవ్యాకరణకర్త ఈ సూత్రమును వివరించుచు "నకారం బసాధారణంబు ద్రుతంబు" (ప్రౌఢ - సంజ్ఞ -7) అని చెప్పినాడు. ద్రుతమనగా 'ఒల్లనియెడ మరిగిపోవునది' అని అర్థము. ఇది ప్రత్యయాత్మకము (తాను, నేను,

ధనమును, మనమును, చదువుచున్నాను, చదవగలను), ఆగమాత్మకము (నన్నును, నాచేతను, చదువుచును), అవ్యయాత్మకము (అన్నయును, తమ్ముడును) – అని మూడు రకములుగా కనిపించుచున్నదని చెప్పినాడు. అనగా శబ్దమునందు సహజముగానున్న నకారము కాక, ప్రత్యయముగా కాని, ఆగమముగా కాని, అవ్యయముగా కాని ఉండు నకారము ద్రుతమనిపించుకొనునని ప్రౌఢవ్యాకరణకర్త భావము. ఇది ఉత్వవిశిష్టము కూడ అయియుండవలెనని నిర్దేశించినాడు. దీనివలన చేను, కొలను వంటి శబ్దములలోని స్వతస్సిద్ధమైన నువర్ణము ద్రుతము కాదని తెలియవలెను. ఆశబ్దములందలి నువర్ణమును తొలగించినచో వాని అర్థములు పోవును కనుక అవి ద్రుతములు కావు. అట్టి ద్రుతము అంతమందున్న శబ్దములు ద్రుతప్రకృతికములు. ద్రుతప్రకృతికములు కాని శబ్దములు కళ లనబడును.

సూరి – కొట్టక, తిట్టక వంటి వ్యతిరేకార్థక క్రియలు కళలనియే చెప్పినాడు. ప్రౌఢవ్యాకరణ కర్త దీనిని సమర్థించుచు "ఆధారము లేకను సంతానోచ్ఛేదంబున వ్రేలెద" (ఆది-2-139) అన్న నన్నయ్యగారి ప్రయోగమును చూచి, 'లేక' అను దానిని ద్రుత ప్రకృతిక మని భ్రమించనవసరము లేదని చెప్పుచు "అక ప్రత్యయాంతావ్యయంబు కళయ" (ప్రౌఢ-సంజ్ఞా-8) అని సూత్రీకరించినాడు.

హల్లులలో య ర ల వ లకు వ్యాకరణమున ఒక ప్రత్యేకత కలదు. ఇవి రెండు విధములుగా కనబడుచున్నవి. అందువలన - "య ర ల వ లు లఘువులని, యలఘువులని ద్వివిధంబు లగు" (బాల-సంజ్ఞా -18) అని సూరి చెప్పినాడు. లఘువు అనగా తేల్చిపలుకబడునది; అలఘువు అనగా ఒత్తిపలుకబడునది.

ఆగమయకారము లఘువు – హరి యతడు, దూతయతడు.

స్వతస్సిద్ధయకారము అలఘువు – కాయ, మాయ.

శకటరేఫము అలఘువు. ఇది తత్సమ తద్భవములందు లేదు – విఱుగు, మెఱుగు.

సాధురేఫము లఘువు – పెరుగు, కరుగు.

బహుత్వమున ర ల డ ల కాదేశమైన ళకార మలఘువు – ఏళులు, పాళులు, త్రాళులు.

కళ, మంగళ, తాళము – వంటి శబ్దములలోని ళకారము వర్ణాంతరము కాని అలఘులకారమని భ్రమించరాదు. అందువలననే వర్ణసమామ్నాయమున్న నది ప్రత్యేకముగా చెప్పబడినది.

స్వతస్సిద్ధమైన వకారము అలఘువు – వల, వాగు. ఆదేశవకారము లఘువు – అతడు వలికె.

ఈవిధముగా వర్ణసమామ్నాయములోని కొన్ని అక్షరముల సంజ్ఞలను, వాని ప్రత్యేకతలను బాల – ప్రౌఢ వ్యాకరణకర్తలు సోదాహరణముగా నిరూపించినారు.

# 3. భాషావిభజనము

తెలుగు భాష తత్సమము, తద్భవము, దేశ్యము, గ్రామ్యము అని నాలుగు విధములుగా నున్నది. "సంస్కృత ప్రాకృత తుల్యం బగు భాష తత్సమంబు" (బాల-సంజ్ఞా-19)- అనగా సంస్కృతముతో కాని ప్రాకృతముతోకాని సమానమైన శబ్దము తత్సమమని అర్థము. సంస్కృతమునుండి సరాసరి కొన్ని శబ్దములు తెనుగులోనికి వచ్చిచేరినవి (రామః - రాముడు; విద్యా- విద్య; ధేనుః -ధేనువు; గౌః - గోవు; భూః - భువి; హృద్ - హృది; జగత్ -జగత్తు, జగము). మరికొన్ని శబ్ధములు సంస్కృతమునుండి ప్రాకృతములోనికి ప్రవేశించి ప్రాకృతమునుండి తెనుగులోనికి వచ్చినవి (అగ్నిః-అగ్గీ-అగ్గి; కటుః -కారో-కారం; యమః-జమో-జముడు; రాజ్ఞీ-రాణీ-రాణి; శ్రీః-సిరీ-సిరి). ఇట్లు వచ్చిన రెండు విధములగు రూపములను తత్సమములని అందురు.

ఇందలి 'కారము' అను శబ్దమును సూరి 'కటుః-కారో-కారము' అను ఉదాహరణలో ప్రాకృతసమముగా చెప్పినాడు. కనుక సూరి అభిప్రాయమున అది తత్సమము. కాని సీతారామాచార్యులు "కారము క్షారశబ్దభవము" (ప్రౌఢ-సంజ్ఞా-10) అని చెప్పి, అందుకు-ఉపబలకముగా ఆపస్తంబసూత్రములలోని -"క్షార లవణ వర్జనం" అను దానిలోని క్షారశబ్దమునకు కారమనియే ('లవణము' అను అర్థమే ప్రసిద్ధమైనను) అర్థము చెప్పవలెననియు, అందువలన 'కారము' క్షారశబ్ద భవమనియు చెప్పినాడు.

"సంస్కృత ప్రాకృత భవంబగు భాష తద్భవంబు" (బాల - సంజ్ఞా-20)- అనగా సంస్కృతమునుండి కాని, ప్రాకృతమునుండి కాని పుట్టిన భాషను తద్భవమని అందురు. వర్ణాగమము, వర్ణాదేశము, వర్ణలోపము వంటి మార్పులను పొందిన సంస్కృత ప్రాకృత శబ్దములు కొన్ని తెనుగున ప్రవేశించుచున్నవి. అట్లు మార్పులు పొందిన పిమ్మట ఏర్పడిన శబ్దములు తద్భవములు.

సంస్కృతము నుండి : ఆకాశః - ఆకసము; కుడ్యమ్- గోడ; తామరసమ్ - తామర; వక్రః - వంకర; స్మరః-మరుడు; సూచీ -సూది - ఇత్యాదులు. ప్రాకృతము నుండి: అంగారః - ఇంగాలో - ఇంగలం; అప్సరాః - అచ్చరా -అచ్చర; ఆశ్చర్యమ్ - అచ్చేరం - అచ్చెరువు; పృథివి -పుఢవి - పుడమి; యజ్ఞః-జణ్ణో-జన్నము; లక్ష్మీః - లచ్చీ-లచ్చి; విష్ణుః -విణ్హూ-వెన్నుడు-ఇత్యాదులు. ఇట్టి శబ్దములు తద్భవములు.

"త్రిలింగదేశ వ్యవహార సిద్ధంబగు భాష దేశ్యంబు" (బాల - సంజ్ఞా -21)- శ్రీశైలము, కాళేశ్వరము, దక్షారామము అను మూడు శివక్షేత్రములను కలిగియున్న ప్రదేశము త్రిలింగదేశము. త్రిలింగదేశ వ్యవహారముననే పుట్టి ప్రతిష్ఠ నొందిన భాషకు దేశ్యమని పేరు. ఈ దేశ్యమునకు సంస్కృతమునందు కాని, ప్రాకృతమునందు కాని మూలరూపములు కన్పించవు (ఊరు, పేరు,ఇల్లు, కోట, పేట - ఇత్యాదులు).

సూరి యిచ్చిన ఈ ఉదాహరణలలో కోట, పేట శబ్దములకు సంస్కృత మూలములు కన్పించుచున్నవని ప్రౌఢవ్యాకరణ కర్త గమనించి, "కోట పేఁటలు వైకృతములు" (ప్రౌఢ-సంజ్ఞా-11)- అని సూత్రీకరించినాడు. అనగా కోట, పేఁట శబ్దములు సీతారామాచార్యుల వారి దృష్టిలో తద్భవములుకాని, దేశ్యములుకావు. "కోట్టార హట్ట ఘట్టాశ్చ" అన్న అమర త్రిలింగశేషము ప్రకారము కోట్ట శబ్ద భవము కోట అనియు, "పింఠా విటజనాశ్రయః" అన్న అమరపదపారిజాతము ప్రకారము పింఠా శబ్దభవము పేట అనియు, ఆయన అభిప్రాయపడినాడు. కాని, పై రెండు శబ్దములలో కోట శబ్దము వైకృతమే అని అంగీకరించినను పేఁట శబ్ద విషయమున అభిప్రాయభేదము కలదు. సూరి పేట శబ్దమును నిరనుస్వారముగా ప్రయోగించినాడు. దీనికి హారమునందలి వరుస అని అర్థము. ఈశబ్దమును విడిచి, వీథి అను అర్థమున ఉన్న 'పేఁట' అను సానుస్వార శబ్దమును చెప్పినాడు ప్రౌఢవ్యాకరణ కర్త. కనుక ఇది సూరి చెప్పిన దానికి సవరణ కాజాలదు.

"లక్షణవిరుద్ధంబగు భాష గ్రామ్యంబు" (బాల-సంజ్ఞా-22)- వ్యాకరణలక్షణములకు సరిపడని భాషను గ్రామ్యమందురు (వస్తాడు-తెస్తాడు- వచ్చేని- తేచ్చేని-వచ్చేవాడు-వచ్చేటివాడు). ఈ భాష ప్రయోగమునకు అర్హము కాదని చిన్నయసూరి తెలిపినాడు. కాని ప్రౌఢవ్యాకరణ కర్త - పాత్రోచిత భాషను వాడి కావ్యసౌందర్యమును ఇనుమడింపజేయుటకు ప్రాచీన కవులు ప్రయోగించిన కొన్ని ప్రయోగములను -మొక్కేము సామి-(రామాభ్యుదయ - 2 ఆ); ఇతని సూసినా మేలే (యయాతి- 1 ఆ) చూపి, "గ్రామ్యంబు తత్తజ్జాతి వర్ణనంబునం బ్రయోగార్హం బగు" (ప్రౌఢ-సంజ్ఞా-14) - అని సూత్రీకరించినాడు.

సూరి లక్షణవిరుద్ధమైన భాషను ప్రయోగమునకు అనర్హమని చెప్పినప్పటికిని, ప్రాచీన కవుల ప్రయోగములలో కన్పించుచున్న గ్రామ్యములను స్వీకరింపదగునని చెప్పుచు "ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు" (బాల-సంజ్ఞా-23) అని

సూత్రీకరించినాడు. "ప్రయోగ శరణం వ్యాకరణమ్" అన్న సూక్తి ననుసరించి సామాన్యముగా లోకమున ప్రతిష్ఠనొందిన ప్రయోగముల ననుసరించియే వ్యాకరణము ప్రవర్తించును. అనగా కవుల కావ్యములందు ఏదైన గ్రామ్యశబ్దము ప్రవేశించిన దన్నచో దానికి నిత్యవ్యవహారమున ప్రసిద్ధి యున్నదనియే భావింపవలెను. అట్టి శబ్దములను కవులు ఆదరించి యుండుట చేత, అనింద్య గ్రామ్యములని అందురు. పెద్దలు వాడి యుండుట చేత తరువాత వారును వానిని వాడుటకు ఆక్షేపము లేదు. కాని అట్టి వానిని క్రొత్తగా కల్పించి వాడరాదు. సూరి యిచ్చిన ఉదాహరణములు - కలికంతుడు, ప్రాణగొడ్డము, జీవగట్ట, కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు. ఇందులో కలికంఠశబ్దము తప్ప మిగిలిన శబ్దము అన్నియు "కేవల సంస్కృతశబ్దము వికృతిశబ్దము తోడ సమసింపదు" అను నియమము ప్రకారము వైరిసమాసములు. అయినను అవి శ్రీనాథుని వంటి మహాకవులు ప్రయోగించుటచే అనింద్యగ్రామ్యములై గ్రాహ్యము లగుచున్నవి. కాని ప్రౌఢ వ్యాకరణ కర్త భారతము-ఆదిపర్వము-చతుర్థాశ్వాసము లోని నన్నయ ప్రయోగమున - "అవసరజ్ఞుండై వ్యాసు డేతెంచె నంత నత్తపసి, కవిల గడ్డంబును గవిలజడలును గవిలకన్నులును...." అన్న ప్రయోగమును ఆధారముగా చేసికొని "కపిల శబ్ద భవము కవిల శబ్దం బొందు గానంబడియెడి" (ప్రౌఢ-సంజ్ఞా-17) అని తెలిపినాడు. ప్రౌఢవ్యాకరణకర్త చూపిన ఉదాహరణములో ప్రాసస్థానమున వకార ముండుటచే రెండవపాదము మొదట కూడ కవిలకన్నులు అనియే ఉన్నదని అంగీకరింపవలయుననియు, ఒకే వరుసలో ఒకే చోట 'కవిల'అని ఒక మారును, 'కపిల'అని ఒకమారును కవి వాడియుండడనియు, కనుక'కవిల' అనుపాఠమే యుక్తమనియు గ్రహింపవలెను. అప్పుడా సమాసములు అగ్రామ్యములగును.

అట్లే కలికంతుడు, ప్రాణగొడ్డము మొదలగు సమాసములు తద్భవములనియు, అవి అంచపదము, అంచయాన వంటి సమాసములనియు చెప్పి ప్రౌఢవ్యాకరణ కర్త వానిని సమర్థించినాడు. వీనిలో 'కలికంతుడు' అనుదానిని చిన్నయసూరి అనింద్యగ్రామ్య మనినాడు. కాని సీతారామాచార్యులు దానిని తద్భవమని చెప్పి, అది 'గరకంఠ'శబ్దభవమని నిరూపించినాడు. అనగా, 'గరకంఠః' అను సంస్కృతసమాసమే తెలుగులో-'కలికంతుడు' అని అయినదని ఆయన అభిప్రాయము. ఇందలి శకటరేఫము 'గోఱజము' ('గోరోచన' శబ్దభవము), 'కాఱియ'('కారికా' శబ్దభవము) వంటి తద్భవ శబ్దములలోని శకటరేఫము వంటిదని చెప్పినాడు. అట్టి శబ్దములను తద్భములుగా సమర్థించుచు "తద్భవము లందును నలఘురేఫము గలదు"(ప్రౌఢ-సంజ్ఞా-9) అను సూత్రమును వ్రాసినాడు.

అట్లు 'కఱకంఠుడు' అనుదానిని తద్భవముగా గ్రహించినను, సంస్కృత సమేతర శబ్దములందు 'ఠ'కారము ఉండుటకు వీలులేదు కనుక, అది అభ్యంతరముగనే నిల్చును. కనుక ఈ విషయమున చిన్నయసూరి చెప్పినట్లు దానిని అనింద్యగ్రామ్యమనుటయే సముచితము.

కాగా 'జీవగఱ్ఱ' అనుదానిని మాత్రము ప్రౌఢవ్యాకరణకర్త స్పృశింప లేదు. కనుక సూరి యిచ్చిన ఇతర ఉదాహరణము లెట్లున్నను జీవగఱ్ఱను మాత్రము గ్రామ్యముగనే గ్రహింపక తప్పదు.

# III. సంధి పరిచ్ఛేదము

## 1. నిర్వచనము

వర్ణద్వయ సంహితయందు కలిగెడు కార్యము నుపదేశించే వ్యాకరణ విధానము సంధి యనబడును. పాణిని 'అష్టాధ్యాయి'లో 'సంహిత' యను శబ్దమును సంధియను నర్థమున ఉపయోగించినాడు. కాని తెలుగువ్యాకరణకర్త లెవ్వరును ఆ సంహిత బ్దమును గ్రహింపలేదు. అందరును 'సంధి' అను పదమునే ఉపయోగించినారు.

ప్రథమ వ్యాకరణకర్త కేతన తన ఆంధ్రభాషాభూషణములో మొదటి పదము ందివర్ణము, పై పదము మొదలివర్ణముతో కలియుట సంధి యని చెప్పినాడు. కేతన ౖనుసరించిన విన్నకోట పెద్దన తన 'కావ్యాలంకార చూడామణి' లోను అప్పకవి అప్పకవీయము' లోను వర్ణసంయోగమే సంధియని నిర్వచించినారు. ఆంధ్రశబ్ద చింతామణి, ఛందోదర్పణములు సంధులను వివరించినను, సంధి నిర్వచన మీయలేదు.

చిన్నయసూరి ప్రాచీనలాక్షణికులకు కొంచెము భిన్నముగా "పూర్వ పరస్వరంబులకుం బరస్వరం బేకాదేశంబగుట సంధి" (బాల-సంధి-1)- అని చెప్పినాడు. బహుజనపల్లి సీతారామాచార్యులును ఈ విషయమున చిన్నయసూరినే అనుసరించినాడు.

ఇట్లు ప్రాచీన - అర్వచీన లాక్షణికుల నిర్వచనములను పరిశీలించినచో రెండు మార్గములు కన్పించుచున్నవి. వర్ణ సంయోగము సంధియని నిర్వచించిన ప్రాచీన లాక్షణికుల మార్గ మొకటి; స్వర సంయోగమే సంధి యని నిర్వచించిన అర్వాచీన లాక్షణికుల మార్గము మరియొకటి - అని స్పష్టమగును. ఒకానొక కాలమున ప్రాచీన భాషలోని హలంతశబ్దము లన్నియు ఉచ్చారణ సౌకర్యముకొఱకు చివరనొక అచ్చును చేర్చుకొని అజంతశబ్దము లైనవని (వాక్ - వాక్కు ; మన్ - మన్ను ; పల్ - పల్లు) తలంచినవారు ఆదేశ-ఆగమ-సంశ్లేషాదులను కూడ సంధులుగనే గ్రహించి పూర్వలాక్షణికులను సమర్థించినారు. మఱికొందఱు - తెలుగు కేవలము అజంత భాష అనియు, అందు హలంతరూపములు లేవనియు, ఆదేశ - ఆగమ - సంశ్లేషాదులు సంధులలో చేరవనియు, అవి రూపభేదములు మాత్రమే అనియు, "సంధిలేనిచోట స్వరంబు కంటెఁ బరంబయిన స్వరంబునకు యడాగమంబగు" (బాల-సంధి-4) అను సూత్రములో చిన్నయ సూరి - 'సంధిలేనిచోట' అని విశదముగా చెప్పినాడనియు,

కావున స్వరసంయోగమే సంధి యనియు చెప్పు చు సూరి మొదలైన అర్వాచీనలాక్షణికులను సమర్థించినారు.

ప్రాచీనలాక్షణికుల లక్షణము విస్తృతమైనది. అది అచ్చులను హల్లులను విషయీకరించినది. చిన్నయసూరి నిర్వచనము అచ్ - విషయికము మాత్రమే. ఆయన చెప్పిన లక్షణములన్నియు సంధి కలుగునప్పుడుకాని కలగనప్పుడుకాని వచ్చునని సరిపెట్టుకొనవలయును. ఈ విషయమున - ప్రాచీన లాక్షణికుల లక్షణము ఆగమాదేశాదుల కన్నింటికిని వ్యాప్తమగుచుండగా, సూరి చెప్పిన లక్షణమున అవన్నియు సంధిని పురస్కరించుకొనియో, సంధిలేమిని పురస్కరించుకొనియో కలుగునని చెప్పవలయును.

ఈ సందర్భమున డా॥ చిలుకూరి నారాయణరావుగారు, కోరాడ రామకృష్ణయ్యగారు, దూసి శ్రీరామమూర్తిగారు మొదలైన అర్వాచీనులు కొందరు చిన్నయసూరివంటి అర్వాచీన లాక్షణికుల నిర్వచనముకంటె కేతనాది ప్రాచీన లాక్షణికుల నిర్వచనమే అధికవ్యాప్తిని కల్గియున్నదని చెప్పినారు.

ప్రాచీనలాక్షణికులు వర్ణసంయోగమే సంధి యని చెప్పుటకు కారణము - ద్రావిడ కర్ణాటక లాక్షణికుల ప్రభావము కావచ్చును. అరవమున ప్రథమవ్యాకరణకర్త యగు తొల్కాప్పియనారు - "అచ్చున కచ్చు పరమైనను, హల్లును కచ్చు పరమైనను, అచ్చునకు హల్లు పరమైనను, హల్లునకు హల్లు పరమైనను సంధి కార్యములు కలుగు" నని నిర్వచించినాడు. కన్నడ వ్యాకరణ కర్త యగు కేశిరాజును తన 'శబ్దమణి దర్పణము'న "వర్ణసంయోగమే సంధి" యని నిర్వచించినాడు. వారి ననుసరించి ప్రాచీన లాక్షణికులును వర్ణసంయోగమే సంధియని నిర్వచించినట్లు విశదమగును (కేతన - 106....108 పుటలు). కాగా చిన్నయసూరి ఏర్పచుకొన్న ప్రణాళికను జాగ్రత్తగా పరిశీలించినచో - ఆదేశములు, ఆగమములు, వికల్పరూపములు, బహుళములు, లోపములు, విభాష రూపములు అన్నియు సంహితయందు కలుగుచున్న వే అని స్పష్టమగును. 'సంధియగు' అని సూరి చెప్పిన అన్నింటిలోను పూర్వస్వర స్థానమున పరస్వరము ఏకాదేశముగా వచ్చుచున్నది. కనుక అచ్‌సంధులన్నియు ఆదేశసూత్రముల క్రిందికే వచ్చును. అందువలన - బాలవ్యాకరణమున 'సంధి యగు' అని చెప్పినవి మాత్రమే సంధులనియు, మిగిలిన రూపములు సంహిత వలన కలిగిన వనియు కొందరు భావించుట సమంజస

మనిపించదు. అంతేకాక – సంధి నిర్వచనమును సూరి 'సంధి పరిచ్ఛేద ప్రారంభమున కాక, ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధియగు' అన్న మొదటి సూత్రము క్రింద వృత్తిగా చెప్పుటను బట్టి అచ్‌సంధి జరిగిన రూపములను ఆదేశరూపములుగానే భావించెనని విశదమగును.

అంతేకాక – తెలుగు భాషాసంప్రదాయము ననుసరించి చిన్నయసూరి అచ్ సంధులను మాత్రమే అంగీకరించినాడని, హల్సంధులు ఆయనకు అంగీకారములు కావని చెప్పిన విషయమును సరిగా కనిపించదు. సంశ్లేషరూపముల నంగీకరించుట (పూచెన్గలువలు, మెరసెన్జడ్డము) ఆయన హల్సంధులను అంగీకరించుటను ధ్రువ పరచుచున్నది. అంతేకాక 'వీరల్గోపించిన' వంటి రూపములును ఉదాహరణములలో చూపించుట గమనార్హము.

కాగా – మిగిలిన ఆగమరూపములు, వికల్పరూపములు; లోప రూపములు, బహుళములు అన్నియు సంహితయం దేర్పడిన రూపభేదములగుటచే సూరి వానినన్నింటిని ఈ సంధి పరిచ్ఛేదమునందే చేర్చి విరచించినాడు.

ఇక ఈ సంధివలన కలుగు ప్రయోజనములు రెండు –

1. ఉచ్చారణ సౌలభ్యము : అనగా పదములమధ్య అచ్చులున్నచో పలుకుటయందు సౌలభ్యము ఉండదు. ఉదాహరణకు – 'రాముడతడు' అన్న పదబంధములోని సౌలభ్యము 'రాముడు అతడు ' అన్నప్పుడు కన్పించదు.

2. శ్రుతి సుభగత్వము : అనగా వినుటకు ఇంపుగా నుండుట. ఉదాహరణకు– 'అతడున్నాడు' అన్న పదబంధ మున్నంత ఇంపుగా 'అతడు ఉన్నాడు' అన్నపుడు అనిపించదు.

ఇవి రెండును సంధివలని ప్రయోజనములు.

కాగా సంధి వలన ఎన్ని ప్రయోజనము లున్నను, రెండు సందర్భములందు మాత్రము సంధి చేయరాదు. అవి –

1. అర్థము మారిపోవునప్పుడు : ఉదాహరణకు – 'పెక్కు + ఇక్కట్లు' అని ఉన్నపుడు "కర్మధారయంబునం దుత్తున కచ్చు పరంబగు నేపుడు టుగాగమం బగు"

(బాల-సంధి-28) అన్న సూత్రము ప్రకారము "పెక్కు టిక్కట్లు' అని యగును. అప్పుడు అర్థమే మారిపోవును.

2. శ్రుతికటువుగా నున్నపుడు : ఉదాహరణకు - 'పెక్కు + ఇక్కట్లు' అని ఉన్నప్పుడు "ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు " (బాల-సంధి-1) అన్న సూత్రము ప్రకారము సంధి చేసినచో 'పెక్కిక్కట్లు' అని యగును. అది చెవులకు ఇంపుగా నుండదు.

కనుక ఇట్టి చోటులందు సంధి చేయరాదు.

## 2. అచ్సంధులు

"పూర్వపరస్వరంబులకుఁ బరస్వరం బేకాదేశంబగుట సంధి యనంబడు" (బాల - సంధి-1-వృత్తి) - అని చిన్నయసూరి సంధినిగూర్చి చెప్పినాడు. అనగా పూర్వస్వరమునకును పరస్వరమునకును బదులుగా పరస్వరము వచ్చుటయే సంధి యనిస్పష్టమగును. పూర్వస్థానము నందలి వర్ణమునకును పరస్థానమునందలి వర్ణమునకును బదులుగా ఒకే వర్ణము వచ్చిన యెడల ఏకాదేశ మందురు.

సంధి పరిచ్ఛేద ప్రారంభమున సూరి అచ్సంధులను వివరించినాడు. వానిలో మొదటి పదము చివర అచ్చు ఉండి, పరపదమునకు ప్రారంభమునను అచ్చున్నచో వచ్చెడి రూపభేదములను నిరూపించినాడు. అందుకే చిన్నయసూరి మొట్టమొదటనే సంధి నిర్వచనమును ఈయక, "ఉత్తున కచ్చుపరంబగునపుడు సంధి యగు" (బాల-సంధి-1) అన్న సూత్రము క్రింది వృత్తిలో అచ్సంధి స్వరూపమును వివరించినాడు. కనుక సూరి చెప్పిన సంధి నిర్వచనము, అచ్సంధులకు మాత్రమే పరిమితమగుచున్నది.

ఆ సూత్రములలో సూరి ఎచ్చటను సంధి నిత్యముగా వచ్చునని చెప్పలేదు. ప్రతి సూత్రమునకు చివర 'అగు' ననియే చెప్పియున్నాడు. దానిని చూచి సంధి నిత్యమని భ్రమించరాదు.'అగును' అనుదానికిని 'నిత్యము' అనుదానికిని భేదము కలదు. నిత్యము అనగా "కృతాకృత ప్రసంగి నిత్యంబు నాబడు" అని. కనుక ఎట్టి పరిస్థితుల యందైనను సంధి ప్రవర్తించి తీరవలెను. కాని 'అగును' అన్నప్పుడు మాత్రము అట్లు కాదు. ఆసూత్రమునందలి విధికి భిన్నముగా వేరొక విధి ఉండునంత వరకును ఆనియమమును అనుసరింపవలె నని భావము. భిన్నముగా విధించినపుడు ఈ సూత్రము పని చేయదు. ఉదా: అచ్చున కచ్చు పరమైనపుడు పరస్వరమేకాదేశము కావలసియుండగా - అతడు +ఋషి = అతడు ఋషి - అనియే ఉండును. దీనికి కారణమును సూరి ప్రకీర్ణక పరిచ్ఛేదములో - "ఋ ౡ వర్ణంబులు ర ల తుల్యంబులు" (బాల-ప్రకీర్ణ-1) అని వివరించినాడు. ఋవర్ణము రవర్ణముతో తుల్యమగుట వలన సంధి కవకాశము లేకపోయినది. ఇట్టివాని కవకాశము కల్పించుటకే సూత్రమున నిత్యము అని కాక అగునని మాత్రమే చెప్పినాడు.

ఋ,ౡ లు ర, ల లతో సమానమైనవి కనుక వాని మీద ఏ విధమైన సంధి కార్యములు జరుగుటలేదు. కాగా - అ, ఇ, ఉ, ఋవర్ణములు అంతమందున్న

పదములకు ఏవైనను అచ్చులు పరమైనపుడు జరుగు సంధికార్యములు మాత్రమే ఈ అచ్సంధులలో వివరింపబడినవి.

## 1. ఉత్వసంధి :

"ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు" (బాల-సంధి-1). అనగా హ్రస్వ ఉకారమునకు అచ్చు పరమైన యెడల సంధి యగు నని అర్థము. ఉదా: రాముడు+అతడు = రాముడతడు; సోముడు +ఇతడు = సోముడితడు; మనము + ఉంటిమి = మనముంటిమి; అతడు + ఎక్కడ = అతడెక్కడ; ఇతడు + ఒకడు = ఇతడొకడు.

పై సూత్రమున సూరి ఉత్తునకు అని తపరకరణము చేసి చెప్పుట వలన ఈ సంధికార్యము హ్రస్వమైన ఉకారమునకు మాత్రమే నిర్దేశింపబడినదని అర్థము. దీర్ఘములైన అచ్చులపై సంధి ప్రవర్తిల్లదు. అట్టి చోట్ల - "సంధి లేని చోట స్వరంబు కంటెఁ బరంబయిన స్వరంబునకు యడాగమంబగు" అన్న సూత్రము ప్రకారము = మా + అమ్మ = మాయమ్మ; మీ+ ఇల్లు =మీ యిల్లు ; మా + ఊరు = మాయూరు అని అగును. ఈ సంప్రదాయము తెలిసిన సూరి ఉకారము అనక ఉత్తునకు అనియే సూత్రీకరించినాడు.

కాని ద్వితీయ మొదలుకొని సప్తమి వరకు గల విభక్తుల చివర నున్న ఉకారమునకును, వర్తమానకాలమున (శత్రర్థమున) వచ్చునట్టి 'చు' అను వర్ణము చిరనున్న ఉకారమునకును సంధి వైకల్పికముగా నగుచున్నది. అందువలన సూరి "ప్రథమేతరవిభక్తి శత్రర్థ చువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగు" (బాల-సంధి-2) అని చెప్పినాడు. ఉదంతములైన ప్రథమేతర విభక్తులు నాలుగు. అవి - ను, కొఱకు, కు, అందు- అనునవి. ఈ నాలుగింటి చివరనున్న ఉకారమునకును, చువర్ణము చివరి ఉకారమునకును, సంధి వైకల్పికముగానగు నని అర్థము. వైకల్పికమనగా సూత్రము విధించిన కార్యము జరుగుటకు కాని, జరుగకుండుటకు కాని అవకాశము ఉండుట. అనగా సూత్రవిధి జరుగుటవలన ఒక రూపమును, జరుగకుండుట వలన మరొక రూపమును కలుగుచున్నవి. ఉదా: నన్ను (న్) +అడిగె= నన్నడిగె, నన్నునడిగె; నా కొఱకు (న్) + ఇచ్చె = నా కొఱకిచ్చె, నాకొఱకునిచ్చె; వచ్చుచు (న్) + ఉండెను = వచ్చుచుండెను, వచ్చుచునుండెను.

## 2. అత్వ సంధి :

"అత్తునకు సంధి బహుళముగా నగు " (బాల-సంధి-4) - అనగా హ్రస్వ అకారమునకు అచ్చు పరమైనపుడు సంధి అనేక విధములుగా (బహుళముగా) అగునని అర్థము. ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యత్వము అని బహుళము నాలుగు విధములు. ప్రవృత్తి అనగా నిత్యముగా వచ్చుట. అప్రవృత్తి అనగా నిత్యముగా రాకుండుట. విభాష యనగా వైకల్పికముతోపాటు నిషేధమును కలిసియుండుట. అన్యత్వమనగా సూత్రమునందలి నిర్దేశమునకు మరొక విధానము జరుగుట. ఉదా:

ప్రవృత్తి : మేన+అల్లుడు = మేనల్లుడు; చూడక+ఉండెను = చూడకుండెను.

అప్రవృత్తి : మేన+అల్లుడు = మేనయల్లుడు; చూడక + ఉండెను = చూడకయుండెను.

విభాష: వైకల్పికముగా వచ్చినపుడు - మేనల్లుడు, మేనయల్లుడు; చూడకుండెను, చూడకయుండెను.

నిత్యముగా జరిగిన రూపములు - నన్నయ , తిక్కన, మూరెడు, అర్థించు.

నిషేధము: వెల+ఆలు = వెలయాలు

అన్యత్వము : తామర +ఆకు = తామరపాకు; ఒక + ఒక =ఒకానొక.

"బహుళ గ్రహణముచేత స్త్రీవాచక తత్సమ సంబోధనాంతములకు సంధి లేదు" (బాల - సంధి - 4 - వృత్తి) అని సూరి నిర్దేశించినాడు. అప్పుడు-

స్త్రీవాచకములకు - అమ్మ+ఇచ్చెను = అమ్మయిచ్చెను.

తత్సమములకు - దూత+ఇతడు = దూతయితడు.

సంబోధనాంతములకు - చెలువుడ + ఇందము = చెలువుడయిందము.

కాని, ఆధునిక కావ్యములందు స్త్రీవాచకములకు, తత్సమములకును సంధి కనబడుచున్నది.

తత్సమమునకు : గంగ+అనుకాసె = గంగనుకాసె ( ఆముక్త - 2 ఆ)

స్త్రీ వాచకమునకు : నెలత+ఇచ్చెను = నెలతిచ్చెను.

కాని రామయ్య, సీతమ్మ,లక్ష్మమ్మ వంటి తత్సమ స్త్రీవాచకశబ్దములకు అచ్చుపరమైనపుడు సంధి నిత్యముగా నగుచున్నది. ఈ విధి అదంతములకే కాక ఇదంతముల పైనను కన్పించుచున్నది. అందువలన ప్రౌఢవ్యాకరణకర్త- శ్రేష్ఠతా వాచకంబులగు నార్యాంబాద్యర్థక శబ్దములు పరంబులగుచో నన్ని యచ్చులకును సంధి నిత్యము" (ప్రౌఢ -సంధి-1) - అని నిర్దేశించినాడు.

తత్సమములకు: రామ + అయ్య = రామయ్య, సోమయ్య.
తద్భవమునకు : సామి +అయ్య == సామయ్య.
స్త్రీవాచకములకు: సీత + అమ్మ = సీతమ్మ (అదంతము); లక్ష్మి + అమ్మ = లక్ష్మమ్మ (ఇదంతము).

ఇచ్చట సూత్రమున నిత్యమని చెప్పుటచేత ఎట్టి పరిస్థితులయం దైనను సంధి చేయవలయుననియే భావము. వికల్పరూపము లుండవు.

## 3. ఇత్వసంధి :

"ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగానగు" (బాల-సంధి-5) - ఏమి, మఱి మున్నగు వానిని ఏమ్యాదు లందురు. కి(షష్ఠి) అనగా షష్ఠీ విభక్తి యందు వచ్చు కి ప్రత్యయ మని అర్థము. వీనికి సంధి వైకల్పికమని అర్థము. ఉదా॥ ఏమి + అంటివి = ఏమంటివి, ఏమియంటివి; మఱి + ఏమి = మఱేమి, మఱియేమి; హరికిన్+ ఇచ్చె = హరికిచ్చె, హరికినిచ్చె - ఇవికాక మిగిలిన వానికి సంధి చేయరాదని భావము.

ఇట్లే - "క్రియా పదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు" (బాల-సంధి-6) - ఉదా : వచ్చిరి + అప్పుడు = వచ్చిరప్పుడు, వచ్చిరియప్పుడు; వచ్చితిమి+ ఇప్పుడు = వచ్చితిమిప్పుడు; వచ్చితిమియిప్పుడు.

కాని"మధ్యమపురుష క్రియలయం దిత్తునకు సంధియగు" (బాల-సంధి-7) అనుటచే మధ్యమపురుష క్రియలకు మాత్రము సంధి జరుగునని స్పష్టము. ఉదా॥ ఏలితివి +అపుడు = ఏలితివపుడు; ఏలితి + ఇపుడు = ఏలితిపుడు; ఏలితిరి +ఇపుడు = ఏలితిరిపుడు.

కాని, భూతకాలిక అసమాపకక్రియల చివరి ఇకారమునకు సంధి జరుగదు. అందువలననే "క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు" (బాల-సంధి-8) - అని సూరి చెప్పినాడు. ఉదా: వచ్చి + ఇచ్చెను = వచ్చియిచ్చెను. కాని కొన్ని ప్రాచీన ప్రామాణిక ప్రయోగములలో క్త్వార్థకేకారమునకును సంధి కనబడుచున్నది. అందువలననే ప్రౌఢవ్యాకరణ కర్త- "ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడు" (ప్రౌఢ-సంధి-2) అని చెప్పి కొన్ని ప్రయోగములను చూపినాడు ఉదా:

1. చాపము నా కందిమ్మనుడు (భార-విరాట-4ఆ) - ఇందులో 'అంది +ఇమ్ము' అన్నదానికి - అందుకొని ఇమ్ము అని అర్థము కావలయును. దీనిని శబ్దపల్లవముగా గ్రహించినచో పై సూత్రమునకు ఇబ్బంది కలుగదు. అప్పుడు మొదట అందు + ఇచ్చు= అందిచ్చు - అను శబ్దపల్లవరూప మేర్పడి, తరువాత దాని ప్రేరణార్థక రూపము 'అందిమ్ము' అని అగును.

2. వెఱచిట్లంబుధినాథనందనులు (నిర్వ - రామా -5ఆ) . దీనికి 'వెఱనిట్లంబుధినాథనందనులు' అని పాఠాంతరము కలదు. కావున దీనిని ప్రామాణికముగా తీసుకొనరాదు.

3. ఎఱింగెఱింగి (భాగ-9 స్కంధ) - ఇచ్చట క్త్వార్థకేకార సంధి జరిగిన దనుట నిశ్చయము.

4. నీ చేత చెప్పంపడే (ప్రభావతీ -4ఆ) - దీనికి 'చెప్పింపడే' అన్న పాఠాంతరమున్నది. కనుక ఇది సరియైనది కాదు. ఇటువంటి ప్రయోగములు ప్రాచీన, అర్వాచీన కావ్యములందు అనేకములు గోచరించుచున్నవి: చీర చించిచ్చు వారి దీవించువారు (ఆముక్త -6ఆ); అనవలసంటి గాని (విజయ - 1ఆ); ఆవిడ చూచిటు రమ్మటన్నచో (హంస -3ఆ).

ఇట్లు బాల - ప్రౌఢ వ్యాకరణకర్తలు అచ్సంధి స్వరూప స్వభావములను వివరించినారు.

# 3. ద్రుతకార్యము

నకారము ద్రుతము. ద్రుతము అంతమందున్న పదములు ద్రుతప్రకృతికములు. ద్రుతప్రకృతికములైన శబ్దములకు అచ్చులు కాని, హల్లులుకాని పరమైనపుడు వచ్చు రూపములు ఇందు నిర్దేశింపబడినవి.

1. "ఇఁకాదులకు ( దప్పద్రుతప్రకృతికములకు సంధిలేదు" (బాల-సంధి-9)- ఇఁక ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని, అను నాలుగింటికిని తప్ప మిగిలిన ద్రుతప్రకృతికములకు సంధిలేదని అర్థము. అనగా ద్రుతమునకు అచ్చు పరముగా నున్నను సంధి చేయరాదు. ఈ పై నాల్గింటికిని సంధి వైకల్పికముగా అగు నని సూరి నిర్దేశించినాడు. ఉదా॥ ఇఁకన్ + అతడు = ఇఁకతఁడు, ఇఁకనతఁడు మొదలైనవి.

కాని – "ప్రథమేతర విభక్తి శత్రర్థక చువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగు " (బాల–సంధి–2) అను సూత్రముచే 'ను, కొఱకు, కు, అందు, చు' అను ప్రత్యయములకును, 'అందు' ప్రత్యయమునకు ప్రతిరూపము లైన 'ఇందు, ఎందు'లకును సంధి వైకల్పికముగా నగుచున్నది. కనుక – ప్రస్తుత సూత్రములోని 'ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని'అను నాలుగు శబ్దములతోపాటు పూర్వసూత్రములోని 'ను' కొఱకు, కు, అందు, ఇందు, ఎందు, చు' అను ప్రత్యయములకు తప్ప మిగిలిన ద్రుతప్రకృతికములకు సంధి చేయరా దనిభావము.

కాని కొన్ని ప్రామాణిక ప్రయోగములలో ద్రుతమునకు అచ్చుపరమైనప్పుడు ద్విత్వము కలుగుచున్న దని ప్రౌఢవ్యాకరణకర్త(సంధి–3) చెప్పి, కొన్ని ప్రయోగములను చూపినాడు. అవి–

1. సర్వాంగునిన్ + అనుభూత (ఉ.హరి-6ఆ) అను నాచన సోమన ప్రయోగములో ద్రుతమునకు ద్విత్వము వచ్చి 'సర్వాంగునిన్ననుభూత' అను రూపమేర్పడినది. కాని దీనికి 'సర్వాంగు న,భ్యనుభూత....' అను పాఠాంతర మున్నది. కనుక అది సరియైన ఉదాహరణము కాజాలదు.
2. సర్వమున్+అతని = సర్వమున్నతని (భాగ-7 స్కంధం) అను పోతన ప్రయోగమున ద్విత్వము వచ్చినది. ఇది అంగీకరించవలసినదే.
3. చోట్లుంబలెన్ + ఉరుశోభ = చోట్లుంబలెన్నురుశోభ (కళా-7ఆ) అను పింగళి సూరన ప్రయోగమును అంగీకరించవలసినదే.

4. అన్+ఇష్టసఖి = అన్నిష్టసఖి - అను నన్నయ భట్టారకుని ప్రయోగములో ప్రౌఢవ్యాకరణకర్త 'అన్' అనుదాని చివర నున్నది ద్రుతమని భావించి చెప్పినాడు. కాని అది శబ్దగతమైనది కాని, ద్రుతము కాదు. కనుక అంగీకరించదగినది కాదు.

2. "ద్రుత ప్రకృతికముల మీది పరుషములకు సరళములగు" (బాల-సంధి-16)- ద్రుత ప్రకృతికములకు పరుషములు పరమైనచో అవి నిత్యముగా సరళములగునని అర్థము. ఉదా॥ పూచెను + కలువలు = పూచెనుగలువలు; తోచెను + చుక్కలు= తోఁచెనుజుక్కలు - మొదలైనవి.

3. "ఆదేశ సరళములకు ముందున్న ద్రుతంబునకు బిందు సంశ్లేషంబులు విభాష నగు" (బాల-సంధి-17) - అను సూత్రమును బట్టి, పరుషముల స్థానమున వచ్చిన సరళములకు (ఆదేశ సరళములకు) ముందున్న ద్రుతమునకు బదులుగా పూర్ణానుస్వారముగాని, అర్ధానుస్వారముగాని, సంశ్లేషముగాని విభాషగా వచ్చును. సంశ్లేషమనగా ద్రుతము మీదిహల్లుతో కూడుకొనుట. పక్షమున స్వత్వంబగును - అనగా ద్రుతమునకు ప్రకృతి భావము కలుగును. అనగా ఉన్నది ఉన్నట్లే ఉండిపోవును. ఉదా॥ పూచెను +గలువలు = పూచెంగలువలు, పూచెఁ గలువలు, పూచెన్గలువలు, పూచెనుగలువలు.

సూత్రములో 'విభాష' అను పదమున్నది. నిషేధమును, వికల్పమును కలిసియున్న యెడల విభాష అనబడును. అందువలన " తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబులేదు" (బాల-సంధి-27) - అను సూత్రము ప్రకారము తాను, నేను అను ద్రుతప్రకృతికములకు ఆదేశ సరళములు పరములైనప్పుడు వికల్పరూపముతో పాటు రావలసిన సంశ్లేషరూపములు నిషేధింపబడినవి. దీనివలన - తాను చదివె= తాఁజదివె; తాను జదివె - అన్న రెండేరూపములు ఏర్పడు చున్నవి. 'దీర్ఘముపైన సాధ్యపూర్ణములేదు' (బాల-సంజ్ఞా-15)- అన్న సూత్రముప్రకారము నిండు సున్నతో సున్న రూపము (తాంజదివె) కూడ ఉండదు.

4. "ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోప సంశ్లేషంబులు విభాష నగు" (బాల-సంధి-18) - ద్రుతమునకు సరళములుకాని, స్థిరాక్షరములుకాని పరమందున్నచో లోపముకాని, సంశ్లేషము కాని విభాషగా నగునని అర్థము. ఉదా ॥

సరళములు పరమైనచో -వచ్చెను + గోవులు = వచ్చెగోవులు (లోపము) ;వచ్చెన్గోవులు (సంశ్లేషము); వచ్చెను గోవులు (స్వత్వము).
స్థిరములు పరమైనచో - మెఱసెను+ ఖడ్గము = మెఱసెఖడ్గము (లోపము); మెఱసెన్ఖడ్గము (సంశ్లేషము); మెఱసెనుఖడ్గము (స్వత్వము).

"వర్గయుక్సరళములు పరములగునపు డొకానొక చో ద్రుతమునకుఁ బూర్ణ బిందువును గానంబడియెడి" (బాల-సంధి-19) - అనగా ద్రుతమునకు వర్గయుక్కులుగాని, సరళములుకాని పరములైనచో, కొన్ని చోట్ల ఆ ద్రుతమునకు బదులు బిందువు వచ్చుచున్న దని అర్థము. వర్గయుక్కులనగా ప్రతి వర్గములోని 2వ, 4వ అక్షరములు. అవి- ఖ ఘ ఛ ఝ ఠ ఢ థ ధ ఫ భ (10).గ జ డ ద బ లుసరళములు. ఉదా॥ వచ్చెను + ధాత్రీపతి = వచ్చెంధాత్రీపతి; పాడెను + గంధర్వుడు = పాడెంగంధర్వుడు; కన్ + దోయి = కందోయి.

ద్రుతమునకు సరళ స్థిరములు పరమైనప్పుడు లోప సంశ్లేషలు రాగా – వచ్చె ధాత్రీపతి (లోపము), వచ్చెన్ధాత్రీపతి (సంశ్లేషము) వచ్చెను ధాత్రీపతి (స్వత్వము) అను మూడు రూపము లేర్పడినవి. కాగా ప్రస్తుత సూత్రమును బట్టి – వచ్చెంధాత్రీపతి అను నాలుగవ రూపమును ఏర్పడినది.

'కందోయి'కి - 'కన్దోయి', 'కనుదోయి' అను రెండు రూపములు పై సూత్రము (బాల-సంధి-19) వలన ఏర్పడుచున్నవి. కాగా – "అఁట యిఁక చుఁడు శబ్దంబులం దప్ప నుడి తొలి హ్రస్వంబు మీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు" (బాల-సంధి-22) - అన్న సూత్రము ప్రకారము అఁట, ఇఁక, చుఁడు అను మూడు పదములును కాక, మిగిలిన ఏ పదమునందలి తొలిహ్రస్వము పైనను అరసున్న ఉండరాదు కనుక 'కఁదోయి' అను అనిష్టరూపము కలుగదు. అట్టి అనిష్ట రూపమును వారించుటకే సూత్రమున 'విభాష' అని పేర్కొనబడినది.

5. "కొన్ని యెడల ద్రుతంబు మీద నకారంబు గానంబడియెడి" (బాల-సంధి-21) - అనగా కొన్ని ప్రయోగములందు ద్రుతముపై మరొక నకారము కనిపించుచున్న దని అర్థము. ఉదా॥ అదియును న్గాక; దివంబునుంబోలె. సూత్రములో 'కానంబడియెడి' అని చెప్పుట వలన, ఇట్టి ప్రయోగము లున్నవని అంగీకరించుటయే కాని, అట్లు చేయవలెనని విధించుట కాదని గ్రహింపవలెను.

6. "సమాసంబునయందు ద్రుతంబునకు లోపంబగు" (బాల-సంధి-24)– అనగా సమసము నందు పూర్వపదము చివరనున్న ద్రుతమునకు లోపము కలుగునని అర్థము. ఉదా : ఎల్లన్ + అర్థములు = ఎల్లయర్థములు; ఎల్లన్ + కలుషములు = ఎల్లకలుషములు.

సంస్కృతములోని 'సర్వ' శబ్దమునకు పర్యాయపదమైన 'ఎల్ల' శబ్దము ద్రుతాంతమైన అవ్యయమనియు, దానికి అసమాసమునను, విశేష్యమునకు ముందును ప్రయోగము లేదని సూరి నిర్దేశించినాడు. కాని ప్రౌఢవ్యాకరణకర్త 'సర్వపర్యాయంబయిన యెల్ల శబ్దమునకు సప్తమియు, అసమాసంబున విశేష్యములకు ముందు ప్రయోగంబునుం జూపబ్టెడు" (ప్రౌఢ -సంధి-7)– అని సూత్రీకరించి సూరి సూత్రమును సవరించినాడు.

సూరి ఉద్దేశ్యము ప్రకారము 'ఎల్ల' శబ్దము అవ్యయము కనుక దానికి లింగముకాని, విభక్తికాని, వచనముకాని ఉండరాదు. కాని ప్రౌఢవ్యాకరణకర్త దానిపైన సప్తమీవిభక్తి ప్రత్యయమైన 'అందు' చేరుచున్నదని చెప్పి,"ఎఱిగె సకలశాస్త్రంబుల నెల్లియందున్" (ఆది -7ఆ) అన్న నన్నయ ప్రయోగమును చూపినాడు. కాని సందర్భమును బట్టి ఇక్కడ 'అందు' శబ్దమునకు 'ప్రదేశము' అని అర్థము చెప్పుట ఉచితము. అప్పుడది విభక్తి ప్రత్యయము కాదు. ఇట్టిదే – "ఎల్లయందును దా వసియించు నెల్ల" (ఉద్యో-2ఆ) అన్న తిక్కన ప్రయోగమును.

కాగా – ఎల్ల శబ్దమునకు అసమాసమున విశేష్యమునకుముందు ప్రయోగము లేదని సూరి నిర్దేశించినాడు. కాని ప్రౌఢవ్యాకరణకర్త దానికి అతిరిక్తముగా "ఎల్లన్ శిష్యులఁ గొంచు వత్తునా" (భీమ- 2ఆ) అన్న శ్రీనాథుని ప్రయోగమును చూపినాడు. ఇచ్చట ద్రుతమునకు లోపము రాలేదు కనుక వ్యస్తప్రయోగమే అని అంగీకరింపక తప్పదు. కాని ఇది ఒక్క ప్రయోగము తప్ప ఆంధ్ర సాహిత్యములో ఇంకొక ప్రయోగము కన్పింపదు. కాగా – వ్యాసుని ఆకలితీవ్రతను సూచించుటకే శ్రీనాథుడు అట్టి అప్రయోగమును కావలెనని చేసినాడని సమర్థింపఁజూచినను అది వ్యాకరణ శాస్త్ర దృష్ట్యా సాధువు కానేరదు.

7. "సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బరుష సరళములు పరములగునపుడు నుగాగమంబగు"(బాల-సంధి-25)– అనగా ఉదంతములైన స్త్రీ సమశబ్దములకును, పు ంపులు అంతమందున్న శబ్దములకును, పరమందు పరుష సరళములున్నచో నుగాగమమగు నని సూత్రార్థము. ఇచ్చట ఆగమముగా వచ్చిన 'ను'

వర్ణము' ద్రుతము. కనుక పరుషములు పరమైనచో బాల-సంధి-16వ సూత్రము ప్రకారము బిందు సంశ్లేషలను మూడు రూపములును, సరళములు పరమైనచో బాల-సంధి-18,19 సూత్రముల ప్రకారము లోప సంశ్లేష బిందువులను మూడు రూపములును వచ్చును. ఉదా॥1. స్త్రీ సమములకు పరుషములు పరమైనచో- చిగురు + కయిదువు= చిగురుంగయిదువు, చిగురుఁగయిదవు, చిగురున్గయిదువు; సరళములు పరమైనచో తళుకు + గజ్జెలు = తళుకు గజ్జెలు, తళుకున్గజ్జెలు, తళుకుంగజ్జెలు.
2. పు ంపులకు - పరుషములు పరమైనచో - సింగపు+కొదమ = సింగపుంగొదమ, సింగపుఁగొదమ, సింగపున్గొదమ; సరళములు పరమైనచో - ఉన్నతంపు + గొడుగు ఉన్నతంపుగొడుగు, ఉన్నతంపుంగొడుగు, ఉన్నతంపున్గొడుగు.

ఇక్కడ సూరి "విధానసామర్థ్యము వలన దీనికి లోపము లే దని" వృత్తిలో నిర్దేశించినాడు. విధానసామర్థ్యము అనగా - సహజముగా లేని ద్రుతమును కావలెనని ప్రస్తుతసూత్రము ప్రకారము విధించుటవలన పూర్వసూత్రము (బాల-సంధి-24) ప్రకారము సమాసములందలి ద్రుతమునకు లోపము రాదని సూరి ప్రత్యేకముగా చెప్పినాడు.

అంతేకాక - "సమాసంబులందు ద్రుతంబునకు స్వతంబు లేదు" (బాల-సంధి-26) అని నిషేధించి, 'చిగురును గయిదవు' వంటి అనిష్టరూపములను పరిహరించినాడు సూరి.

8. "తలఁద్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపము లేదు" (బాల-సంధి-27) - అనగా పూర్వసూత్రమునుబట్టి సమాసద్రుతమునకు లోపము రావలసి యుండగా, 'తలఁద్రాలు' వంటి సమాసములలో ద్రుతమునకు లోపము కలుగ దని అర్థము. ఉదా॥ తలన్ + ప్రాలు = తలఁద్రాలు, తలంద్రాలు, తలన్బ్రాలు. కనుక ప్రస్తుత సూత్రమును బట్టి 'తలప్రాలు' అను అనిష్టరూపము వారింపబడినది.

9. "ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశం బగు" (ప్రౌఢ -సంధి-22) - అనగా ప్రాసస్థలములందు ద్రుతమునకు మకారము పరమైనచో, ఆ ద్రుతమునకు మకార మాదేశ మగును. ఉదా॥ కమ్మనిలతాంతములకు మ్మొనసి (భార-ఆది-5ఆ) ;వృష్టిఁజేసెమ్మహానది (భార-ఆర-3ఆ).

ఇట్లు బాల-ప్రౌఢవ్యాకరణకర్తలు ద్రుతకార్యములను వివరించినారు.

## 4. ఆదేశము

"శత్రువ దాదేశః" – శత్రువువలె వచ్చునది. అనగా ఒక వర్ణమును త్రోసివేసి దానిస్థానమున మరొకటి వచ్చుట ఆదేశము.

సంధి పరిచ్ఛేద ప్రారంభములో సూరి అచ్సంధులను వివరించినాడు. వానిన్నింటి యందును పూర్వపదాంతమున నున్న స్వరమును త్రోసి పరపదాది యందున్న స్వరము వచ్చుచున్నది. కనుక అచ్సంధిలన్నియు ఆదేశరూపముల లోనికే వచ్చును. ఇచ్చిన సంధి నిర్వచనములో కూడ 'పరస్వరం బేకాదేశం బగు' అన్న మాటలలో పై భావమే వ్యక్తమగును.

1. "ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు" (బాల-సంధి-1)- అనగా హ్రస్వ ఉకారమునకు అచ్చు పరమైనచో పూర్వ పర స్వరముల స్థానమున పరస్వరము ఏకాదేశ మగుచున్నది. ఉదా॥ రాముడు + అతడు = రాముడతడు; మనము +ఉంటిమి= మనముంటిమి.

2. ఉదంతములైన " ప్రథమేతర విభక్తి శత్రర్థ చువర్ణంబు లందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగు " (బాల-సంధి-2)నని చెప్పినాడు సూరి. అనగా ఉదంతములైన ప్రథమేతర విభక్తులు ను, కొఱకు, కు, అందు అను నాల్గింటికిని, శత్రర్థ 'చు' ప్రత్యయమునకును అచ్చుపరమైనచో వాని చివరనున్న ఉకారమునకు బదులు పరస్వరము వైకల్పికముగా వచ్చుచున్నది. ఉదా॥ నన్ను+అడిగె = నన్నడిగె; వచ్చుచు +ఉండెను = వచ్చుచుండెను.

3. "అత్తునకు సంధి బహుళము" (బాల-సంధి-4)- అనగా హ్రస్వఅకారమునకు అచ్చుపరమైనపుడు కూడ సంధి యగుచున్నది. అప్పుడు - మేన +అల్లుడు = మేనల్లుడు; చూడక + ఉండెను = చూడకుండెను వంటి రూపము లేర్పడుచున్నవి.

రామయ్య - సోమయ్య వంటి శబ్దములలోను, సీతమ్మ - లక్ష్మమ్మ వంటి స్త్రీ వాచకములకును కూడ సంధి నిత్యముగా కన్పట్టుచున్నది. అందువలన ప్రౌఢవ్యాకరణ కర్త - "శ్రేష్ఠతా వాచకంబులగు నార్యంబా ద్యర్థక శబ్దములు పరంబులగుచో నన్నియచ్చులకును సంధి నిత్యము" (ప్రౌఢ -సంధి-1) - అని నిర్దేశించినాడు.

4. "ఏమ్యాదుల ఇత్తునకు సంధి వైకల్పికముగా నగు " (బాల-సంధి-5) అనగా ఏమి, మఱి, మున్నగువానికిని, షష్ఠీ విభక్తి యందు వచ్చు 'కి' ప్రత్యయమునకు కూడ సంధి అగుచున్నది. మఱి + ఏమి = మఱేమి; హరికి + ఇచ్చె = హరికిచ్చె- వంటి రూపములలోను పరస్వరము ఏకాదేశముగనే వచ్చుచున్నది.

ఇట్లు అచ్చులపైననే కాక కొన్ని ఇతర శబ్దములకును అచ్చు పరమైనపుడు ద్విరుక్తటకారము పుంపులు వంటివి ఆదేశమగుచున్నవి.

5. "కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దముల ఱ, డ ల కచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారంబగు" (బాల-సంధి-12). అనగా – కుఱు, చిఱు అను శబ్దములలోని అకారమునకును, కడు, నడు, నిడు అను శబ్దములలోని డకారమునకును, అచ్చు పరమైనచో ద్విరుక్తటకార మగును. ఉదా॥ కుఱు+ఉసురు = కుట్టుసురు ; చిఱు - ఎలుక = చిట్టెలుక; కడు+ఎదురు = కట్టెదురు; నడు+ఇల్లు = నట్టిల్లు ; నిడు + ఊర్పు నిట్టూర్పు. ఈ ద్విరుక్తట కారాదేశము సమాసమునందు మాత్రమే అగునని సూరి యిచ్చిన ఉదాహరణములను బట్టి స్పష్టమగుచున్నది.

ప్రౌఢవ్యాకరణకర్త ఈ సూత్రములోని చిట్టెలుక అను రూపమును మాత్రము తీసుకొని, చిట్టడవి, చిట్టాముదము, చిట్టీదు, చిట్టుడుకు వంటి రూపములలో పూర్వపదము 'చిఱు' అనుటకంటె 'చిట్టి 'అని గ్రహించుట సమంజస మని తెలుపుచు "చిట్టడవిఁ జిట్టి" (ప్రౌఢ -సంధి -4) అని సూత్రీకరించినాడు. ప్రౌఢవ్యాకరణకర్త ఉద్దేశ్యము ప్రకారము పై రూపములలోని పూర్వపదము సూరి చెప్పినట్లు 'చిఱు' అని కాక, 'చిట్టి' అని తాత్పర్యము. కాని ఇది ఒక్క 'చిట్టెలుక' వంటి రూపములు సాధించుటకు మాత్రమే ఉపకరించుచున్నది. మిగిలిన వానిని సూరి చెప్పినట్లు అంగీకరింపక తప్పదు. తమిళ కన్నడ భాషలలోను 'చిఱు' అన్నదే మూలరూపముగా కన్పించుచున్నది. కనుక భాషాశాస్త్రజ్ఞులఅభిప్రాయము ప్రకారము చిట్టెలుక వంటి రూపములలో పూర్వపదము చిఱు అనియే స్పష్టమగును. అందువలన సూరి చెప్పిన విధానము వ్యాకరణ పద్ధతినే కాక భాషాశాస్త్ర పద్ధతికిని అనుకూలముగా నున్నది. కనుక ప్రౌఢవ్యాకరణ కర్త చెప్పిన విధానము కంటె బాలవ్యాకరణ కర్త చెప్పినదే సమంజసముగా నున్నది. కాగా ఒకేవిధమైన ప్రక్రియను అనుసరించుచున్న కొన్ని శబ్దముల నుండి ఒక్కదానిని వేరుచేసి మరొకపద్ధతి ననుసరించినట్లు చెప్పుట ప్రయోజనవంతము కానేరదు.

6. "కర్మధారయంబులందు ము వర్ణకంబునకుం బుం పు లగు" (బాల-సంధి-30)- అనగా కర్మధారయ సమాసములలోను తత్పురుష సమాసములలోను పూర్వ శబ్దము చివర మువర్ణ మున్నచో దానికి ఆదేశముగా పు, ంపు అనునవి వచ్చునని సూత్రార్థము. ఉదా: సరసము + మాట = సరసపుమాట, సరసంపుమాట (కర్మధారయము) సింగము +కొదమ = సింగపుఁగొదమ, సింగపుంకొదమ (తత్పురుషము).

7. "ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదుల తొలియచ్చు మీది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారం బగు" (బాల-సంధి-40) - ద్విరుక్తము యొక్క పరరూపము ఆమ్రేడితము. అట్టి ఆమ్రేడితము పరమగునపుడు (ఆధిక్యసూచకమైన) కడ మొదలగువాని అచ్చుమీది వర్ణములన్నింటికిని బదులుగా అదంతమైన ద్విరుక్తటకారము ఆదేశమగు నని అర్థము. కడ, ఎదురు, కొన,చివర,తుద, పగలు, బయలు, పిడుగు మొదలైనని కడాదులు. ఉదా: కడ+కడ = కట్టకడ; ఎదురు +ఎదురు = ఎట్టయెదురు మొదలగునవి.

ఈ సూత్రమున అగు అని చెప్పుట వలన ప్రవృత్తిరూపమునే సూరి అంగీకరించినట్లు విశదమగుచున్నది. కాని 'తెలతెలవారె' వంటి ప్రయోగములలో ఈ ద్విరుక్తటకారము కనిపించుట లేదు. అందువలన ఈ విధి వైకల్పికమని చెప్పినచో బాగుండెడిది. ఇట్లే- నాడు + నాడు = నానాడు, నాడునాడు; ఇంచుక+ఇంచుక = ఇంచించుక, ఇంచుకించుక వంటి వైకల్పికరూపములును ఉన్నవి. వీని నన్నిటిని "ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగు " (బాల-సంధి-41) అన్న సూత్రమున సాధించినాడు సూరి.

అంతేకాక - "అందదుకు ప్రభృతులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు" (బాల-సంధి-42) అన్న సూత్రమునను ఇట్టి రూపములను కొన్నింటిని సూరి ప్రదర్శించినాడు. కాని అక్కడ ద్విరుక్తటకారము వచ్చుటలేదు. ఉదా: అదుకు+అదుకు= అందదుకు; చెదరు + చెదరు = చెల్లాచెదరు; తునియలు + తునియలు = తుత్తునియలు - మొదలగునవి. వీని యందు అనేక విధములైన రూపములు కన్పించు చుండటచే వాని నన్నింటిని ప్రయోగములను బట్టి గ్రహింపవలె నని సూరి నిర్దేశించినాడు. ఇట్టివే - విఱ్ఱవీగు, విచ్చలవిడి, తునాతునకలు మొదలగునవి.

8. సరళాదేశమును, గసడదవాదేశమును కూడ ఆదేశరూపముల క్రిందికే వచ్చును.

1. ద్రుతప్రకృతికముల మీది పరుషములకు సరళము లగు (బాల-సంధి-16) అని చెప్పిన సూరి, తరువాత సూత్రమున "ఆదేశ సరళములకు ముందున్న ద్రుతంబునకు బిందు సంశ్లేషంబులు విభాషనగు" (బాల-సంధి-17) అని చెప్పియున్నాడు. ఇందులో సరళములు ఆదేశముగనే వచ్చుచున్నవని "ఆదేశసరళంబులు" అని సూరి ప్రారంభించుటను బట్టియే విశదమగుచున్నది. ఉదా: పూచెను +కలువలు = పూచెంగలువలు, పూచెఁగలువలు, పూచెన్గలువలు.

2. ఇట్టిదే గసడదవాదేశమును. "ప్రథమమీది పరుషములకు గసడదవలు బహుళముగా నగు" (బాల-సంధి-13) - అను సూత్రమును బట్టి - వాడు+కొట్టె =వాడుగొట్టె; అపుడు + చనియె = అపుడుసనియె - వంటి రూపము లేర్పడుచున్నవి. ఈ ఉదాహరణములలో క చ ల కు, గ స లు, ఆదేశముగనే వచ్చుచున్నవి.

9. "ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశం బగు" (ప్రౌఢ-సంధి-22). అనగా - ప్రాసస్థలము నందు మకారము పరమైనచో ద్రుతమునకు బదులు మకారము ఆదేశమగునని అర్థము. ఉదా: కమ్మని లతాంతములకుమ్మొనసి వచ్చు (భారత -ఆది-5ఆ); వృష్టిఁ జేసెమ్మహానది (భారత -ఆరణ్య -3ఆ).

ఈ విధముగా బాల-ప్రౌఢ వ్యాకరణ కర్తలు ఆదేశరూపములను వివరించినారు.

# 5. ఆగమము

ఆగమ మనగా వర్ణాధిక్యము. "మిత్రవ దాగమః" –మిత్రునివలె వచ్చిచేరునది. అనగా ఏ వర్ణమును త్రోసివేయక అదనముగా వచ్చి చేరునదని యర్థము.

## 1. యడాగమము :

1. "సంధి లేనిచోట స్వరంబుకంటెఁబరంబయిన స్వరంబునకు యడాగమం బగు " (బాల-సంధి-3) అన్న సూత్రములో పూర్వపదాంతమందును, పరపదాది యందును స్వరములే యుండి సంధి కలుగని యెడల పరస్వరమునకు పూర్వము 'యట్' అనునది ఆగమముగా వచ్చి చేరునని అర్థము. ఉదా॥ మా+అమ్మ – అనునపుడు తెలుగున దీర్ఘము మీద సంధి లేదు కావున, యడాగమము వచ్చి 'మాయమ్మ' అని యగును. ఇట్లే – మీ యిల్లు, మా యూరు – వంటివి కూడ.

2. "క్త్వార్థంబైన ఇత్తునకు సంధి లేదు " (బాల-సంధి-8) అన్న సూత్రము ప్రకారము ఇదంతములైన భూతకాలిక అసమాపకక్రియలకు అచ్చు పరముగా నున్నను సంధి వచ్చుట లేదు. అట్టి చోట్లలో కూడ యడాగమము వచ్చి – వచ్చి +ఇచ్చెను = వచ్చియిచ్చెను – వంటి రూపములు ఏర్పడుచున్నవి. కాని ప్రౌఢవ్యాకరణకర్త దీనిని సవరించుచు కొన్ని ప్రమాణిక ప్రయోగములందు సంధి కనపడుచున్న దని చెప్పి కొన్ని ప్రయోగముల నిచ్చి నాడు. అందులోచాపము నాకందిమ్మనుడు (విరాట-4ఆ)– అన్న తిక్కన ప్రయోగములో 'అందిమ్ము' అనునది, అందిచ్చు అను శబ్దపల్లవము యొక్క విధ్యర్థక రూపము. అట్లే వెఱచిట్లుంబుధినాథనందనులు (నిర్వ-5ఆ) అన్న తిక్కన ప్రయోగమునకు 'వెఱనిట్లంబుధి' అను పాఠాంతర మున్నది కనుక అదియును సరియైన రూపము కానేరదు. కాగా– ఎఱింగెఱింగి (భాగ-9 స్కంధం) అను పోతన ప్రయోగము మాత్రము యడాగమమునకు ఉదాహరణమే.

## 2. నుగాగమము :

1.సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళములు పరము లగునపుడు నుగాగమం బగు" (బాల-సంధి -25). అనగా – సమాసవృత్తియందు ఉదంతములైన స్త్రీ సమములకును, పుం పు లకును పరుష సరళములు పరము లగునపుడు నుగాగమ మగుచున్నది. ఉదా॥ పరుషములకు

చిగురు+కయిదువు = చిగురుంగయిదువు, చిగురుఁగయిదువు, చిగురున్గయిదువు.
సరళములకు - తళుకు +గజ్జెలు = తళుకుగజ్జెలు, తళుకుంజ్జెలు, తళుకున్గగజ్జెలు.

పై ఉదాహరణములలో ఆగమముగా వచ్చిన నువర్ణము 'ద్రుతము' కనుక, అచ్చట ద్రుతకార్యము జరిగి, పరుషములు పరమైనపుడు బిందు సంశ్లేషములును, సరళములు పరమైనపుడు లోప సంశ్లేషములును వచ్చినవి.

2 "ఉదంత మగు తద్ధర్మార్థక విశేషణముల కచ్చు పరమగునపుడు నుగాగమం బగు" (బాల-సంధి-33). అనగా - ధాతువు యొక్క అర్థమును బోధించు తద్ధర్మార్థక క్రియావిశేషణముల (చేయు, చేసెడు మొదలగునవి) చివరి ఉత్తునకు అచ్చు పరమైనపుడు నుగాగమము వచ్చుచున్నది. ఉదా : చేయు +అతడు = చేయునతడు ; చేసెడు+అతడు= చేసెడునతడు.

ధాతుజవిశేషణముతో ఏర్పడెడి సమాసము కర్మధారయము. కర్మధారయంబు లందు ఉత్తున కచ్చు పరంబగు నపుడు టుగాగమము (బాల-సంధి-28) రావలయును. (కఱకుటమ్ము, నిగ్గుటద్దము - మొదలగునవి). కాని ప్రస్తుతసూత్రము (బాల-సంధి-33) ప్రకారము నుగాగమము వచ్చుచుండుటచే (చేయు నతడు , చేసెడు నతడు) సూరి వానిని కూడ సాధించినాడు. ప్రస్తుత సూత్రమునకు అవకాశము కల్పించుటకే బాల-సంధి-28వ సూత్రమున 'అగు' నని చెప్పుట గమనార్హము. కాని ఈ నుగాగమము రాని కొన్ని ప్రాచీన ప్రయోగములును కన్పించు చున్నవి. 'కొల్చురగ సంఘములు' (కొల్చు+ ఉరగ) అని బసవపురాణము (3 ఆశ్వా -1959) నను, 'మాంత్రికుని నోర వెడలగ్ని దీప్తు లనగ (వెడలు +అగ్ని) అను హంసవింశతి (5ఆ) లోను నుగాగమము కనబడక పోవుట గమనించదగినది.

3. "షష్ఠీసమాసంబునం దుకార ఋకారముల కచ్చు పరమగు నపుడు నుగాగమం బగు" (బాల-సంధి-34)- షష్ఠీతత్పురుష సమాసములలో పూర్వశబ్దము చివర నున్న ఉకార ఋకారములకు అచ్చు పరమైనచో నుగాగమ మగునని అర్థము. ఉదా: రాజు + ఆజ్ఞ = రాజునాజ్ఞ ; విధాతృ+ఆనతి = విధాతృనానతి.

కాని, కొన్ని ప్రాచీన ప్రయోగములలో నుగాగమము రాని రూపములును కన్పించుచున్నవి. అందువలన ప్రౌఢవ్యాకరణకర్త- "కొన్నిచోట్ల షష్ఠీసమాసంబునం

దుకారంబున కచ్చు పరంబగునపుడు నుగాగమంబునకు లోపంబు నగు" (ప్రౌఢ-సంధి-10)- అని సూరి సూత్రమును సవరించినాడు. ఇది కేవలము ఉకారాంతములకే వర్తించుచున్నది కాని,ఋకారాంతములకు వర్తించుట లేదని గమనింపలెను. అంతేకా 'నుగాగమంబునకు లోపంబును అగు' అనుటచే, నుగాగమ ప్రాప్తిని ప్రౌఢవ్యాకరణకర్త అంగీకరించినట్లే అని విశదమగును. కనుక దీనిని సూరి సూత్రమునకు సవరణమనుట కంటె, వివరణమనుట సమంజసము. ఉదా: గోకులము + ఇల్లిలు = గోకులమిల్లిలు (హరి-పూ-5ఆ) ;బచ్చు+ఇంట = బచ్చింట (పాండు -3ఆ); శిరసు + అందము = శిరసందము (కళా-7ఆ).

4. "ఉదంత స్త్రీసమములకును, ఋంపులకు, నదంత గుణవాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమం బగు" (బాల-సంధి-35). అనగా- ప్రథమైకవచన ప్రత్యయము లోపించిన ఉదంత స్త్రీసమ శబ్దములకును, కర్మధారయములందు మువర్ణమునకు ఆదేశముగా వచ్చిన పుంపులకును, అదంతములైన గుణవాచకములకును, తద్ధిత ప్రత్యయమైన 'తనము' పరమైనచో నుగాగమ మగు నని అర్థము.
ఉదా: సొగసుందనము, సరసపుందనము, తెల్లందనము - మొదలగునవి.

5. "సమాసంబునం బ్రాతాదుల తొలియచ్చుమీది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు"(బాల-సంధి-36)- అన్న సూత్రము ప్రకారము తొలి యచ్చుమీది వర్ణములన్నియు లోపించి - ప్రాత+ఇల్లు = ప్రాయిల్లు, లేఁత + దూడ = లేఁదూడ - మొదలగురూపము లేర్పడును. ఆ తరువాత -"లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమం బగు" (బాల -సంధి-37) - అను సూత్రము ప్రకారము నుగాగమ మగుచున్నది. ఈ ఆగమ నువర్ణము ద్రుతము కావున ద్రుతకార్యము జరిగి ప్రాఁగెంపు, లేఁగొమ్మ, పూఁదోట వంటి రూపము లేర్పడుచున్నవి. కాని- మీదు + కడ= మీఁగడ; కెంపు + తామర = కెందామర; చెన్ను + తొవ = చెందొవ - వంటి రూపములలో పై సూత్రము ప్రకారము (బాల-సంధి-36) తొలియచ్చుమీది వర్ణములన్నిటికిని లోపము నిత్యము. లుప్తశేషమునకు ద్రుతకార్య మగును. అందువలన మీదుకడ, కెంపుతామర, చెన్నుదొవ, వంటి వైకల్పిక రూపములు కలుగవు. అందువలననే సూత్రమున 'బహుళము' అనుపదము నిబంధింపబడినది.

కాగా - ప్రాఁతాదులకు వలెనే క్రొత్తాదులకును ఈ నుగాగమము కలుగుచున్నది. అందువలన "క్రొత్త శబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్ని యెడల నుగాగమంబును,

గొన్ని యెడల మీది హల్లునకు ద్విత్వంబు నగు" (బాల-సంధి-38)- అని సూరి సూత్రించినాడు. అనగా క్రొత్త శబ్దమునకు కూడ ఆద్యక్షరశేషమై, దానికి పరుషములు పరమైనచో కొన్ని చోట్ల నుగాగమ ద్రుతకార్యములును , కొన్నిచోట్ల ద్విత్వమును అగు నని అర్థము.ఉదా: క్రొత్త +చాయ = క్రొంజాయ ; క్రొత్త +పొగ = క్రొంబొగ (భాస్కర-యుద్ధ-7-19); క్రొత్త +తావి = క్రొత్తావి (విరాట-2-236); క్రొత్త +కారు=క్రొక్కారు (విరాట-2-83) మొదలగునవి.

కాగా -పరుషేతరములు పరములగునపుడు, నుగాగమప్రాప్తి లేమిచే వానికి ద్విత్వము వచ్చును. ఉదా: క్రొత్త +గండి = క్రొగ్గండి (కుమార -11-702); క్రొత్త+ నన = క్రొన్నన.

సూరి ఈ సూత్రమును 'క్రొత్త' శబ్దమునకే విధించినట్లున్నను, వృత్తియందు- 'కెంధూళి,కెంజడలు' వంటి ప్రయోగములున్నవని చెప్పినాడు. కనుక ఈ సూత్రము 'కెంపు' మొదలైన వానికి కూడ వర్తించునని భావము.

అంతేకాక- "బహుళగ్రహణము చేతఁ గ్రొత్త కుండ లిత్యాదులకు లోపంబు లేదు" అని చెప్పినాడు. దానివలన క్రొత్త +కుండ = క్రొత్తకుండ అనియే యగును. అందుకు కారణము బహుళగ్రహణమున నిషేధము కూడ అంతర్భవించి యుండుటయే.

కాగా -క్రీఁగడుపు, క్రీఁగాలు వంటి రూపములలో 'క్రింది' శబ్దమున కంతటికిని 'క్రీ' అనునది ఆదేశమగుచున్నది. అందువలననే సూరి- "క్రింది శబ్దమునకు లుప్తశేషమునకు దీర్ఘము బహుళగ్రహణముచేత నని యెఱుంగునది" (బాల-సంధి-38-వృత్తి) అని జ్ఞాపకము చేసినాడు.

ఇట్లన్నింటికిని సరిపోవునట్లు బాల-సంధి-36 వ సూత్రమున 'బహుళము' అను పదమును ప్రయోగించి అన్ని రూపములకు వీలు కల్గించినాడు సూరి.'

'అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచో గానంబడియెడి" (బాల-సంధి-39)- అన్న సూత్రములో సూరి ఈ నుగాగమాదులువచ్చిన మరికొన్ని రూపములను చూపినాడు. ఉదా: పది+తొమ్మిది = పందొమ్మిది; తొమ్మిది + పది = తొంబది (కర్ణ-1-102); నెఱ + నడుము =నెన్నడుము; నిండు + వెఱ =నివ్వెఱ- మొదలైనవి.

ప్రస్తుత ఉదాహరణములలో సూరి కేవలము తెలుగు శబ్దములనే చెప్పుట వలన దానికి పూరణముగా ప్రౌఢవ్యాకరణకర్త ఈ నుగాగమాదులు తత్సమ శబ్దములు

పరమగునపుడును కలుగుచున్నవని ఇట్లు చెప్పినాడు- "సమాసమందుఁ దత్సమంబు పరంబగునపుడును నుగాగమాదులు గానంబడియెడి" (ప్రౌఢ-సంధి-12)- అనగా సమాసమందు ఉత్తరపదముగా తత్సమపద మున్నపుడును నుగాగమ మగునని ప్రౌఢవ్యాకరణకర్త అభిప్రాయము. ఉదా: ముందు + కోపము = ముంగోపము (విరాట-3ఆ); వెల్లి +చామరము = వింజామరము (ఆముక్త-4ఆ).

### 3. టుగాగమము :

1. "కర్మధారయంబులం దుత్తున కచ్చు పంరబగునపుడు టుగాగమం బగు" (బాల-సంధి-28). అనగా- కర్మధారయమునందును తత్పురుషము నందును పూర్వపదము చివరి ఉత్వమునకు అచ్చు పరమైనయెడల టుగాగమము వచ్చున నని అర్థము. ఉదా: కర్మధారయమునకు కఱకు + అమ్ము = కఱకుటమ్ము; సరసపు +అలుక =సరసపుటలుక- ఇట్టివే - తేనెటీగ, పల్లెటూరు, పక్కాటెముక - మొదలగునవి.తత్పురుషములకు -వేల్పు +ఆవు = వేల్పుటావు; సముద్రము + ఒడ్డు = సముద్రపుటొడ్డు.

సూత్రములోని 'అగు' అను పదమునుబట్టి ఈ టుగాగమము నిత్యము అని అనిపించును. కాని, పెక్కు + ఎడల = పెక్కెడల (ఉద్యో-4-264) అన్న తిక్కన ప్రయోగములో టుగాగమము లేదు. అట్లే 'మిద్దెయిల్లు' వంటి టుగాగమ రహిత రూపములే వ్యవహారమున నున్నవి కాని, 'మిద్దెటిల్లు' వంటి రూపములు లేవు. అట్లే 'పెంకుటిల్లు' వంటి టుగాగమ రూపమే కాని 'పెంకిల్లు' వంటి రూపములును లేవు. కనుక ఈ సూత్రమును విభాషగా చెప్పినచో సమంజసముగా నుండెడిది.

కాని కర్మధారయమున 'పెన్వాదుల'కు అచ్చుపరమగునపుడు టుగాగమము కాక ద్విత్వము కన్పించుచుండుటచే ప్రౌఢవ్యాకరణకర్త-'తఱచుగఁ గర్మధారయ సమాసంబునం బెన్వాదుల కడహల్లున కచ్చు పరంబగునపుడు ద్విత్వంబు గానంబడియెడి" (ప్రౌఢ-సంధి-9)- అని చెప్పి - పెను +అదరులు = పెన్నదరులు (రామా -యుద్ధ); పెను +ఉద్ది = పెన్నుద్ది (పాండు -3ఆ); పెను +ఒడలు = పెన్నొడలు (భోజ -6ఆ)- వంటి ప్రయోగములను చూపినాడు. కనుక ఇది అంగీకరించవలసినదే.

2."కర్మధారయంబునందుఁ బేర్వాది శబ్దముల కచ్చు పరంబగునపుడు టగాగమము విభాష నగు" (బాల-సంధి-29). అనగా- కర్మధారయసమాసములో పేరు మొదలైన శబ్దములకు అచ్చు పరమైనచో టుగాగమము విభాషగా నగునని అర్థము.

ఉదా: పేరు + ఉరము = పేరుటురము, పేరురము; చిగురు + ఆకు = చిగురుటాకు, చిగురాకు; పొదరు + ఇల్లు = పొదరుటిల్లి, పొదరిల్లు.

ఇక్కడ సూత్రమున 'కర్మధారయ సమాసము' లో అని చెప్పుటవలన ఇది కర్మధారయమునకే వర్తించును కాని, తత్పురుషములకు వర్తించ దని గ్రహించవలెను.

## 4. రుగాగమము :

1. "పేదాదిశబ్దంబుల కాలు శబ్దంబు పరంబగునపుడు కర్మధారయమునందు రుగాగమం బగు " (బాల-సంధి-30)- అనగా కర్మధారయ సమాసమునందు పేద మొదలగు శబ్దములకు ఆలుశబ్దము పరగునపుడు రు వర్ణము ఆగమ మగునని అర్థము. పేద , బీద, ముద్ద, బాలెంత, కొమ, జవ, ఐదువ, మనుమ, గొడ్డు - ఇవి పేదాదులు. ఉదా:పేద+ఆలు = పేదరాలు; బీద + ఆలు = బీదరాలు. ఇట్లే ముద్దరాలు, బాలెంతరాలు, కొమరాలు, ఐదువరాలు, మనుమరాలు, గొడ్డురాలు మొదలగునవి. 'గొడ్డురాలు' అను రూపమునకు 'గొడ్రాలు' అను రూపమును కన్పించుచున్నది. అట్లే 'జవరాలు' అను రూపమున 'జవ్వనిశబ్దంబునకు జవాదేశం బని యెఱుంగునది' అని సూరి జ్ఞాపకము చేసి, 'ఏకాంతమునందునున్న జవరాండ్ర' నను మనుచరిత్రలోని పద్యము నుదాహరించినాడు.

2. కర్మధారయ సమాసములలో ఈ 'ఆలు' శబ్దము కేవలము తెలుగు శబ్దములపైననే కాక, తత్సమశబ్దములపైనను కనించుచున్నది. అందువలన సూరి- "కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబు నగు" (బాల-సంధి-31) అని సూత్రీకరించినాడు. అనగా కర్మధారయ సమాసములలో తత్సమశబ్దములకు ఆలుశబ్దము పరమైనచో, ఆ తత్సమ శబ్దము పైని అత్వమునకు ఉత్వము వచ్చి, తరువాత రుగాగమ మగునని అర్థము. ఉదా: ధీర +ఆలు= ధీరురాలు; గుణవంత + ఆలు = గుణవంతురాలు.

ఇచ్చట 'ఆలు' శబ్దమునకు 'భార్య' అను మరొక అర్థ మున్నను; ప్రస్తుత సందర్భమును బట్టి 'స్త్రీ' అని మాత్రమే గ్రహింపవలె నని నిర్దేశించినాడు. అందువలన పేదరాలు అనగా పేదయైన స్త్రీ అనియు; ధీరురాలు అనగా ధైర్యముగల స్త్రీ అనియు అర్థమును గ్రహింపవలెను.

సూత్రములో 'కర్మధారయంబునందు' అని నిర్దేశించుట చేత ఈ రుగాగమము కర్మధారయ సమాసములకే పరిమితమని గ్రహింపవలెను. కాని తత్పురుషసమాసములలో కూడ ఆలు శబ్దము చేరి "పేదయాలు, ధీరునాలు' వంటి రూపము లేర్పడుచున్నవి. అప్పుడవి షష్ఠీతత్పురుష సమాసములై పేదవానియొక్క భార్య, ధీరునియొక్క భార్య అను అర్థముల నిచ్చును. అట్టి ప్రయోగములలో రుగాగమము కలుగదు. కనుక సూరి కర్మధారయములకే దీనిని విధించుట, తెలుగువ్యాకరణ విధానము నెరిగి చేసిన రచనయని స్పష్టమగుచున్నది (బాల-ప్రౌఢ-వ్యాఖ్య-పు.118).

## 5. పుగాగమము :

"తామర కాకు పరంబగునపుడు పుగాగమం బగు" (ప్రౌఢ -సంధి-8)- 'తామర' శబ్దము 'తామరస' శబ్దము యొక్క తద్భవరూపము. దీనికి 'ఆకు' పరమైనప్పుడు 'పు' వర్ణము ఆగమముగా వచ్చు నని అర్థము. ఉదా: తామర + ఆకు = తామరపాకు . నాచన సోమనాథుని 'తామరపాకు నీరువలె' (ఉ.హరి-3ఆ) వంటి ప్రాచీన కవుల ప్రయోగము లాధారముగా ప్రౌఢవ్యాకరణకర్త ఈ సూత్రమును రచించియుండును. కానీ, సూత్రమున 'అగు' అని నిత్యముగా కాక, 'వికల్పంబుగా నగు' నని చెప్పవలసియుండినది. లేనిచో 'తామరాకు' వంటి లోకప్రసిద్ధ వ్యవహారములకు అవకాశము లేకుండ పోవును.

## 6. ముగాగమము :

"ధ్వన్యనుకరణ శబ్దముల కను ధాతువు పరంబగచో కొన్ని యెడల ముగాగమం బగు " (ప్రౌఢ -సంధి-19). అనగా -ధ్వన్యనుకరణ శబ్దములైన కనకన, సలసల వంటి శబ్దములకు 'అను' ధాతువును చేర్చినచో ముగాగమ మగు నని సూత్రార్థము. ఉదా : కనకన + అను = కనకనమను (రామా -6ఆ); సలసల + అను = సలసలమను (పాండు-5ఆ).

## 7. వుగాగమము :

"ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమం బగు" (బాల-సంధి-54). అనగా -ఉదంతమైన నామముపై అను ధాతువును చేర్చినచో వు వర్ణము ఆగమము గా నగు నని అర్థము. ఉదా: ఇయంధేను + అనె = ఇయంధేనువనె.

ఈ విధముగా బాల-ప్రౌఢవ్యాకరణ కర్తలు ఆగమ రూపములను ప్రదర్శించినారు.

# 6. వికల్పము

వికల్పమనగా సూత్రమున విధింపబడిన కార్యము జరుగుట లేదా జరుగకుండుట. అనగా సూత్రవిధి ప్రవర్తించుటవలన ఒక రూపమును, ప్రవర్తింపకపోవుట వలన మరియొక రూపమును కలుగును.

1. " ప్రథమేతరవిభక్తి శత్రర్థక చువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగు" (బాల-సంధి-2). అనగా-ఉకారాంతములైన ను, కొలకు, కు, అందు-లకును (ప్రథమేతర విభక్తులకును), శత్రర్థ చువర్ణము చివరి ఉకారమునకును, అచ్చు పరమైనచో సంధి వైకల్పికముగా నగు నని అర్థము. ఉదా॥ నన్నున్+అడిగె=నన్నడిగె, నన్నునడిగె; వచ్చుచున్+ఉండెను=వచ్చుచుండెను, వచ్చుచునుండెను.

ఉత్తున కచ్చు పరమగునపుడు సంధి కావలసియుండగా, ప్రస్తుత సూత్రముచే వికల్పరూపము లేర్పడుచున్నవి.

2. అదంతములైన శబ్దములకు అచ్చు పరమైనప్పుడును సంధి వికల్పముగా జరుగుచున్నది (బాల-సంధి-4). ఉదా॥ మేన+అల్లుడు=మేనల్లుడు, మేనయల్లుడు; పుట్టిన+ఇల్లు=పుట్టినిల్లు, పుట్టిన యిల్లు. సంధియైనపుడు 'మేనల్లుడు' అనియు, సంధి కానప్పుడు యడాగమము కలిగి 'మేనయల్లుడు' అనియు వచ్చును.

3. "ఏమ్యాదుల ఇత్తునకు సంధి వైకల్పికముగా నగు" (బాల-సంధి-5)- ఏమి, మఱి, కిషష్ఠి (షష్ఠీవిభక్తియందు వచ్చు 'కి' ప్రత్యయము), అది, అవి వంటి ఏమ్యాదుల చివరి ఇకారమునకు, అచ్చుపరమైనచో సంధి వైకల్పికముగా నగునని అర్థము. ఉదా॥ ఏమి+అంటివి=ఏమంటివి, ఏమియంటివి ; హరికిన్+ఇచ్చె= హరికిచ్చె, హరికినిచ్చె.

4. "క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు" (బాల-సంధి-6). అనగా-క్రియా పదములచివరి ఇత్వమునకు సంధి వైకల్పికముగా అగునని అర్థము. ఉదా॥ వచ్చిరి + అప్పుడు =వచ్చిరప్పుడు, వచ్చిరియప్పుడు; వచ్చితిమి + ఇప్పుడు = వచ్చితిమిప్పుడు, వచ్చితిమియిప్పుడు.

ఇట్లు చిన్నయసూరి వికల్పరూపములను వివరించినాడు.

# 7. విభాష

"నవేతి విభాషా" - అనగా వైకల్పికమును, నిషేధమును కలిసియున్నచో విభాషయనబడును. అట్లుకాక- ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యత్వము అను నాల్గును లిసియున్నచో బహుళము అనబడును. బహుళగ్రహణమున విభాషకూడ అంతర్భవించియే ండుటవలన ఆరూపములుకూడ ఇందు గ్రహింపబడినవి.

1. "అత్తునకు సంధి బహుళముగా నగు" (బాల-సంధి-4). అనగా- అదంతశబ్దములకు అచ్చుపరమైనచో సంధి బహుళముగా వచ్చును. అందువలన మేనల్లుడు (ప్రవృత్తిరూపము), మేనయల్లుడు (అప్రవృత్తిరూపము) వంటి వికల్పరూపములతో బాటు- "బహుళగ్రహణముచేత స్త్రీవాచక తత్సమ సంబోధనాంతంబులకు సంధి లేదు" అని చెప్పి, అమ్మయిచ్చెను (స్త్రీవాచకము), దూతయితడు (తత్సమము), చెలువుడ యిందము (సంబోధనాంతము) వంటి వానిలో ప్రవృత్తిరూపములను నిషేధించినాడు సూరి.

2. "ప్రథమమీది పరుషములకు గసడదవలు బహుళముగా నగు" (బాల-సంధి-13)- అన్న సూత్రములో ప్రథమావిభక్త్యంత శబ్దములకు పరుషములు పరమైనచో సరళములు వచ్చునని చెప్పి-వాడు గొట్టె (ప్రవృత్తిరూపము), వాడు కొట్టె (అప్రవృత్తిరూపము) - అను రూపముల నిచ్చినాడు సూరి. ఆతరువాతి సూత్రమున "తెనుగుల మీది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు" (బాల-సంధి-14)- అని చెప్పి - వాడు కంసారి, వీడు చక్రపాణి వంటి రూపములలో నిషేధమును చెప్పినాడు.

3. "ద్రుత ప్రకృతికములమీది పరుషములకు సరళములగు" (బాల-సంధి-16) అనియు, అట్లు వచ్చిన "ఆదేశసరళములకు ముందున్న ద్రుతంబునకు బిందుసంశ్లేషంబులు విభాష నగు"- అనియు చెప్పి పూచెంగలువలు, పూచెఁగలువలు, పూచెన్గలువలు (ప్రవృత్తిరూపములు), పూచెనుగలువలు (స్వత్వమువలన ఏర్పడిన అప్రవృత్తిరూపము) అను రూపములను సాధించినాడు సూరి. ఆ తరువాత- "తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబులేదు" (బాల-సంధి-23)- అన్న సూత్రమున తాను నేను శబ్దముల చివరి ద్రుతమునకు సంశ్లేషరూపము నిషేధింపబడినది.

4. "అవసానంబునందు ద్రుతస్వరంబునకేని, ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు" (బాల-సంధి-20) అన్న సూత్రములో- వాక్యము చివరనున్న ద్రుతమునకుగాని, ద్రుతస్వరమునకుగాని లోపము బహుళముగా వచ్చు నని చెప్పినాడు సూరి. అందువలన- వాడు వచ్చెన్, వాడు వచ్చె, వాడు వచ్చెను- అను రూపము లేర్పడినవి. కాగా, గురువు చివరగల పద్యముల తుదనున్న ద్రుతమునకు లోపము రాదని నిషేధించి- "అతిశయముగ బుద్ధిమంతుడగు బుధ సేవన్' అని ఉదాహరించినాడు.

5. "కర్మధారయంబునందుఁ బేర్వాది శబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమము విభాషగా నగు" (బాల - సంధి-29)- కర్మధారయ సమాసములలో ఉదంతశబ్దములకు అచ్చు పరమైనచో నిత్యముగా వచ్చు టుగాగమము, పేర్వాది శబ్దములు పరమైనచో విభాషగా వచ్చుచున్నది. ఉదాః పేరురము (అప్రవృత్తి), పేరుటురము (ప్రవృత్తి). విభాష యనుటచేత పేరాకలి, పేరింపు వంటి వానిలో టుగాగమము రాదు. అట్లే వాలుటమ్ము (భార-శల్య-1-167) వంటి వానిలో అప్రవృత్తిరూపము ఉండదు.

6. సమాసమున ప్రాత, క్రొత్త వంటి శబ్దములకు అద్యక్షరశేషమై, నుగాగమ ద్రుతకార్యములు జరిగి - ప్రాఁగెంపు, కెందామర, క్రొంజాయ, క్రొంజీకటి (వసు-4-10) వంటి రూపములు ఏర్పడుచున్నవి. 'ప్రాతయిల్లు, క్రొత్తచెమట' వంటివి అప్రవృత్తిరూపములు. 'మీఁగడ, కెందామర' వంటి వానిలోనిది నిత్యముగా వచ్చుచున్నది. కాగా- "సమాసంబులందు ద్రుతంబునకు సంశ్లేషరూపము నిషేధింపబడినది. అందువలననే "వ్యవస్థిత విభాషచే నీ ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు" అని బాల-సంధి-37 సూత్రవృత్తియందు జ్ఞాపకము చేసినాడు సూరి. అట్లే- "విధాన సామర్థ్యమువలన దీనికి లోపము లేదు" (బాల-సంధి-25-వృత్తి) అనుదానినిబట్టి 'ప్రానుగెంపు, క్రొనుజాయ' వంటి స్వత్వరూపములును పరిహరింపబడినవి.

7. "అది యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగా నగు" (బాల-సంధి-45)- సమాసవృత్తియందు పూర్వశబ్దముపై నగలఅది, అవి శబ్దములలోని అత్వమునకు లోపము బహుళముగా అగుచున్నది. అందువలన- నాది, నావి వంటి ప్రవృత్తిరూపములును, నాయది-నాయవి వంటి అప్రవృత్తి రూపములును, కలుగుచున్నవి. కాగా- ఉదంత తద్ధర్మార్థక విశేషణములమీది అది, అవి శబ్దముల అత్వమునకు లోపము రాదని నిషేధింపబడినది. కనుక- 'వచ్చునది, వచ్చునవి' వంటి రూపములు మాత్రమే ఉండును.

8. "పడ్వాదులు పరంబు లగునపుడు మువర్ణకంబునకు లోప పూర్ణబిందువులు విభాషనగు" (బాల-సంధి-46) అను సూత్రము ప్రకారము- 'భయపడియె, భయంపడియె' వంటి ప్రవృత్తి రూపములును, 'భయముపడియె' వంటి అప్రవృత్తి రూపమును కలుగుచున్నవి. కాగా- "ఈకార్యము కర్తృవాచి మువర్ణకమునకుఁ గలుగదు"- అన్నవృత్తినిబట్టి 'గజము పడియె' అశ్వము పడియె అను రూపములు మాత్రమే ఉండును. ఇక్కడ విభాషచే లోప (గజపడియె) , పూర్ణబిందువు (గజంపడియె)లు నిషేధింపబడినవి.

9. "మధ్యమపురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాష నగు" (బాల-సంధి-47)- ఆశీ శ్శాప సంప్రార్థన విధులందు వచ్చు మధ్యమ పురుష మువర్ణమునకు హల్లుకాని, అవసానముకాని పరమగునపుడు లోపము విభాషగా నగునని అర్థము. అందువలన- 'చూడునన్ను,ఇటు చూడు' వంటి ప్రవృత్తి రూపములను, 'చూడునన్ను, ఇటు చూడుము' వంటి అప్రవృత్తి రూపములను కలుగుచున్నవి.

సూరి ఈ సూత్రమున 'విభాష' అని చెప్పినను, ప్రవృత్తి అప్రవృత్తి రూపములనే చూపినాడు కాని, నిషేధరూపమును చూపలేదు. కాని వృత్తిలో- 'చూడుమనియె, వినుమనియె' వంటిరూపములలో అచ్చు పరమైనది కనుక లోపము రాదని చెప్పినాడు. కాని అది నిషేధమని భావించుటకు వీలు లేదు. సూరి సూత్రమున హల్లులకు మాత్రమే చెప్పినాడు కనుక అచ్చులమీద విధించిన ఈ నిషేధము వానికి వర్తింపదు. కనుక ఇచ్చట విభాషయను పదము నుపయోగించుటలోని సామంజస్యము విచారణీయము.

ఇట్లే- "వ్యతిరేక మధ్యమ మువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాష నగు' (బాల-సంధి-48) అన్న సూత్రమున కూడ- నమ్మకుము+ఇట=నమ్మకిట, నమ్మకుమిట- అని వికల్ప రూపములనే సూరి ఇచ్చియున్నాడు. ఇచ్చటకూడ విభాషలో ఉండవలసిన నిషేధము కన్పించదు. అంతేకాక- హల్లు పరమైనప్పుడు వలె అచ్చు పరమైనప్పుడును లోపించుట ఇచ్చటి విశేషము.

10. "ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమముడుజ్జులకు లోపంబు విభాషనగు' (బాల-సంధి-49). అనగా- ఆమ్రేడితము పరమగునప్పుడు మధ్యమపురుష మువర్ణక- డువర్ణకములకు లోపము విభాషగా నగునని అర్థము. ఇక్కడకూడ సూరి- ఉండుము+ఉండుము=ఉండుండుము (ప్రవృత్తి), ఉండుముండుము (అప్రవృత్తి);

కొట్టుడు+కొట్టుడు=కొట్టుకొట్టుడు (ప్రవృత్తి), కొట్టుడుకొట్టుడు (అప్రవృత్తి)- అను వికల్పరూపములనే చూపినాడు కాని, విభాషలో ఉండవలసిన నిషిద్ధరూపములను చూపకుండుట విచారణీయము.

11. "అనుకృతిని నమశ్శబ్దముతుది యత్తున కోత్వము విభాష నగు" (బాల-సంధి-74). అనగా- నమశ్శబ్దము యొక్క తుది అత్వమునకు ఓత్వము విభాషగా నగు నని అర్థము. ఉదా: తుభ్యంనమః+అనె=తభ్యంనమోయనె (ప్రవృత్తి), తుభ్యంనమ యనె (అప్రవృత్తి). ఇచ్చట కూడ విభాషలో నుండవలసిన నిషేధము కన్పించదు.

ఇట్లు విభాష రూపములు వివరింపబడినవి.

# 8. బహుళము

బహుళ మనగా అనేకవిధము అని అర్థము.
"క్వచిత్ ప్రవృత్తిః క్వచి దప్రవృత్తిః
క్వచి ద్విభాషా క్వచి దన్యదేవ"-అని.

అనగా- ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యత్వము అని బహుళము నాలుగు విధములు. ప్రవృత్తి అనగా నిత్యముగా వచ్చుట; అప్రవృత్తి యనగా నిత్యముగా రాకుండుట; విభాష యనగా వికల్పముతో బాటు నిషేధమును కూడియుండుట; అన్యత్వమనగా సూత్రమున నిర్దేశించిన విధానమునకు బదులు మరొకటి జరుగుట. ఇన్ని విధానములకును అనుకూలత కల్పించుటకు'బహుళము' అని వాడబడును.

1. "అత్తునకు సంధి బహుళము" (బాల-సంధి-4)- అనగా అదంతశబ్దములకు అచ్చుపరమైనచో సంధి అగునని అర్థము. ఉదా: మేన+అల్లుడు=మేనల్లుడు(ప్రవృత్తి), మేనయల్లుడు (అప్రవృత్తి). బహుళగ్రహణముచే- స్త్రీవాచక(అమ్మయిచ్చెను), తత్సమ(దూతయితడు), సంబోధనాంతము (చెలువుడ యిందము) లకు సంధి జరుగదు (బాల-సంధి-4-వృత్తి) అని నిషేధింపబడినది. కనుక అది విభాష. కాగా- "తామరకాకు పరంబగునపుడు పుగాగమం బగు" (ప్రౌఢ-సంధి-8)- అన్నచోట అన్యత్వము (తామర+ఆకు=తామరపాకు) కన్పించుచున్నది. ఇట్లే- ఒక+ఒక = ఒకానొక.

2. "ప్రథమమీది పరుషములకు గసడదవలు బహుళముగా నగు" (బాల-సంధి-3). అనగా- ప్రథమావిభక్తి రూపములకు కచటతపలు పరమైనచో గ స డ ద వ లగును. ఉదా: వాడు+కొట్టె=వాడుగొట్టె (ప్రవృత్తి), వాడుకొట్టె(అప్రవృత్తి). పై విధి "తెనుగులమీది సాంస్కృతికపరుషములకు రాదు" (బాల-సంధి-14)- కనుక- వాడు+కంసారి=వాడు కంసారి అనియే యుండును(నిషేధము). కాని- వీరల్గోపించిన (ఉ.హరి-4ఆ), వేవణములు (విజ్ఞా-ప్రాయశ్చిత్తకాండ) వంటి ప్రయోగములలో సాంస్కృతికపరుషములపైనను కన్పించుచున్నదని ప్రౌఢకరణవ్యాకర్త (సంధి-6) చెప్పినాడు. తిక్కనవంటి మహాకవియు 'ఎంత గుమతులైన' అని ప్రయోగించుట ప్రౌఢవ్యాకరణకర్త చెప్పిన విషయమునే బలపరుచుచున్నది (బాల-ప్రౌఢ-వ్యాఖ్య-పు. 97).

ద్వంద్వసమాసములలో పూర్వశబ్దముపైన పరుషములున్నచో గ స డ ద వ లు నిత్యముగా కన్పించుచుండుటచే "ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గ స డ ద వ లగు" (బాల-సంధి-15) అని సూరి చెప్పినాడు. ఉదా: కాలు+చేయి=కాలుసేతులు; తల్లి+తండ్రి=తల్లిదండ్రులు.

కాని ప్రౌఢవ్యాకరణకర్త- కండెతుండెములు, రాకపోకలు వంటి రూపములను చూపి, "కొన్నియెడల ద్వంద్వంబునం బదంబుమీది చ త ప లకు స ద వ లు గానంబడవు" (ప్రౌఢ-సంధి-6)- అని సూత్రీకరించినాడు.

3. "సమాసంబులం బ్రాఁతాదుల తొలియచ్చు మీది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు" (బాల-సంధి-36) అన్న సూత్రములలో ప్రాతమొదలైన శబ్దములు పూర్వశబ్దములుగా నుండి, అవి తరువాతి శబ్దముతో సమసించినప్పుడు, వాని తొలియచ్చుమీది వర్ణములకు లోపము బహుళముగా అగునని అర్థము. 'బహుళము' అనుటవలన - ఉదా: ప్రాత+ఇల్లు=ప్రాయిల్లు(ప్రవృత్తి) ; ప్రాతయిల్లు (అప్రవృత్తి). మీఁగడ, కెందామర, చెందొవ- వంటి వానిలో పైసూత్రము (బాల-సంధి-36) వలన మిగిలినదానికి(లుప్తశేషమునకు) ద్రుతకార్యము నిత్యముగా జరుగుచున్నది. 'క్రొత్తకుండలు' వంటి వానిలో లోపము నిషేధింపబడినది. కాగా-'క్రీఁగడుపు' వంటి వానిలో అన్యత్వమును కన్పించుచున్నది.

4. "ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు" (బాల-సంధి-41). అనగా- ఆమ్రేడితము పరమందున్నప్పుడు పూర్వశబ్దము యొక్క విభక్తికి లోపము బహుళముగా నగు నని అర్థము. అందువలన- విభక్తిలోపము కలిగినచో- అప్పటికిన్+అప్పటికిన్=అప్పటప్పటికిన్- అని యగును. ఇచ్చట సూరి "ఇంచుక నాడిత్యాదులందు బహుళగ్రహణముచేత అంతిమాక్షరలోపం బగు"- అన్న వృత్తిని బట్టి- ఇంచుక+ఇంచుక=ఇంచించుక (అంతిమ కకారలోపము), నాడు+నాడు=నానాడు (అంతిమడువర్ణలోపము)- అను రూపములును కలిగినవి. అందదుకులు, చెల్లాచెదరు, తుత్తునియలు వంటి వానిలో పెక్కుమార్పులు సంభవించుచున్నవి కనుక అవి అన్యత్వమునకు ఉదాహరణము లనవచ్చును.

5. "అది యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగా నగు" (బాల-సంధి-45). అనగా - సమాసములలో పూర్వపదము పైనున్న అది - అవి

శబ్దములోని అత్తునకు లోపము బహుళముగా నగునని అర్థము. ఉదా : నా+అది = నాది, నాయది; నా+అవి = నావి, నాయవి. కాగా ఉదంత తద్ధర్మార్థ విశేషణముల మీది అత్తునకు లోపమురాదని సూరి వృత్తిలో చెప్పినాడు. ఉదా: వచ్చు + అది = వచ్చునది; వచ్చు + అవి = వచ్చునవి.ఇచ్చట "ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు" (బాల-సంధి-33) అను సూత్రము ప్రకారము నుగాగమము కలిగి - వచ్చునది, వచ్చునవి వంటి రూపము లేర్పడినవి.

అట్లే ఇదంతములైన తద్ధర్మవిశేషణముల మీది అత్తునకు లోపము నిత్యమని అదే సూత్ర వృత్తియందు సూరి చెప్పినాడు. కనుక - వచ్చెడి +అది = వచ్చెడిది; వచ్చెడి+అవి = వచ్చెడివి.

ఇట్లు బాల-ప్రౌఢవ్యాకరణకర్తలు బహుళ విధి వలన కలుగు చున్న రూపభేదములను ప్రదర్శించినారు.

# 9. లోపము

"అదర్శనం లోపః" – లోపమనగా కనిపించకపోవుట. కొన్ని పదములు ఒకదాని కొకటి సన్నిహితముగా నున్నప్పుడు ఆగమాదేశాది రూపములు కలిగినట్లే, కొన్నిచోట్ల విసర్గ, ద్రుతము వంటి వానికి లోపమును కలుగుచున్నది. కనుక బాల–ప్రౌఢ వ్యాకరణకర్తలు ఇట్లు లోపించుట వలన కలిగిన రూపములను ఈ సంధిపరిచ్ఛేదముననే సూత్రీకరించినారు.

1. ద్రుతమునకు సరళస్థిరములు పరమైనచో ఆ ద్రుతమునకు లోపము వచ్చును (బాల–సంధి–18) – ఉదా॥ వచ్చెను + గోవులు = వచ్చెగోవులు; మెఱసెను + ఖడ్గము = మెఱసెఖడ్గము.

2. వాక్యము చివరనున్న ద్రుతమునకుగాని, ద్రుతస్వరమునకుగాని లోపము బహుళముగా నగును (బాల–సంధి–20). ఉదా॥ వాడువచ్చె (ద్రుతలోపము); వాడువచ్చెన్ (ద్రుతస్వరలోపము); వాడువచ్చెను (స్వత్వము). ఈ విధి గురువు అంతమందుండ వలసిన పద్యములకు వర్తించదు. ఉదా॥ అతిశయముగ బుద్ధిమంతు డగు బుధసేవన్.

3. "సమాసంబునందు ద్రుతంబునకు లోపం బగు" (బాల – సంధి – 24). అనగా– సమాసమున పూర్వపదాంత్యమున నున్న ద్రుతమునకు లోపము వచ్చును. ఉదా॥ ఎల్లన్ + అర్థములు = ఎల్లయర్థములు; ఎల్లన్ + కలుషములు = ఎల్ల కలుషములు.

4. షష్ఠీసమాసములందు ఉకారమునకు అచ్చు పరమైనప్పుడు రావలసిన నుగాగమము కొందరు ప్రసిద్ధకవుల ప్రయోగములలో కన్పించదు. కనుక– "కొన్నిచోట్ల షష్ఠీసమాసంబునం దుకారంబున కచ్చు పరంబగునపుడు నుగాగమంబునకు లోపం బగు" (ప్రౌఢ–సంధి–10)– అని ప్రౌఢవ్యాకరణకర్త చెప్పినాడు. ఉదా॥ గోకుల మిల్లిలు(హరి–పూర్వ–5ఆ); బచ్చింట (పాండు–3ఆ); శిరసందము (కళా–7ఆ) మొదలైనవి.

5. సమాసమున ప్రాతాదుల తొలియచ్చుమీది వర్ణములకు లోపము (బాల–సంధి–36), లుప్తశేషమునకు నుగాగమమును (బాల–సంధి–37) రాగా, ద్రుతకార్యము

జరిగి 'ప్రాయిల్లు, లేదూడ, పూఁదోఁట' వంటి రూపము లేర్పడుచున్నవి. 'పందొమ్మిది, తొంబది' వంటి వానిలోను లోప-నుగాగమ-ద్రుతకార్యములు జరుగుచున్నవి.

6. అను, కొను మొదలగు ధాతుజ విశేషణములకు హల్లు పరమైనచో చివరి ఉకారమునకు లోపము వికల్పముగా వచ్చుచున్నది (ప్రౌఢ-సంధి-17). ఉదా: గిరివ్రజమన్పురంబు (భార-సభా-1ఆ); తొడువింటివాడు చన్ ద్రోవఁబోక (ఆము-1ఆ)మొదలైనవి.

7. ఆమ్రేడితంబు పరమైనప్పుడు విభక్తి లోపము బహుళముగా నగును (బాల-సంధి-4). ఉదా: అప్పటప్పటికిన్ (విభక్తిలోపము), అప్పటికప్పటికిన్ (లోపరాహిత్యము); ఇంటింటన్ (విభక్తిలోపము), ఇంటనింటన్(లోపరాహిత్యము).

8. "హలవసానంబులు పరంబులగునపు డేమి శబ్దము యొక్క మికారమునకు లోపంబు వైకల్పికంబు" - (ప్రౌఢ-సంధి-16). అనగా - హల్లుకాని, అవసానముకాని పరమగునప్పుడు 'ఏమి' శబ్దములోని మివర్ణమునకు లోపము వైకల్పికముగా అగు నని అర్థము. ఉదా: నీ కే ద్రాఁతియే (హరి-పూర్వ-5ఆ); శవముక్రియ నుండె దిదే (భాగ - 9 స్కంధ).

9. "షష్ఠీ సమాసమందలి నిలల మీది యచ్చులకు హల్లు పరంబగుచోఁ గొన్ని యెడల లోపంబు గానంబడియెడి" (ప్రౌఢ-సంధి-17). అనగా - షష్ఠీసమాసమున పూర్వ పదాంత్యమున నున్న నిగాగమ లడా గమముల మీది అచ్చులకు హల్లు పరమైనచో కొన్నిచోట్ల ఆ అచ్చులకు లోపము వచ్చుచున్నది. ఉదా: ఇంద్రున్వలెన్ (ఉత్తరరామా-2ఆ); తూలె రజనీచర భాస్కరబింబముల్ రుచుల్ (రామాభ్యు - 5ఆ).

10. అది, అవి శబ్దములలోని అత్తునకు, సమాసవృత్తి యందు లోపము (బహుళముగా) నగును (బాల-సంధి-45). ఉదా : నా + అది = నాది; నా + అవి = నావి.

11. పడ్వాదులు పరమైనప్పుడు మువర్ణకమునకు పూర్ణబిందువుతో పాటు లోపమును కలుగుచున్నది(బాల-సంధి-46). ఉదా: భయము+పడియె = భయంపడియె (పూర్ణబిందువు), భయపడియె (లోపము); సూత్రము + పట్టె = సూత్రంపట్టె (పూర్ణబిందువు), సూత్రపట్టె (లోపము).

12. (అ) "మధ్యమ పురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాష నగు" (బాల-సంధి-47). అనగా - ఆశీశ్శాప సంప్రార్థన విధులందు వచ్చు మధ్యమపురుష మువర్ణకమునకు, హల్లుకాని అవసానముకాని పరమైనచో ఆ మువర్ణమునకు లోపము విభాషగా వచ్చును. ఉదా॥ హల్లు పరమైనచో- చూడము+నన్ను = చూడునన్ను (ప్రవృత్తి); చూడుమునన్ను (అప్రవృత్తి); అవసానమున- ఇటు + చూడుము = ఇటుచూడు (ప్రవృత్తి); ఇటు చూడుము (అప్రవృత్తి).

(ఆ) ఈ మధ్యమ పురుష మువర్ణమునకు అచ్చు పరమైనచో లోపము లేదని (ఉదా॥ చూడుమనియె, వినుమనియె) సూరి వృత్తిలో చెప్పగా, ప్రౌఢవ్యాకరణకర్త "మధ్యమ పురుష మువర్ణకంబున కచ్చు పరంబగునపుడును గొన్ని యెడల లోపంబు చూపట్టెడి (ప్రౌఢ-సంధి-18) అని చెప్పి- ఆడిదె నీదు పందెము (కళా-6ఆ), ఎద్దిచెప్పనినన్ (మార్క-1ఆ) అను ప్రయోగములను చూపినాడు. ఇందులో కళాపూర్ణోదయ ప్రయోగమునకు 'ఆడితె నీదు పందెము' అని పాఠాంతరమున్నది. అట్లే మారన ప్రయోగములో యతిభంగమైనది కనుక అదియును సరియైన ఉదాహరణము కాదు.

(ఇ) కాగా - వ్యతిరేకార్థమున నున్న మధ్యమ పురుష మువర్ణమునకు హల్లుకాని అచ్చుకాని, అవసానముకాని పరమైనచో లోపము విభాషగా అగుచున్నది. ఉదా అచ్చుపరమైనప్పుడు -నమ్మకుము+ఇట = నమ్మకిట, నమ్మకుమిట. హల్లుపరమైనప్పుడు నమ్మకము + వానిని = నమ్మకువానిని; నమ్మకుమువానిని. అవసానమున- వాని నమ్మకు; వానిని నమ్మకుము.

13. " ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముడుజ్జులకు లోపంబు విభాష నగు" (బాల-సంధి-49). అనగా - ఆమ్రేడితము పరమగునప్పుడు మధ్యమ పురుషయందలి మువర్ణక డువర్ణకములకు లోపము విభాషగా నగును. ఉదా ఉండుము+ఉండుము = ఉండుండుము (ప్రవృత్తి), ఉండుముండుము (అప్రవృత్తి), కొట్టుడు + కొట్టుడు = కొట్టుకొట్టుడు (ప్రవృత్తి), కొట్టుడుకొట్టుడు (అప్రవృత్తి).

14. "విసర్గంబున కనుకరణంబున లోపం బగు" (బాల-సంధి-50). అనగా విసర్గ చివరనున్న పదమునకు ' అను ' అనుదానిని చేర్చినచో ఆవిసర్గకు లోపము వచ్చును. ఉదా॥ వర్ధతాం శ్రీః + అనియె = వర్ధతాం శ్రీయనియె.

ఇట్లు బాల-ప్రౌఢవ్యాకరణకర్తలు, ఆయా స్థలములలో లోపము వచ్చుట వలన ఏర్పడిన రూపములను సోదాహరణముగా విరించినారు.

# 10. అనుకరణసూత్రములు

1. "ధ్వన్యనుకరణ శబ్దముల కనుధాతువు పరంబగుచోఁ గొన్ని యెడల ముగాగమం బగు" (ప్రౌఢ-సంధి-29). ధ్వన్యనుకరణమును సూచించు పదములు ధ్వన్యనుకరణ శబ్దములు (ఉదా: తళతళ, గడగడ మొదలైనవి). అట్టి శబ్దములకు 'అను' పరమైనప్పుడు ముగాగమ మగును. ఉదా: కనకనమను (రామా-6ఆ); సలసలమను (పాండు-5ఆ). సూత్రములో 'కొన్నియెడల' అని యుండుట వలన ముగాగమము రాని రూపములును ఉండవచ్చునని తాత్పర్యము. ఉదా: నిగనిగని, తళతళని- మొదలగునవి.

2. "ధ్వన్యనుకరణశబ్దంబులు ద్విరుక్తంబుల యగు" (ప్రౌఢ-సంధి-20)- ధ్వన్యనుకరణ శబ్దములు ఎప్పుడును ఒక మారు కాక, రెండు మారులు ఉచ్చరింపబడు నని అర్థము. ఉదా: గడగడ - వడవడ - తళతళ - మొదలగునవి.

కాని జిగేలుమని, పెఠిల్లని వంటి అద్విరుక్తములైన శబ్దములు కూడా వాడుకలోను నున్నందున పై సూత్రము సమర్థవంతముగా లేదు (బాల-ప్రౌఢ-వ్యాఖ్య-పు.158).

3. "ఇయ్యవి క్రియా వ్యవహితంబులు నగు" (ప్రౌఢ-సంధి-21)-ధ్వన్యనుకరణ శబ్దములు సాధారణముగా క్రియలకు ముందే అవ్యవహితముగనే ఉండును . ఉదా: తళతళ మెరసెను; గణగణమ్రోగెను. కాని ప్రస్తుత సూత్రముచేత అవి క్రియలకు వ్యవహితముగా కూడ నుండవచ్చునని స్పష్టమగును. ఉదా: వడవడ జమదగ్ని సూతి వడఁకెన్ (రామా-4ఆ).

4. "విసర్గంబున కనుకరణంబున లోపం బగు" (బాల-సంధి-50)- విసర్గకు, 'అను' శబ్దమును చేర్చి చెప్పినపుడు ఆ విసర్గకు లోపము వచ్చును. ఉదా: వర్ధతాం శ్రీః + అనియె = వర్ధతాం శ్రీ యనియె.

5. "అనుకృతిని నమశ్శబ్దము తుది యత్తున కోత్వము విభాషనగు" (బాల-సంధి-51) .అనగా - నమశ్శబ్దము చివరి అత్వమునకు విభాషగా ఓత్వము ఆదేశమగు నని అర్థము. ఉదా: తుభ్యంనమః + అనె = తుభ్యం నమో యనె, తుభ్యం నమ యనె. పై సూత్రము (బాల-సంధి-50) ప్రకారము విసర్గకు లోపము రాగా- తుభ్యంనమ + అనె అని యగును. ప్రస్తుత సూత్రము చేత తుది అత్వమునకు ఆదేశముగా ఓత్వము

వచ్చి 'తుభ్యంనమో + అనె' అని అగును. దీర్ఘము మీది సంధిలేనందున యడాగమము కలిగి 'తుభ్యంనమో యనె' అని యగును.

ఓత్వము రాని పక్షమున - 'తుభ్యంనమ +అనె' అని ఉండగా-'స్త్రీ వాచక తత్సమ సంబోధనాంతములకు సంధిలేదు' అను నియమము ప్రకారము యడాగమము కలిగి 'తుభ్యంనమ యనె' అని యగును.

ఈ సూత్రము నమశ్శబ్దమునకే విధింపబడినప్పటికిని, ఈ కార్యము ఇతరత్ర కూడ కన్పించుచున్న దని సూరియే వృత్తియందు చెప్పినాడు. ఉదా॥ గతానుతికో లోకో యటంచున్.

6. " అనుకరణంబునం దుది హల్లునకు ద్విరచనం బగు " (బాల-సంధి-52)- అనగా - సంస్కృతవాక్యము చివర హల్లున్నచో, దానికి 'అనియె' అని చేర్చి నప్పుడు, చివరి హల్లునకు ద్విత్వము వచ్చు నని అర్థము. ఉదా॥ కింతత్ + అనియె = కింతత్తనియె; కస్త్వమ్ + అనియె = కస్త్వమ్మనియె.

7. " అనుకరణంబునం దహమాదుల మకారంబమునకు ద్విరుక్తి విభాషనగు' (బాల-సంధి-53)- అనగా అనుకరణమునందు 'అహమ్' మొదలగు శబ్దముల చివర మకారమునకు విభాషగా ద్విత్వము వచ్చు నని అర్థము. ఉదా॥ దాసోహమ్ + అనె = దాసోహమ్మనె, దాసోహమనె; తత్కర్తవ్యమ్ + అనె = తత్కర్తవ్యమ్మనె, తత్కర్తవ్యమనె. ప్రౌఢవాకరణకర్త సూత్రమున 'విభాష' అని చెప్పినాడు. కాని ప్రయోగములలో వికల్పములను మాత్రము చూపి నిషేధ రూపములను చూపలేదు. కనుక సూత్రమున విభాష అని కాక 'వికల్పముగా' అని యుండినచో బాగుండెడిది.

8. " ఉదంత నామంబున కనుకరణంబునందు వుగాగమం బగు" (బాల-సంధి-54). అనగా - ఉదంతమైన నామమునకు 'అను' ధాతువును చేర్చినచో వుగాగమ మగునని అర్థము. ఉదా॥ ఇయంధేను +అనె = ఇయంధేనువనె. ఈ సందర్భమున - అనుకరణమున దీర్ఘమునకు హ్రస్వము వచ్చునని ప్రాచీను లెవ్వరో చెప్పిన విషయమును సూరి నిరాకరించి, దీర్ఘము దీర్ఘముగనే ఉండు నని చెప్పి, 'దుర్బలస్యబలం రాజాయన వినవే' అనుదానిని ఉదాహరించినాడు.

9. " ఒకానొకచో ననుకరణ విరహితంబుగ సంస్కృత వ్యాకంబుగానం బడియెడి" (ప్రౌఢ-సంజ్ఞా-15)- అనగా 'అను' శబ్దమును చేర్చకయే తెలుగు వాక్య మధ్యమున సంస్కృత వాక్యము ఒక్కొక్కసారి ప్రయోగింపబడునని అర్థము. ఉదా: అంటితి నమశ్శివాయ పాపాత్మురాలి (జైమినీ -4ఆ)- 'నమశ్శివాయ' అనగా శివునకు నమస్కారమని యర్థము. ఆసంస్కృత వాక్యము 'అంటితి -పాపాత్మురాలి' అనుపదములం మధ్యన యథాతథముగ ప్రయోగింపబడినది.

10. " జయపదం బనుకరణ విరహితంబ తఱచుగా నగు" (ప్రౌఢ-సంజ్ఞా-16). 'జయ' అనగా 'వర్థిల్లుము, జయింపుము' అని అర్థము. ఆ 'జయ' అను సంస్కృత శబ్దము 'అను' అన్న పదము లేకుండగనే తరచుగ ప్రయోగింపబడు నని అర్థము. ఉదా: జయ పూతనాఘాత జయ దైత్యదమన! - సూత్రమున 'తఱచుగ' అనుటచే ఒక్కొక్కసారి అనుకరణ సహితముగను ప్రయోగింపబడు నని భావము. అప్పుడు 'జయ యని పలికెను' వంటి రూపము లుండును.

ఇట్లు బాల-ప్రౌఢవ్యాకరణకర్తలు అనుకరణసూత్రములను వివరించినారు.

# IV. తత్సమ పరిచ్ఛేదము

## 1. విభక్తిప్రత్యయ నిరూపణము

"సంస్కృత ప్రాకృత తుల్యంబైన భాష తత్సమంబు" (బాల-సంజ్ఞ-19)- అని చిన్నయసూరి చెప్పినాడు. అనగా సంస్కృతముతోకాని, ప్రాకృతముతోకాని సమానమైన భాష తత్సమము. అట్లు సంస్కృత, ప్రాకృతములనుండి తెచ్చుకొనిన ప్రాతిపదికలకు, తెలుగుప్రత్యయములు చేర్చి వాడుకొనినచో తత్సమములని అందురు. ఈ పరిచ్ఛేదమున చిన్నయసూరి అట్టి ప్రాతిపదికలపై చేరుచున్న ప్రత్యయములను గురించి చెప్పినాడు. వీనికే 'విభక్తిప్రత్యయము' లనియు పేరు.

1. "డు ము వు లు ప్రథమ" (బాల-తత్సమ-1). అనగా-'డు ము వు లు' అను నాలుగు ప్రత్యయములు ప్రథమా విభక్తియందు అగునని సూత్రార్థము.

2. "ను వర్ణంబు ద్వితీయ" (బాల-తత్సమ-2). అనగా-'ను' అను ప్రత్యయము ద్వితీయావిభక్తియం దగునని అర్థము. ఇదియే ఇకారముమీదనైనచో నివర్ణముగ మారును (హరిని). హల్ పరకమైనపుడు స్వరమును గోల్పోయి పొల్లునకారముగ కూడ ఉండవచ్చును (సిరికిన్ జెప్పడు). 'ని, న్'-రెండును నువర్ణముయొక్క రూపాంతరములే కనుక చిన్నయసూరి ఒక్క నువర్ణమునే ద్వితీయావిభక్తిప్రత్యయముగ చెప్పినా డనవచ్చును.

3. "చేత తోడ తృతీయ" (బాల-తత్సమ-3). అనగా-'చేత, తోడ'-అను ప్రత్యయములు తృతీయావిభక్తియం దగునని అర్థము.

'చేతన్- చేన్- తోడన్- తోన్'-అను నాలుగింటిని తృతీయా విభక్తి ప్రత్యయములుగా తెలుగువ్యాకరణములు అంగీకరించినవి. కాని 'చేన్' అనునది 'చేతన్' ప్రత్యయములోని ఏకదేశము. అట్లే 'తోన్'అనునది 'తోడన్' ప్రత్యయములోని భాగమే. అందువలన సూరి వానిని పునరుక్తిచేయక 'చేత, తోడ' అను మాత్రమే తృతీయావిభక్తి ప్రత్యయములుగ ప్రదర్శించుట సమంజసముగా నున్నది.

4. "కొఱకు కయి చతుర్థి" (బాల-తత్సమ-4). అనగా-చతుర్థీవిభక్తియందు 'కొఱకు, కయి'-అను ప్రత్యయములు అగునని అర్థము. 'కై' అనునది 'కయి' అనుదాని రూపాంతరమే.

5. "వలన కంటె పట్టి పంచమి" (బాల-తత్సమ-5). అనగా-పంచమీవిభక్తియందు 'వలన, కంటె, పట్టి' అను ప్రత్యయములు అగునని అర్థము.

కొందరు వ్యాకరణకర్తలు 'ఉండి' అనుదానిని కూడ పంచమీ విభక్తిప్రత్యయముగా రిగణించిరి. కాని అది 'ఉండు' ధాతువుయొక్క క్త్వార్థక రూపమే అనియు, త్పూర్వముండిన ద్రుతముతోకలిసి అనుచితవిభాగమువలన 'నుండి' అని ుగుచున్నదనియు, కనుక దానిని వేరు ప్రత్యయముగా పరిగణింపవలసిన అవసరము లేదనియు సూరి ఉద్దేశముగా కన్పించును. అందుకే అతడు దానిని ప్రత్యేకప్రత్యయముగా చెప్పలేదు.

6. "కు యొక్క లోపల షష్ఠి" (బాల-తత్సమ-6). అనగా-'కు, యొక్క, లోపల'-అను ప్రత్యయములు షష్ఠీవిభక్తియందు అగునని అర్థము.

కొందరు వ్యాకరణకర్తలు 'కున్, లోన్' అను వానిని కూడ షష్ఠీవిభక్తి ప్రత్యయములుగ పరిగణించినారు. కాని 'కిన్' అనునది 'కున్' యొక్క రూపాంతరము. అట్లే 'లోన్' అనునది 'లోపలన్' అనుదానియొక్క ఏకదేశమే. కనుక ఆరెండింటిని సూరి ప్రత్యేకముగా చెప్పలే దనవచ్చును.

7. "అందు న సప్తమి" (బాల-తత్సమ-7). అనగా- సప్తమీవిభక్తియందు అందు, న' అను ప్రత్యయములు అగునని అర్థము.

'ఇందు, ఎందు' అనునవికూడ 'అందు' వంటివే. కనుక వీనికి 'ప్రత్యయ ప్రతిరూపము'లని పేరు.

ఈవిధముగా చిన్నయసూరి ప్రథమ మొదలు సప్తమి వరకును గల విభక్తులలో చేరు వివిధ ప్రత్యయములను ఈతత్సమపరిచ్ఛేదప్రారంభమున వివరించినాడు.

ఆతరువాత ఈ విభక్తిప్రత్యయములు చేరినపుడు కలుగుచున్న కొన్ని విశేషరూపములను సూరి ఇట్లు వివరించినాడుః-

1. "తృతీయాదులకు నుగాగమం బగు" (బాల-తత్సమ-8). అనగా-తృతీయా విభక్తి మొదలుకొని సప్తమీ విభక్తి వరకును గల ప్రత్యయములకు సాధారణముగా

చివర 'ను' ఆగమముగా చేరును. అట్లు చేరినవి ద్రుతప్రకృతికములని గ్రహింపవలెను. ఉదా॥ రామునిచేతను-రామునితోడను-రామునికొఱకును-రామునివలనను-రామునికంటెను- రామునకును- రామునియందును.

2. కాని-'కయి,పట్టి, యొక్క' అను ప్రత్యయముల చివరను వర్ణము చేరదు. అనగా అవి కళలు. ఉదా॥ రామునికయి-జ్ఞానముఁబట్టి- రామునియొక్క. అందువలన సూరి "కయి, పట్టి, యొక్క లకు నుగాగమంబులేదు" (బాల-తత్సమ-9) అని చెప్పినాడు.

3. "చేత తోడ లోపల వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు" (బాల-తత్సమ-10). అనగా- 'చేత,తోడ, లోపల' అను విభక్తి ప్రత్యయములందలి మొదటి అక్షరములు మాత్రమే మిగిలి, మిగిలిన అక్షరములు వికల్పముగా లోపించుచున్నవి. అట్లు మొదటి అక్షరములు శేషించుటవలన- 'చే, తో, లో' అనియు, శేషింపకుండుటవలన 'చేత, తోడ, లోపల' అనియు రెండువిధములుగా నుండును. అందువలననే సూరి 'చేన్, తోన్, ' అను తృతీయావిభక్తిప్రత్యయములను 'లోన్' అను షష్ఠీవిభక్తిప్రత్యయమును విడిగా చెప్పలేదు. ఇవన్నియు ద్రుత ప్రకృతికములగుటవలన- చేతన్, చేన్, తోడన్, తోన్, లోపలన్, లోన్- అనురీతిగా నుండును.

4. "డు ము వు న లేకవచనంబులు" (బాల-తత్సమ-11). అనగా- 'డు ము వు' అను ప్రథమావిభక్తిప్రత్యయములును, 'న' అను సప్తమీవిభక్తిప్రత్యయమును, ఏకవచనమునం దగునని అర్థము. ఏకత్వ సంఖ్యను బోధించు ప్రత్యయము ఏకవచనము. ఉదా॥ రాముడు-సోముడు; వనము-ధనము; ధేనువు-భానువు; ధనమున-వనమున.

5. "లు వర్ణంబు బహువచనంబు" (బాల-తత్సమ-12). బహుత్వసంఖ్యను బోధించు ప్రత్యయము బహువచనము. అనగా ఒకటికంటె ఎక్కువ సంఖ్యను బోధించు ప్రత్యయము బహువచనము.

ప్రథమా విభక్తియందలి 'లు' అను ప్రత్యయము బహువచనమునం దగు నని సూత్రార్థము. ఉదా॥ రాములు - సోములు - వనములు - ధనములు - ధేనువులు-భానువులు.

6. "తక్కినవి యుభయంబులు" (బాల-తత్సమ-13). అనగా - పైన చెప్పిన ఐదు ప్రత్యయములు (డు ము వు న లు) కాక మిగిలిన ప్రత్యయములు ఏకత్వ బహుత్వములకు బోధకములని అర్థము. అనగా అవి ఏకత్వమునందును, బహుత్వమునందును కూడ అగును. ఉదా: 'వనమును' అన్నపుడు, 'ను' అను ద్వితీయా విభక్తి ప్రత్యయము ఏకవచనమును, 'వనములను' అని యున్నపుడు బహువచనమును బోధించుచున్నది. ఇట్లే మిగిలిన ప్రత్యయములును, ఏకత్వ బహుత్వములును బోధించు నని తెలియవలెను.

7. "ఓ యామంత్రణంబునం దగు" (బాల-తత్సమ-14). అనగా - 'ఓ' యను శబ్దము, ఒకరిని పిలువవలసివచ్చినపుడు, సంబోధన వాచకమునకు ముందు ప్రయోగింపబడును. ఆమంత్రణమనగా పిలుపు అని అర్థము. ఉదా: ఓ రాముడ! - ఓరాములార! - వీనిలో 'రాముడ' అనునది సంబోధన వాచకము. దానికి ముందు సంబోధనమున 'ఓ' చేరి 'ఓరాముడ' అని అయినది.

ఒక్కొక్కసారి ఈ 'ఓ' శబ్దమును, విడిచిపెట్టియు సంబోధ్యవాచకమును ప్రయోగింపవచ్చు నని వృత్తియందు చెప్పినాడు సూరి. అప్పుడు - రాముడ! రాములార! - అని యగును. ఇట్లే నీచస్త్రీ యామంత్రణమున 'ఓ' శబ్దమునకు 'సి' వర్ణంబును, నీచపురుషామంత్రణంబున 'రి' అను వర్ణంబును అంతాగమము లగును (బాల-తత్సమ-15). అంతాగమమనగా చివర అదనముగా చేరుట అని అర్థము. ఉదా: ఓసి దుష్టురాలా! ఓరి దుష్టుడా!

ఈ అంతాగమంబు విభాషగా నగుటచేత పైరెండు రూపములతో పాటు 'ఓ దుష్టురాల, ఓ దుష్టుడ' అనియు ఉండును.

ఈ 'ఓరి', 'ఓసి' అను ప్రత్యయములు మైత్రియందును కన్పించుచున్నవి (బాల-తత్సమ-16) - ఉదా: ఓరి చిన్ని కృష్ణా! ఓసి ముద్దుబాల!

ఒక్కొక్కసారి వీనికి దీర్ఘమును వచ్చును. ఉదా: ఓయీ విప్రకులావతంస! - ఓరీ దుష్టనిశాచులార - ఓసీ ననుఁ జెనక రాకు.

ఇట్లు చిన్నయసూరి తత్సమ పరిచ్ఛేదప్రారంభమున విభక్తి ప్రత్యయములను, అవివచ్చు విధానమును నిర్దేశించినాడు.

ఈ తత్సమ పరిచ్ఛేదములో ముందు ఆయా తత్సమ శబ్దములపై ఏయే ప్రత్యయములు ఎట్లు చేరి తెలుగున ప్రయుక్తములగుచున్నవో సూరి వివరింపనున్నాడు. అందువలన ఈ విభక్తి ప్రణాళికను, దాని స్వరూపస్వభావములను కారక పరిచ్ఛేదమున కాక ఈ తత్సమ పరిచ్ఛేద ప్రారంభముననే తెలుపుట సమంజసముగా నున్నది.

## 2. అజంతశబ్దములు

### 1. అకారాంతశబ్దములు :

1. "పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబున కుత్వంబగు" (బాల-తత్సమ-21). నామమనగా ప్రాతిపదికము. ఉదా: రామ-భార్గవ-రాజపురుష.

అట్టి నామములు పుంలింగమును, మహద్వాచకమును అయిన యెడల వాని చివరి అత్వమునకు ఉత్వము అగునని సూత్రార్థము. ఉదా: రాము-భార్గవు-రాజపురుషు.

"పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్ఞగు" (బాల-తత్సమ-22). అనగా- పుంలింగమై మహద్వాచకమైన నామవాచకమునకు డుజ్ఞుచేరునని అర్థము. ఉదా: రాముడు-భార్గవుడు-రాజపురుషుడు.

2. "డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాషనగు" (బాల-తత్సమ-23). డుజ్ఞను ప్రత్యయము దేనికి చేరునో అది 'డుమంతము' అనబడును. 'రాముడు' అను శబ్దములో 'డు' ప్రత్యయము 'రాము' అనుదానికి చేరుచున్నది కనుక, 'రాము' అనునది డుమంతము. అట్టి డుమంతములకు ద్వితీయాది ఏకవచనంబు పరంబగునపుడు సర్వత్రనిగాగమము విభాషగా నగునని సూత్రార్థము. ఉదా: రామునిని - రామునిచేత - రామునికొఱకు.

సూత్రమున విభాషగా వచ్చు ననుటచే - రామునిచేత - రాముచేత; రామునికొఱకు - రాముకొఱకు; రామునివలన - రామువలన - వంటి రెండు రకముల రూపములును కలుగును.

ఇచ్చట ఉదాహరణములలో సప్తమీ విభక్తికి ఉదాహరణము చూపక పోవుటకు కారణము 'రామునియందు' వంటి నిగాగమ రూపముతోపాటు 'రామునందు' (బాల-తత్సమ-29) వంటి రూపములును ఉండుటయే అని చెప్పవచ్చును.

అంతేకాక - "సర్వత్ర యనుట నగాగమ బాధనార్థము" - అని బాల-తత్సమ-23 వ సూత్రముక్రింది వృత్తిలో సూరి చెప్పియున్నాడు. అనగా - ముందు సూత్రమున

(బాల-తత్సమ-28) సూరి ఇట్టి శబ్దములకు షష్ఠీవిభక్తి ప్రత్యయమైన కువర్ణము పరమైనచో నవర్ణమును విధింపబోవుచున్నాడు. అప్పుడు – రామునకు – విష్ణునకు - వంటి రూపములు కలుగును. వాస్తవమునకు ద్వితీయాది విభక్తులు పరమైనప్పుడు రావలసిన నిగాగమము, షష్ఠీవిభక్తి పరమైనప్పుడు వచ్చుటలేదు. అందువలన దానికి బాధ కలుగకుండుటకు ఇక్కడ 'సర్వత్ర' అని సూత్రమున వాడినట్లు చెప్పియున్నాడు సూరి. ఇక్కడ వచ్చు నగాగమము నిత్యమే యని ఉదాహరణములను బట్టి స్పష్టమగును. అనగా నగాగమ రహితరూపములు నిషేధింపబడినవి. నిగాగమమున వికల్పరూపములతో (రామునిచేత – రాముచేత) పాటు, దాని స్థానమున వచ్చిన నగాగమమున తద్విరహిత రూపములు నిషేధింపబడినవి కనుక సూత్రమున 'విభాష' అని చెప్పుట సముచితముగా నున్నది. కాని – బచ్చుకున్ (నై ష-6ఆ), అండజాధీశ్వరు కొసగఁబోలు (విక్ర-4ఆ) వంటి కవిత్రయేతరప్రయోగములలో ఈ నగాగమము వచ్చుట లేదని ప్రౌఢవ్యాకరణకర్త చెప్పినాడు (ప్రౌఢ-శబ్ద-19).

అంతేకాక ఈ నగాగమము షష్ఠీవిభక్తికి మాత్రమే కాక పంచమి ముందు కూడ వచ్చుచున్నది (ప్రౌఢ-శబ్ద-20) అని ప్రౌఢ వ్యాకరణకర్త నవరించి చెప్పినాడు. ఉదా: తత్క్రతు శతంబునకంటె (భార-ఆది-4ఆ), అనఘ చరిత్రమున కంటె (నిర్వ-6ఆ); కనుక ప్రౌఢవ్యాకరణకర్త చెప్పిన విషయము అంగీకరింపదగినదే.

3. "బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లడాగమంబగు" (బాల-తత్సమ -31). అనగా – ద్వితీయ మొదలు సప్తమి వరకును గల ఏ విభక్తి ప్రత్యయమున కయినను బహుత్వమున లడాగమ మగునని అర్థము. ఉదా: రాములను – రాములచేత-రాముల కొఱకు.

4. "సంబోధనంబునం దేకార్థంబయిన పదంబు తుది యుకారంబున కకారంబగు" (బాల-తత్సమ-32). అనగా - సంబోధనమున ఏకావచనమును తెలుపు పదముల చివరి ఉత్వమునకు అత్వము వచ్చును. ఉదా: ఓరాముడ.

ఈవిధి ఉకారాంతములకే కాక – ఇతరమైన అజంతశబ్దములకును వర్తించుచున్నది. ఉదా: ఓ వృక్షమ – ఓ శంభువ – ఓ కొడుక!

ఒక్కొక్కసారి వీని చివర హ్రస్వమునకు దీర్ఘమును వచ్చును (బాల-తత్సమ-33). ఉదా: ఓరాముడా – ఓ చెలియా – ఓహరీ – ఓ తండ్రీ!

సంస్కృతనామముల చివరి సంబుద్ధి డుబ్బునకు లోపమును విభాషగా వచ్చుచున్నది (బాల-తత్సమ-34). ఉదా: ఓరామ - ఓ కృష్ణ!

వీనికి దీర్ఘమును వచ్చును - ఓ రామా! - ఓ కృష్ణా! సంస్కృతనామములకే అనుటవలన తెలుగు నామములకు ఈ డుబ్ లోపము కలుగదు. ఉదా: ఓతమ్ముడ! ఓతమ్ముడా!

5. "సంబోధనంబునందు బహువచనంబున కారగాగమంబగు" (బాల-తత్సమ-36). అనగా - సంబోధనములందు సంబోధ్యవాచకమునకు చివరనున్న బహువచన ప్రత్యయము మీది 'ఆర' యనునది ఆగమముగా చేరునని అర్థము. ఉదా: ఓ రాములార! వీనికి దీర్ఘమును పాక్షికముగా వచ్చును. ఓరాములారా! ఓ కృష్ణులారా!

6. "అదంతంబయి దీర్ఘపూర్వలోపధంబయిన మహత్తు మీది విభక్తి లకారంబునకు రేఫంబగు" (బాల-తత్సమ-38). అనగా - హ్రస్వమైన అకారము అంతమందు కలిగి, లకారమును ఉపధగా కలిగి, తత్పూర్వమందు దీర్ఘము కల నామము మహద్వాచకమైనపుడు దానిమీది విభక్తిలకారమునకు రేఫము ఆదేశముగా వచ్చును. ఇచ్చట విభక్తి లకారమని అనుటచే బహువచన ప్రత్యయమైన లు వర్ణమును, బహుత్వమున ద్వితీయాదులకు విధింపబడిన లడాగమమును కూడ గ్రహింపవలెను. వానికి కూడ ప్రస్తుత సూత్రము వలన రేఫము వచ్చును. ఉదా: బాలురు - బాలురను - బాలురచేతను.

ఈ రేఫము ళకారాంతమైన దయాళు శబ్దముపైనను కన్పించుచున్నది. ఉదా: దయాళురు - దయాళురను - దయాళురచేతను.

ఈ రేఫము ద్విరుక్తలకారము చివరనున్న పదములకును వచ్చునని ప్రౌఢవ్యాకరణకర్త చెప్పుచు - "ద్విత్వయుక్తలాంతంబు మీది లు ల న లకును రు ర లాదేశంబు లగు" (ప్రౌఢ-శబ్ద-23) - అని సూత్రీకరించినాడు. ఉదా: అల్లురు - మల్లురు (రామా -1ఆ).

కాని తిక్కన భారతమున మల్లులు అని ప్రాసస్థానముననే ప్రయోగించినాడు. కనుక ప్రౌఢవ్యాకరణకర్త ఈ రేఫాదేశమును వికల్పముగా విధించినచో బాగుండెడిదనియు, కూచిమంచి తిమ్మకవి తన 'సర్వలక్షణసారసంగ్రహము'న "మల్లులను శబ్దమునకున్, మల్లులు మల్లురని కృతుల మానుగ పలుకం, జెల్లును" అని చెప్పుట గమనింప దగిన దనియు సూర్యారాయ శ్రీ గారు చెప్పుట సముచితముగా నున్నది (బాల-ప్రౌఢ - వ్యాఖ్య-పు.204).

7. "అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు" (బాల-తత్సమ-39). అనగా - హ్రస్వమైన అకారము అంతమందుగల అమహద్వాచకములకును, నపుంసకలింగ శబ్దములకును, ముపర్ణము కలుగునని అర్థము. ఉదా: వృక్షము - దైవము-కళత్రము.

"క్లీబంబులుమిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబులగు" (బాల-తత్సమ-18). అనగా-సంస్కృతమున నపుంసకలింగశబ్దములైన మిత్ర శరణ ప్రధాన పాత్రాదులు మహద్వాచకములైనపుడు విభాషగా పుంలింగతుల్యత్వమును పొందునని అర్థము. అప్పుడు పై సూత్రము ప్రకారము (బాల-తత్సమ-39) కలిగిన మిత్రము, శరణము వంటి రూపములతోపాటు, ప్రస్తుత సూత్రమువలన 'మిత్రుడు, శరణుడు' వంటి రూపములును కలుగుచున్నవి.

"ముపర్ణంబునకు మాముడి యేనిం బ్పూర్ణబిందుపూర్వకముపర్ణంబేని విభాషనగు" (బాల-తత్సమ-42). అనగా - ముపర్ణమునకు అదనముగా మాముడికాని, బిందు పూర్వక బుపర్ణముకాని, విభాషగా ఆదేశమగు నని అర్థము. ఉదా: వృక్షమ్ము - వృక్షంబు; ఋక్షమ్ము - ఋక్షంబు.

8. "లు ల నలు పరంబగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును తత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాష నగు" (బాల-తత్సమ-43). అనగా - బహుత్వమునందు వచ్చు లు ల న లు పరమందున్నపుడు పైసూత్రము (బాల-తత్సమ-39) వలన వచ్చిన ఆగమ ముపర్ణమునకు లోపము కలిగి, తత్పూర్వ స్వరమునకు దీర్ఘము విభాషగా వచ్చునని అర్థము. ఉదా: వజ్రాలు-వజ్రాలను-వజ్రాన; పగడాలు-పగడాలను-పగడాన. కాని ఇట్టి ప్రయోగములు చాల తక్కువని సూరి వృత్తిలో చెప్పినాడు.

9. "చరిత్రాదుల ముపర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు" (బాల-తత్సమ-58). అనగా- చరిత్రము మున్నగువానికి ప్రథమైకవచనమునందు వచ్చు ముపర్ణము బహుళముగా లోపించునని అర్థము. ఉదా: చరిత్ర-చరిత్రము; చరిత-చరితము; తరంగ-తరంగము. సూత్రమున 'బహుళము' అని చెప్పుటవలన దర్భాదులకు ములోపము నిత్యము-అని వృత్తిలో చెప్పియున్నాడు సూరి. ఉదా: దర్భ-పనస.

10. "అర్థాదుల కడయచ్చున కుత్వంబును, మీద పువర్ణకంబును, వైకల్పికంబుగా నగు" (ప్రౌఢ-శబ్ద-25). అనగా-అర్థ మొదలైన ప్రాతిపదికల చివరి అత్వమునకు ఉత్వమును, మీద వువర్ణమును వికల్పముగా వచ్చునని అర్థము. ఉదా॥ అర్థువు-అర్థము; ధర్మువు- ధర్మము; వర్గువు-వర్గము (భార-ఆది-4ఆ).

11. "వృద్ధాదుల డుజ్జునకు లోపము విభాష నగు" (బాల-తత్సమ-56). అనగా- వృద్ధాదుల డుజ్ వర్ణకమునకు లోపము విభాషగా నగునని అర్థము. ఇక్కడ- బాల-తత్సమ-22వ సూత్రముచే వచ్చిన డుజ్వర్ణమునకు మాత్రమే లోపము చెప్పుట వలన, తత్పూర్వసూత్రము (బాల-తత్సమ-21)చే విధింపబడిన ఉత్వమునకు లోపము రాదు (ఇది సూరిసూత్రరచనలో జాగ్రత్తకు ఒక చక్కని నిదర్శనము). ఉదా॥ వృద్ధ- వృద్ధుడు; మూర్ఖ-మూర్ఖుడు; గృహస్థ-గృహస్థుడు. సూత్రమున 'విభాష' అని వాడబడుటకు కారణము కొన్నిశబ్దములలో డుజ్వర్ణకము రాకుండుటయే! 'భట్ట' శబ్దమునకు ఉత్వడుజ్జులు కలుగగా 'భట్టుడు' అని కావలసియుండును. కానీ ఇచ్చట డుజ్వర్ణకమునకు లోపము నిత్యముగానై, నన్నయభట్టువంటి రూపములు ఏర్పడుచున్నవి (బాల-ప్రౌఢ-వ్యాఖ్య- పు.230).

12 "దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు" (బాల-తత్సమ-61). అనగా- దూత-యోధ-శుంఠ శబ్దములకు స్త్రీత్వము బహుళముగా కలుగునని అర్థము. అకారాంతపుంలింగ శబ్దములైనవానికి ఉత్వడుజ్జులు కలుగగా- 'దూతుడు, యోధుడు, శుంఠుడు' అని కావలయును. కాగా-ప్రస్తుత సూత్రముచే వానికి వికల్పముగా లోపము వచ్చినచో- 'దూత-యోధ-శుంఠ' అనియే యుండును.

"బహుళగ్రహణముచే నమహత్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు"- అని వృత్తిలో సూరి చెప్పి, 'సింగంబు దూతయగు జంబుకంబు' అని ఉదాహరించినాడు. ఇక్కడ 'జంబుకము' అనునది అమహద్వాచకము. అప్పుడు దాని విశేషణమగు 'దూత'యు అమహద్వాచకమే కావలెను.అప్పుడు అది- "అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకంబగు" (బాల-తత్సమ-39) అన్న సూత్రము ప్రకారము 'దూతము' కావలసియుండును. కాని ప్రస్తుత సూత్రములోని బహుళమన్నపదమువలన దానికి లోపమును నిత్యముగా విధించి, 'దూతము' అన్న అనిష్టరూపమును వారించినాడు సూరి.

13. "కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు" (బాల-తత్సమ-66). అనగా- కంధరమొదలైన శబ్దములు బహుళముగా నపుంసకలింగతుల్యము లగునని అర్థము. ఉదా: కంధరము-కంధర; నాసికము - నాసిక; గ్రీవము-గ్రీవ.

## 2. ఆకారాంతశబ్దములు:

1. "నామంబులతుది దీర్ఘంబునకు హ్రస్వంబగు" (బాల-తత్సమ-54). అనగా- దీర్ఘాంతములైన స్త్రీవాచక శబ్దములచివరి దీర్ఘమునకు హ్రస్వమగు నని అర్థము. దీర్ఘాంతములైన శబ్దములు స్త్రీలింగ శబ్దములు. ప్రస్తుత సూత్రముచేత వాని దీర్ఘమునకు హ్రస్వమగును. ఉదా: రమా-రమ; విద్యా-విద్య; లక్ష్మీ-లక్ష్మి.

అట్లు కృతహ్రస్వములైనవానికి, హ్రస్వాంతములకు జరిగిన కార్యములే జరిగి వివిధరూపము లేర్పడును. ఉదా: లక్ష్ములు-సేనానులు-సిరులు.

"స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు" (బాల-తత్సమ-57). అనగా- స్త్రీలింగశబ్దముల ప్రథమైకవచనమునకు లోపము కలుగునని అర్థము. దానివలన 'రమా' శబ్దము- "నామంబులతుది దీర్ఘంబునకు హ్రస్వంబగు" (బాల-తత్సమ-54) అన్న సూత్రమును బట్టి 'రమ' అని అగును. దానిపై ప్రథమావిభక్తిప్రత్యయమును చేర్చియే తెలుగున ప్రయోగింపవలెను. కనుక దానికి'సు' అని ప్రథమైకవచనము కలిగి, ప్రస్తుతసూత్రము (57)చే అది లోపించి, 'రమ' అనియే యుండును. ఇట్లు రావలసిన ప్రత్యయమును విధించి, దానికి లోపమును చెప్పుటయే వ్యాకరణసంప్రదాయము.

2. "ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు" (బాల-తత్సమ-55). అనగా- ఏకాక్షరములైన నామములపైనున్న దీర్ఘమునకు, పూర్వసూత్రముచేత కలుగవలసిన హ్రస్వము కలుగదు. ఉదా: క్ష్మా-శ్రీ-స్త్రీ.

## 3. ఇకారాంత శబ్దములు:

1. " ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు" (బాల-తత్సమ-44). అనగా- ఇకారాంత శబ్దములకు, గ్లౌ (చంద్రుడు) రై (ధనము) శబ్దములకు, ఉదంతశబ్దములకు (మరుత్తు, రుక్కు) ప్రథమావిభక్తి యందు ఏకవచన ప్రత్యయము (సు) చేరి, తరువాత లోపించునని అర్థము. ఉదా: హరి+సు=హరి; గిరి+సు=గిరి.

ఈవిధి దీర్ఘములకును వర్తించును. ఉదా॥ శ్రీ+సు= శ్రీ; ధీ+సు=ధీ. ఇట్లే- గ్లౌ+సు=గ్లౌ; రై+సు=రై; మరుత్తు+సు=మరుత్తు; రుక్కు+సు=రుక్కు. అన్నింటికిని ప్రథమావిభక్తి ప్రత్యయమైన 'సు' చేరి, అది లోపించి, తిరిగి అదే రూపములు మిగిలినవి.

2. "వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనము పరంబగునపు డుత్వంబగు" (బాల-తత్సమ-46). అనగా- అచ్చికములైన ఇకారాంతశబ్దముల ఉపోత్తమేత్వము (చివరి ఇత్వమునకు ముందరి ఇత్వము) నకు బహువచనప్రత్యయము పరమైనచో ఉత్వము వచ్చునని అర్థము. ఉదా॥ కలికి+లు= కలుకులు; చెలిమి+లు=చెలుములు. ఉపోత్తమేత్వమునకు అనుటచే- జిగి+లు=జిగులు, నిసి+లు=నిసులు- వంటివాని ఇత్వమునకు ఉత్వమురాదు. పైవిధి జరుగుటకు పదములో మూడు అక్షరములకన్న తక్కువ ఉండరాదు. జిగి, నిసి వంటి పదములలో మూడు అక్షరములు లేవు కనుక ఆసూత్రము ప్రవర్తిల్లదు.

సూత్రమున 'వికృతియందే' అని చెప్పుటవలన తత్సమములకు ఈ విధి వర్తించదు. ఉదా॥ సమితి+లు=సమితులు; ఫణితి+లు=ఫణితులు.

'ఇత్వము' నకు అనుటచే ఈకారాంత శబ్దములకును ఈవిధి వర్తించదు. ఉదా॥ జిగినీలు, తనికీలు (బాల-ప్రౌఢ - వ్యాఖ్య-పు.216).

"రలడోపధ నవార్థాదుల యుపోత్తమేత్వంబున కుత్వంబుగలుగదు" (బాల-తత్సమ-47). అనగా- ర ల డ అను అక్షరములు ఉపధగా కలిగిన శబ్దములకును, తొమ్మిది- ఎనిమిది వంటి శబ్దముల ఉపోత్తమేత్వమునకును ఉత్వము రాదు. ఉదా॥ పందిరి+లు=పందిరులు; పిడికిలి+లు=పిడికిళులు; ఎనిమిది+లు=ఎనిమిదులు.

## 4. ఉకారాంతశబ్దములు:

"ఉకారాంత శబ్దములకును, గోశబ్దమునకు అంతటను, ప్రథమైకవచనమున వువర్ణకము కలుగునని అర్థము. ఉదా॥ తరువు-ధేనువు-మధువు-గోవు.

ఈసూత్రమున వృత్తిలో- "అంతట ననుట స్త్రీలింగప్రథమైకవచనలోప బాధనార్థము" అని సూరి చెప్పినాడు. అందువలన 'ధేను' అన్న స్త్రీలింగశబ్దమునకు- "స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు" (బాల-తత్సమ-57) అను

సూత్రమునుబట్టి రావలసిన ప్రథమైకవచనమునకు లోపము కలుగక, ప్రస్తుత సూత్రముచే 'వు' వర్ణకము కలిగి 'ధేనువు' అని అగును. ఇట్లే- 'మధు' అన్న ఉకారాంత నపుంసకలింగ శబ్దమునకును వువర్ణకము కలిగి- 'మధువు' అని అగును.

2. "రాహు బాహు శబ్దముల కంతట వువర్ణక లోపంబు వైకల్పికంబు" (ప్రౌఢ-తత్సమ-26). అనగా- ఉదంతములైన రాహు బాహు శబ్దములకు వువర్ణకము వైకల్పికముగా కలుగు నని అర్థము. ఉదా: రాహువు-రాహు (భార-సభా-2ఆ), రాహువులు-రాహులు; బాహువు-బాహు (భార-విరా-2ఆ), బాహువులు-బాహులు.

3. "వువర్ణకేతర విభక్తి పరమగుచో నుకారాంతంబులకు బహుళంబుగా గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమంబగు" (బాల-తత్సమ-49). అనగా- ఉకారాంతశబ్దములకు వువర్ణకముకాక ఇతర విభక్తులు పరమైనప్పుడు వుగాగమము బహుళముగను, గోశబ్దమునకు మాత్రము నిత్యముగను కలుగునని అర్థము. ఉదా: తరువులు-తరులు; ధేనువులు-ధేనులు. 'గోవులు' అన్నప్పుడు ఈవుగాగమము నిత్యము-కనుక లోపించదు.

బహుళ గ్రహణముచేత ఉదంతస్త్రీవాచకములకు వుగాగమము నిత్యముగా నగును. ఉదా: వధువు-వధువులు.

4. "ఉకారాంతంబగు మహత్తునకు వువర్ణకము బహుళముగా నగు" (బాల-తత్సమ-50)- అనగా- మహద్వాచకములైన ఉకారాంతశబ్దములకు ఈవుగాగమము బహుళముగా నగును. ఉదా: వుగాగమము కలిగినచో- విష్ణువు; శంభువు; వసువు. వుగాగమము రానిచో- "పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్జగు" (బాల-తత్సమ-22) అను సూత్రము ప్రకారము విష్ణుడు, శంభుడు, వసుడు- అను రూపము లేర్పడును.

5."క్రదువ నాగమాత" (బాల-తత్సమ-51). అనగా- నాగమాత అను అర్థమున క్రదూశబ్దము క్రదువ యని నిపతింబడుచున్నది.

సంస్కృతమున- 'క్రదు' అను పుంలింగశబ్దమునకు 'గోరోచన'మనియు, 'క్రదూ' అను స్త్రీలింగశబ్దమునకు 'నాగమాత' అనియు అర్థములు. ఈ రెండుశబ్దములును తెలుగున 'క్రదువు' అనియే కన్పించుచున్నవి. కనుక సూరి దీనిని నిపతించి చెప్పినాడు.

అనగా నాగమాత అను నర్థమున 'క(్రదువ' అనియే అగును. కాని కవుల ప్రయోగములలో, నాగమాత యను అర్థమున 'క(్రదువ' అనియే ప్రయోగింపవలెను. నిపాతమనగా-వ్యాకరణవిధినిబట్టి ఒకవిధముగా కావలసియుండగా మరొకవిధముగా ప్రయోగించుట. "పృథ్వీవాచి భూశబ్దంబునకు భువి యగు" (బాల-తత్సమ-62). అనగా- పృథ్వీవాచకమైన భూశబ్దమునకు 'భువి' అని అగును. సంస్కృతమున ఊకారాంతమైన 'భూ'శబ్దమునకు భూమియని అర్థము. కాని దానిని సమాసములో ఉత్తరపదముగా (స్వయంభూ-చిత్తభూ-ఆత్మభూ) ప్రయోగించినచో 'పుట్టినవాడు' అను అర్థమునిచ్చును. భూమి అను అర్థమునిచ్చు 'భూ'శబ్దము మాత్రము ప్రస్తుతసూత్రము ప్రకారము 'భువి' అని అగును. దానికి బహువచనప్రత్యయము కలిగినచో 'భువులు' అను రూపమేర్పడును. ఏకవచనమున ప్రస్తుత సూత్రము ప్రకారము 'భువి' అనియే యుండునని యర్థము.

## 5. ఋకారంతశబ్దములు:

1. "ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబు నగు" (బాల-తత్సమ-52). అనగా- ఋకారాంతశబ్దముల చివరి ఋకారమునకు అత్వము కలిగి స్త్రీవద్భావము నొందును. స్త్రీవద్భావమనగా ప్రథమైకవచనమునకు లోపముకలుగుట. ఉదా: భ్రాత-జమాత-కర్త-భర్త.

సూరియిచ్చిన ఉదాహరణములను బట్టి ఈవిధి కేవలము పుంలింగములకే అని అనిపించినను, మహతీవాచకములకును, మహద్వాచకములకును అట్లే అగుచున్నది. ఉదా: మహతీవాచకములకు: మాత-దుహిత; అమహత్తులకు: ప్రాణహంత (బాల-ప్రౌఢ-వ్యాఖ్య-పు.226)

2. "విధాతృ ధాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్తుల కత్వ స్త్రీవద్భావంబులు విభాషనగు" (బాల-తత్సమ-53). అనగా- విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ అను మహద్వాచక శబ్దములై దింటికిని అత్వమును స్త్రీవద్భావమును (ప్రథమైకవచనలోపము) కలుగునని అర్థము. ఉదా: విధాత- ధాత- దాత- సవిత- నేత.

అత్వస్త్రీవద్భావములు రాని పక్షమున "పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్ఞగు" (బాల-తత్సమ-22) అను సూత్రమును బట్టి డుజ్ఞురాగా-విధాతృడు-ధాతృడు-దాతృడు-సవితృడు-నేతృడు- అని అగును.

## 6. ఐ-ఔకారాంత శబ్దములు:

1. "ఐకారం బీతుల్యంబు" (బాల-తత్సమ-65). అనగా- ఐకారము వ్యాకరణ కార్యముల విషయమున ఈకారముతో సమానము. దీర్ఘమైన ఈకారము మీద ఏయే కార్యములు విధింపబడునో, ఆయాకార్యములు ఐత్వముమీదను జరుగునని తాత్పర్యము. ఉదా: రైని- రైకి; పైని- పైకి.

2. "నౌ శబ్దంబునకు నావ యగు" (బాల-తత్సమ-63). అనగా- నౌశబ్దమునకు నావ యగునని అర్థము. ఔకారాంతస్త్రీలింగశబ్దమగు నౌశబ్దమునకు- "స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు" (బాల-తత్సమ-57) అను నియమమునకు బట్టి 'నౌ' అనియే ఉండవలయును. కాని దానికి ప్రయోగమున నావ అనియే కనిపించుచున్నది. దానికి బహువచనము పరమగునపుడు 'నావలు' అని ఉండును. సమాసమునందు కూడ 'మహానావ' అన్న రీతిగానే ఉండును. అందువలన 'నౌ' శబ్దమునకు 'నావ' అగునని సూరి నిపతించినాడు.

3. "రై గ్లౌ శబ్దంబుల కోత్వంబు విభాష నగు" (బాల-తత్సమ-64). అనగా- రై(ధనము), గ్లౌ(చంద్రుడు) అను శబ్దముల చివరి అచ్చులకు బదులుగా ఓత్వము విభాషగా అగునని అర్థము.

"ఇగ్లౌరా యుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు" (బాల-తత్సమ-44)- అను సూత్రము ప్రకారము రై - గ్లౌ శబ్దములకు ప్రథమైక వచనమునకు లోపము వచ్చి రై -గ్లౌ అనియే ఉండును. కాగా- ప్రస్తుత సూత్రమువలన వాని చివరి అచ్చునకు ఓత్వము విభాషగా వచ్చి 'రో-గ్లో' అను రూపములును ఏర్పడును. వీనికి బహువచనము పరమగునపుడు- రైలు-రోలు; గ్లౌలు-గ్లోలు అని అగును.

ఇట్లు బాల-ప్రౌఢ వ్యాకరణకర్తలు అజంత తత్సమశబ్దములు తెలుగున ఏర్పడుచున్న రూపములను వివరించినారు.

## 3. హలంతశబ్దములు

### 1. ప్రథమైకవచనమునుండి నిష్పన్నములు :

1. "హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామంబగు" (బాల-తత్సమ-67). అనగా-హలంతములగు సంస్కృతశబ్దముల ప్రథమైక వచనాంతతుల్య రూపములే తత్సమరూపములకు ప్రాతిపధికగా గ్రహింపబడునని అర్థము. సంస్కృతమున 'రుక్-మరుత్' మొదలగు శబ్దములకు ప్రథమైకవచనమును ప్రాతిపదికగా గ్రహింపవలె నని భావము. ఉదా॥ రుక్-రాట్-మరుత్-కర్మ-వర్మ.

"ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లునకగు" (బాల-తత్సమ-68). అనగా- హలంతనామముల యొక్క చివరి హల్లునకు ఉత్వమును ద్విత్వమును అగు నని అర్థము. పూర్వసూత్రముచేత ప్రాతిపదికలుగా గ్రహింపబడిన 'రుక్-రాట్-మరుత్' వంటి శబ్దములకు ప్రస్తుత సూత్రముచేత చివరి హల్లునకు ఉత్వద్విత్వములు రాగా-రుక్కు-రాట్టు-మరుత్తు అని యగును. ఈశబ్దములన్నియు ఉగాగమము అంతమందు కలవి. కావున "ఇగ్లోరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు" (బాల-తత్సమ-44)- అను సూత్రము ప్రకారము ప్రథమైక వచనము కలిగి, తిరిగి అవిలోపించి- 'రుక్కు-రాట్టు-మరుత్తు' అనియే యుండును.

బాల-తత్సమ-67వ సూత్రము క్రింది వృత్తిలో చిన్నయసూరి- "శ్వశబ్దంబు తప్ప నకారాంతంబులెల్లం ప్రథమైనకవచన తుల్యంబులే యగునని యెరుంగునది"- అని చెప్పియున్నాడు. అనగా- నకారాంతమైన 'శ్వన్' శబ్దము యొక్క ప్రథమైక వచనరూపము 'శ్వా॥' దీనిని తత్సమ రూపమునకు ప్రాతిపదికగా గ్రహింపరాదు. కాగా మిగిలిన 'కర్మన్-వర్మన్' వంటి నకారాంతశబ్దములన్నియు ప్రథమైకవచనాంతతుల్యములే ప్రాతిపదికములుగా నగును. అప్పుడు 'కర్మన్' శబ్దము ప్రథమైకవచనమున 'కర్మ' అనియు, 'వర్మన్' శబ్దము 'వర్మ' అనియు అగును.

2. "దీర్ఘంబుమీది హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు" (బాల-తత్సమ-69). అనగా- హలంతములైన నామములు దీర్ఘపూర్వములైనచో వానికి ద్విత్వము బహుళముగా నగు నని అర్థము. ఉదా॥ వాక్కు-వాకు; స్వరాట్టు-స్వరాటు.

పూర్వసూత్రమున విధింపబడిన ఉత్వద్విత్వములు ఉగాగమాంతములైన వీనికిని కలుగవలసినదే కాని, ప్రస్తుత సూత్రముచేత ద్విత్వము మాత్రము బహుళముగా నగును.

సూత్రమున 'బహుళము' అనుటచే కొన్ని చోట్ల దీర్ఘము మీది హల్లునకు ద్విత్వము నిత్యముగా అగుట కన్పించును. ఉదా: పరివ్రాట్టు- పుణ్యభాక్కు. ఇవి దీర్ఘము మీదివే అయినప్పటికిని ఇచ్చటి హల్లులు నిత్యముగా ద్విత్వమును పొందుచున్నవి. ఇట్టివానిని ప్రయోగములనుబట్టి గ్రహింపవలెను (బాల-ప్రౌఢ - వ్యాఖ్య-పు. 249).

## 2 ద్వితీయైకవచనమునుండి నిష్పన్నములు:

1. "మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామంబగు" (బాల-తత్సమ-70). మతుప్ప్రత్యయము అంతమందుగలవి మతుబంతములు. అట్టి మతుబాదికములు ద్వితీయైకవచనరూపములతో సమానములైనవి తెలుగున ప్రతిపదికములుగా వ్యవహరింపబడునని అర్థము. ఉదా: శ్రీమంతమ్- గుణవంతమ్- విద్వాంసమ్- అప్సరసమ్. ఈశబ్దములన్నియు ద్వితీయైకవచనాంతములు. వీనికి తుల్యమగు రూపములనే తత్సమరూపములకు ప్రాతిపదికలుగా గ్రహింపవలెను.

"దాని యంతిమ మకారంబునకు లోపంబగు" (బాల-తత్సమ-71). పైసూత్రముచే ఏర్పడిన ప్రాతిపదికములతుది మకారమునకు లోప మగునని అర్థము. ఉదా: శ్రీమంత-గుణవంత-విద్వాంస-అప్సరస.

వీనికి డుజ్ఞాదులు కలిగినచో- శ్రీమంతుడు- గుణవంతుడు- విద్వాంసుడు. అమహద్విశేషణములైనపుడు ముపర్ణకము కలుగును-శ్రీమంతము-గుణవంతము-విద్వాంసము. అమహన్నపుంసకములకును ముపర్ణకము వచ్చును - అనడ్వాహము-శ్వానము. స్త్రీలింగములైనపుడు ప్రథమైకవచనమునకు లోపముకలుగును-అప్సరస.

2. "ఒకానొకచో మహత్వంబునందు మతుప్తకారంబున కానాదేశంబు విభాషనగు" (బాల-తత్సమ-74). అనగా కొన్నియెడల మహద్వాచకమైన మతుబంతముయొక్క మతుప్తకారమునకు 'ఆన' అను ఆదేశము విభాషగా కలుగును. ఉదా: హనుమానుడు-హనుమంతుడు; భగవానుడు-భగవంతుడు.

3. "ముదాదులకు ప్రథమైకవచన లోపంబులేదు" (బాల-తత్సమ-72).

అనగా- స్త్రీలింగశబ్దములైన 'ముద-స్రజ' మున్నగు శబ్దముల ప్రథమైకవచనమునకు లోపము కలుగదని అర్థము. 'ముత్' అను స్త్రీలింగశబ్దము యొక్క ద్వితీయైకవచనము 'ముదమ్' అని యుండును. దాని అంతిమ మకారమునకు లోపము (బాల-తత్సమ-71) చేయగా 'ముద' అని ఏర్పడును. స్త్రీలింగము కావున ప్రథమైకవచనమునకు లోపము కలుగవలసియున్నది. ప్రస్తుతసూత్రము దానిని వారించుచున్నది. అందువలన "అమహన్నపుంసకముల కదంతములకు ముప్వర్ణకంబగు" (బాల-తత్సమ-39) అను సూత్రముచే ముప్వర్ణకము కలిగి 'ముదము-స్రజము' వంటి రూపములేర్పడును.

## 3. ఉభయ నిష్పన్నములు :

1. "ఋత్విగాదులు ద్వితీయైకవచనాంత తుల్యంబు విభాష నగు" (బాల-తత్సమ-73). అనగా- 'ఋత్విక్' మున్నగు సంస్కృతనామముల ద్వితీయైక వచనాంతతుల్య రూపములు తెలుగున విభాషగా ప్రాతిపదికములగునని అర్థము. అనగా- ప్రథమైకవచనాంతతుల్యము ప్రాతిపదికగా ఒకరూపమును, ద్వితీయైకవచనాంతతుల్యము ప్రాతిపదికగా మరొక రూపమును ఏర్పడును. రెండును గ్రాహ్యములే. ఉదా:

1. ప్రథమైకవచనాంతతుల్యములు- ఋత్విక్కు-వణిక్కు-ఇంద్రజిత్తు.
2. ద్వితీయైక వచనాంతతుల్యములు-ఋత్విజుడు-వణిజుడు-ఇంద్రజితుడు.

"జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాషనగు" (బాల-తత్సమ-79). అనగా- 'జగత్- ఇంద్రజిత్' అను శబ్దముల తుది తకారమునకు విభాషగా లోపగునని అర్థము. ఉదా: జగము- జగత్తు; ఇంద్రజి-ఇంద్రజిత్తు (ఋత్విగాదులలోని దగుటవలన 'ఇంద్రజితుడు' అనియు అగును.

## 4. నకారాంతశబ్దములు:

నకారాంత సంస్కృతశబ్దములు ఈక్రింది విధముగా మార్పులను పొంది, తత్సమరూపము నందు చున్నవి.

1. "విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు" (బాల-తత్సమ-75). అనగా- విశ్వకర్మ మొదలైన నకారాంతపుంలింగశబ్దములు తత్సమరూపము నొందినప్పుడు స్త్రీతుల్యత్వమును పొందుచున్నవి. అనగా పుంలింగశబ్దములకు రావలసిన ఉత్వడుజ్జులకు బదులు వానికి ప్రథమైకవచనలోపమగును. కనుక- విశ్వకర్మ-కృష్ణవర్త్మ-అశ్వత్థామ-అనియేయుండును.

ఈసూత్రమును ప్రౌఢవ్యాకరణకర్త సవరించుచు– "విశ్వకర్ముడనియు రూపంబు" (ప్రౌఢ–శబ్ద–27)– అని చెప్పినాడు. అనగా– విశ్వకర్మశబ్దమునకు ప్రథమైకవచనమున విశ్వకర్ముడను రూపమును కలదని ప్రౌఢవ్యాకరణ కర్త అభిప్రాయము. ఉదా: విశ్వకర్మునికూతు విశదలావణ్యసముజ్జ్వలన్ (ఉ.హరి–4ఆ). ఇచ్చట – డుమంతములకు మాత్రమే నిగాగమము కలుగును కనుక, ఉత్తర హరివంశములోని నాచనసోముని ప్రయోగము 'విశ్వకర్ముడు'అను రూపము నుండియే ఏర్పడినదని ప్రౌఢవ్యాకరణ కర్త అభిప్రాయము. కాని నన్నయభట్టు 'విశ్వకర్మ' అని ప్రయోగించుటయే సూరి సూత్రమునకు మూలము కావచ్చును.

ఇట్లే – 'కృష్ణవర్త్మ' శబ్దమునకును 'కృష్ణవర్త్ముడు' (అగ్నిహోత్రుడు) అనియే ఎక్కువ ప్రయోగము. కనుక ప్రౌఢవ్యాకరణకర్త దీనిని కూడ తన సూత్రమున చేర్చియుండవలసినది (బాల–ప్రౌఢ – వ్యాఖ్య – పు. 225).

2. "మహద్వాచకంబయి పులింగంబగు బ్రహ్మశబ్దమునకు స్త్రీత్వంబగు" (బాల–తత్సమ–76). అనగా – నకారాంత పులింగం శబ్దంబైన 'బ్రహ్మ' శబ్దము స్త్రీ తుల్యత్వము నొందును. అనగా ప్రథమైకవచన లోపంబై 'బ్రహ్మ' అనియే యగును. దీనికి చతుర్ముఖుడు, ఋత్విజుడు, బ్రాహ్మణుడు – అని అర్థము.

అట్లుకాక – 'బ్రహ్మ' అన్న శబ్దము అదంతము కనుక – "అమహన్నపుంసకముల కదంతములకు ము వర్ణకం బగు" (బాల–తత్సమ–39) – అన్న సూత్రము ప్రకారము ము వర్ణకము వచ్చి, 'బ్రహ్మము' అని అగును. అప్పుడు 'బ్రహ్మపదార్థ'మని యర్థము.

3. "ఆత్మేమనిజంతంబులకు, నాంతంబగు మనుజ సంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు" (బాల–తత్సమ–77). అనగా – ఆత్మ శబ్దమునకును, ఇమనిచ్ ప్రత్యయాంతములైన 'మహిమ – అణిమ – గరిమ– లఘిమ' వంటి శబ్దములకును, మనుజనామములను తెలుపు నకారాంత శబ్దములకును, స్త్రీత్వము బహుళముగా నగునని అర్థము. ఉదా : ఆత్మ – ఆత్మము – ఆత్ముడు ; మహిమ –మహిమము; గరిమ – గరిమము; దేవశర్మ – దేవశర్ముడు.

'బహుళము' అనుటచే – ఆత్మాదులకు వికల్పముగను, అశ్వత్థామాదులకు నిత్యముగను స్త్రీత్వము కలుగుచున్నది. సుత్రామాదులకు కలుగుటలేదు (బాల–ప్రౌఢ– వ్యాఖ్య – పు. 258).

4. "మహత్త్వంబున స్వార్థపరంబగు రాజశబ్దము రాజు నాబడు" (బాల-తత్సమ-78). అనగా - రాజ శబ్దముమహద్వాచకమై స్వార్థ ప్రాధాన్యము కలిగినదయినచో 'రాజు' అని యగును. వాస్తవమునకు నకారాంత పుంలింగ శబ్దమైన 'రాజన్' శబ్దము యొక్క ప్రథమైక వచన రూపము 'రాజా' అని. అది తత్సమరూపము నొందినప్పుడు, దాని దీర్ఘము హ్రస్వమై 'రాజ' అనియు, దానికి ఉత్వడుజ్జులు వచ్చినచో 'రాజుడు' అనియు కావలయును. అట్టి అనిష్టరూపమును ప్రస్తుత సూత్రము వారించుచున్నది. కనుక - మహారాజు, మునిరాజు, ఖగరాజు, గజరాజు అనియే యుండును. కాని ఉపసర్జనత్వము (అనగా-అప్రధానత్వము) నందు మాత్రము ఉత్వడుజ్జులను పొందవచ్చును. ఉదా॥ హతరాజుడు పరశురాముడు - ఈ వాక్యమున 'హతరాజుడు' అనునది 'పరశురాముడు' అను శబ్దమునకు విశేషణము. దానికి క్రియతో అన్వయము లేదు. కనుక ఉత్వడుజ్జులను పొందినది.

## 5. సకారాంత శబ్దములు:

సకారాంత సంస్కృతశబ్దములు తత్సమ రూపము నొందినప్పుడు ఈ క్రింది రూపములను పొందు చున్నవి.

1. "సాంతంబుల తుదిసకారంబునకు లోపంబు బహుళంబుగా నగు" (బాల-తత్సమ-80). అనగా- సకారాంతశబ్దముల సకారమునకు బహుళముగా లోపము కలుగును. ఈ శబ్దములలోను ప్రథమైక వచనాంత రూపములనే ప్రాతిపదికలుగా గ్రహించి, వానికి ఉత్వద్విత్వములను చేర్చవలెను (బాల-తత్సమ-67, 68). ఉదా॥ ఉరస్సు;వక్షస్సు; అర్చిస్సు; ధనుస్సు; ఆయుస్సు.

సూత్రమున 'బహుళము' అనుటచే - ఈ విధి కలుగని పక్షమున - అదంత అమహద్వాచకములకు - మువర్ణము కలుగును(బాల-తత్సత-39)-ఉరము; వక్షము. ఇకారంత శబ్దములకు ప్రథమైక వచనలోపము (బాల-తత్సమ-50) - అర్చి.

2. ఉకారాంతములకు - వు వర్ణము కలుగును (బాల-తత్సమ-48)- ధనువు; ఆయువు. కనుక పై శబ్దములకు - ఉరము - ఉరస్సు; వక్షము - వక్షస్సు; అర్చి- అర్చిస్సు;ధనువు- ధనుస్సు; ఆయువు - ఆయుస్సు - అను రెండు రూపములు నుండును. కాగా "బహుళగ్రహణమునం జేసి పయః ప్రభృతుల

సకారంబునకు లోపంబు లేదు" అన్న వృత్తిలో, పయస్సు మొదలైన శబ్దములకు ఉత్వద్విత్వములు నిత్యమని చెప్పినాడు సూరి. ఉదా: పయస్సు - పయస్సు - సరస్సు.

2. "మహద్వాచకంబుగు సాంతంబుల కంత లోపంబేని, ద్వితీయైక వచనాంతతుల్యత్వంబే నగు" (బాల-తత్సమ-81). అనగా- మహద్వాచక సకారాంత శబ్దములకు, తుది సకార లోపముకాని, ద్వితీయైక వచనాంత తుల్యత్వము కాని అగును.

తుది సకార లోపమైనప్పుడు - మహద్వాచకములకు వచ్చు ఉత్వడుజ్జులు కలిగి - అంగిరుడు; ఉగ్రశ్రువుడు; ప్రచేతుడు - అని అగును. ద్వితీయైకవచనాంతతుల్యత్వమున- అంగిరసమ్' లోని అంతిమ మకారమునకు లోపము కలిగి, ఉత్వడుజ్జులు చేరగా- అంగిరసుడు, ఉగ్రశ్రవసుడు, ప్రచేతసుడు - అని అగును.

3. "వేధ పురోధ పురోధసుడు" (బాల-తత్సమ-82) - అనగా - 'వేధ' శబ్దమునకు నిత్యముగను, 'పురోధ' శబ్దమునకు వైకల్పికముగను, సకారాంత లోపమును స్త్రీ వద్భావమును అగున ని తాత్పర్యము. ఉదా: వేధ; పురోధ - పురోధసుడు.

4. "మనః ప్రభృతుల సకాంబునకు ద్విత్వంబు విభాష నగు" (బాల-తత్సమ-83). అనగా - మనస్సు మున్నగు సకారాంత శబ్దముల చివరి సకారమునకు ద్విత్వము విభాషగా అగు నని అర్థము. ఉత్వద్విత్వములు (బాల-తత్సమ-68) కలిగినచో - మనస్సు; శిరస్సు; సదస్సు - అని అగును. ప్రస్తుత సూత్రము ప్రకారము ద్విత్వము వైకల్పికముగా నైనచో - మనసు - మనస్సు; శిరసు - శిరస్సు; సదసు - సదస్సు - అని యగును.

బాల -తత్సమ - 81 సూత్రమును బట్టి సలోపమైనచో, బాల- తత్సమ - 39సూత్రము ప్రకారము ము వర్ణకము కలిగి - మనము - శిరము - సదము - అని యగును.

ఇట్లు సకారాంత శబ్దములు తత్సమరూపములను పొందు విధానము వివరింపబడినది.

# V. ఆచ్ఛికపరిచ్ఛేదము

సంస్కృతప్రాకృత శబ్దములనుండి తత్సమములు నిష్పన్నమైన విధానము తత్సమపరిచ్ఛేదమున వివరింపబడినది. తెలుగు భాషలో తత్సమములే కాక సంస్కృతభవములు, ప్రాకృతసమములు, ప్రాకృతభవములు, దేశ్యములు అయిన శబ్దములు అనేకములున్నవి. వానిని ఆచ్ఛికములందురు. వాని రూపనిష్పాదనము ఈ పరిచ్ఛేదమున వివరింపబడినది.

"సంస్కృతసమేతరంబయిన ఈ భాష యచ్ఛయనంబడు" (బాల-ఆచ్ఛిక-1) - అని సూరి ఆచ్ఛిక నిర్వచనము నిచ్చినాడు. అనగా- సంస్కృతసమము కానిదానిని ఆచ్ఛికభాష అని అందురు. అది క్రింది విధముగా ఏర్పడుచున్నది.

## 1. ఏకవచనరూపములు

1. "ఆచ్ఛిక శబ్దంబులెల్లం దరచుగా స్త్రీసమంబులుం గ్లీబసమంబులునై యుండు" (బాల-ఆచ్ఛిక-2). అనగా - ఆచ్ఛిక శబ్దములు సాధారణముగా స్త్రీసమములుకాని, నపుంసక సమములుకాని అయియుండునని అర్థము. స్త్రీ సమములనగా ప్రథమైకవచనలోపమునందిన శబ్దములు. ఉదా॥ అన్న-మిన్న-జాణ-గాణ (పాటగాడు)-ఓడ-గోడ. ఈ శబ్దములన్నింటికిని - "స్త్రీలింగంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు" (బాల-తత్సమ-57) అను సూత్రము ప్రకారము ప్రథమైకవచన ప్రత్యయమైన 'సు' చేరి, తిరిగి అదిలోపించి, యథారూపముగానుండును.

నపుంసక తుల్యములైనచో - అదంతనపుంసకములకు వచ్చు ముపర్ణకము (బాల-తత్సమ-39) కలుగును. ఉదా॥ బియ్యము - నెయ్యము - అల్లము - సున్నము- సన్నము. 'తరచుగా' అనుటచే - పులింగతుల్యములును కొన్ని కలవని సూరి వృత్తియందు చెప్పినాడు. అట్టి శబ్దములకు ఉత్వడుజ్జులు (బాల-తత్సమ-20,21) కలుగును. ఉదా॥ కొమరుడు - చందురుడు - జముడు - కందుడు. కాని ఇవి చాలా స్వల్పసంఖ్యలో నున్నవి.

2. "బల్లిదాదులు సంస్కృత తుల్యంబులు" (బాల-ఆచ్ఛిక-3) - బల్లిద మున్నగు తెలుగు ప్రాతిపదికలకు విభక్తిని వివక్షించునపుడు, వానిని సంస్కృత ప్రాతిపదికలతో

సమానముగా గ్రహించి ప్రక్రియను జరుపవలెను. అనగా వీనికి మహద్వాచకములైనచో ఉత్వడుజ్ఞాదులును, అమహద్వాచకములైనచో ముప్వర్ణకాదులును, స్త్రీవాచకములైనచో 'ఆలు' శబ్దముతో సమాసమును కలుగునని వృత్తిలో వివరించినాడు సూరి. ఉదా: బల్లిదుడు – బల్లిదము – బల్లిదురాలు.

బల్లిద – అక్కజ(ఆశ్చర్యము) – కావల (పాపము) – మిసిమింత (అలసిన)– ఇత్యాదులు బల్లిదాదులు.

3. "మహత్తులగు మగాదులకుం గయిరాదులకునుడుజ్ఞగు; నుత్వంబుగాదు" (బాల–ఆచ్చిక–4). అనగా– మహద్వాచకములయిన మగ మొదలైన వానికిని, అమహద్వాచకములయిన కయిర మొదలైనవానికిని, డుఙ్ వర్ణకము మాత్రమే అగును. వాని తుది అత్వమునకు ఉత్వము కలుగదు. ఉదా:

ఎ) మగాదులకు – మగడు, మనుమడు, తేడు.

బి) 'ఈ–కా' అను ప్రత్యయములు అంతమందున్నను డుజ్ఞ్వర్ణకము వచ్చును – కపటీడు – బానిసీడు – విలుకాడు – ఆటగాడు – మొనగాడు.

సి) అమహద్వాచకములకు – కయిరడు – నీలడు – జన్నడు (ఇవి గుఱ్ఱముల పేర్లు)

ప్రౌఢవ్యాకరణ కర్త దీనిని సవరించి – తెలుగులో కొన్ని తత్సమశబ్దముల మీదను, దేశ్యశబ్దముల మీదను ఏకవచనమున నీచత్వద్యోతకములై 'ఇగా' అనుశబ్దమును, దానిపైన డువర్ణకాదులును కనబడుచున్నవని చెప్పినాడు. సంబోధనమున ఈ డు వర్ణకము చూపట్టదనియు, తుది దీర్ఘమునకు హ్రస్వము వైకల్పికముగా అగుననియు ఆయన అభిప్రాయము (ప్రౌఢ – శబ్ద – 22). ఉదా: బాలిగాడు – చిట్టిగాడు. సంబోధనమున – బాలిగా చిట్టిగా. తుది దీర్ఘమునకు హ్రస్వము వైకల్పికముగా వచ్చిన– బాలిగ – చిట్టిగ.

ఈ 'ఇగా' అనునది నీచత్వ బోధకముగనే కాక, మైత్రీవాత్సల్యాదులందును కన్పట్టుచున్నది. ఉదా: కృష్ణగాడు – శర్మగాడు – బాబుగాడు.

4. కొన్ని స్త్రీవాచకములైనదేశ్య శబ్దములపైనను, స్త్రీ సమముల పైనను,

ఏకవచనమున 'కాన' శబ్దము కనిపించు చున్నది(ప్రౌఢ - శబ్ద-15). ఉదా॥ తల్లికాన(శృ.నై - 7అ); సామికాన (సారంగ - 1అ)

5. "కూఁతు శబ్దము ప్రథమైక వచనంబునకు రువర్ణంబగు" (బాల-ఆచ్చిక-9). అనగా - కూఁతు శబ్దమునకు ప్రథమైక వచనమున రువర్ణము అదనముగా చేరునని అర్థము. ఉదా॥ కూఁతురు.

6. "కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు; బహువచనము పరంబగునపుడు నిత్యముగానగు"(బాల-ఆచ్చిక-18) - కలను మొదలైన శబ్దముల తుది నువర్ణమునకు బదులుగా ఏకవచనమున కుజ్జు వికల్పముగా నగును. ఉదా॥ కలను-కలకు; కెలను-కెలకు; కొలను-కొలకు; మ్రాను - మ్రాకు. బహువచనము పరమైనచో - కలకులు; కెలకులు; కొలకులు; మ్రాకులు.

7. "అట్లురేనుగోను శబ్దముల నువర్ణంబు గుజ్జగు" (బాల-ఆచ్చిక-19). అనగా - పూర్వసూత్రమున చెప్పినట్లు రేను, గోను శబ్దములకును కుజ్జు ఏకవచనమున వికల్పముగను, బహువచనమున నిత్యముగను అగునని అర్థము. ఉదా॥ రేను-రేగు; గోను - గోగు.

8. "ఇయకు మారుగా నామాంతరంబున కెత్వంబు బహుళంబుగానగు" (బాల-ఆచ్చిక-23). అనగా- నామాంతమునందలి ఇయ అను అక్షరములకు బదులుగా ఎత్వము బహుళముగా నగునని అర్థము. ఉదా॥ కన్నియ - కన్నె;వన్నియ- వన్నె; కొండియము - కొండెము.

బహుళగ్రహణముచే 'సందియము-కాటియ' మొదలగు శబ్దములందు ఎత్వము లేదని వృత్తియందు సూరి తెలినాడు.

అట్లే 'ఇయ' శబ్దమునం దికారలోపమును కొందఱు చెప్పినారు. కాని దానికి ప్రయోగము కన్పించదనియు, 'ముత్తియ' శబ్దమునందు మాత్రము ఇత్వమునకు లోపముకన్పడుచున్నదనియు సూరి చెప్పినాడు. ఉదా॥ ముత్తియము - ముత్తెము-ముత్యము.

నామాంతము లందలి ఇట్టి ఇత్వమునకు లోపము ముత్తియ శబ్దమునందు మాత్రమేకాక ఇతర శబ్దములందును కన్పించుచున్నదని ప్రౌఢవ్యాకర్త చెప్పినాడు (ప్రౌఢ-శబ్ద-49). ఉదా: కన్నియ -కన్య; దివ్వియ-దివ్య; వీడియము - వీడ్యము.

**9. నిత్యైకవచనములు:**

ఎ) "దేశ్యమునందక్కడాదులు నిత్యైకవచనాంతంబు" (ప్రౌఢ-శబ్ద-28). అనగా- అక్కడ మొదలగు దేశ్య శబ్దములు నిత్యము ఏకవచనాంతములుగనే ఉండునని అర్థము. ఉదా: అక్కడ - ఇక్కడ-ఎక్కడ; అచ్చట-ఇచ్చట-ఎచ్చట.

"కొందఱు ఇరులు - కేలు శబ్దములు బహువచనములని అందురు. అట్లుకాదు"- అని సూత్రవృత్తిలో సూరి జ్ఞాపకము చేసినాడు. అనగా 'ఇరులు-కేలు' అను శబ్దముల చివరనున్న 'లు' ప్రత్యయమును చూచి అవి బహువచనములని భ్రమింతురనియు, కాని అవి ఏకవచనము లే అనియు సూరి అభిప్రాయము. ఉదా: ఇరులున (విజ్ఞా-ప్రా.); కలభాషిణి వేనలి ఒకకేల బట్టి వేఱొకకేల నొరగత్తి పెఱికి (కళా-3ఆ)

బి) "సస్యవాచక శబ్దములును" (ప్రౌఢ-శబ్ద-29). అనగా- పైరును గూర్చి చెప్పు శబ్దములును నిత్యైకవచనాంతములే అని అర్థము. ఉదా: వరి-కంది-పెసర-మినుము.

సి) "కతిపయ సంభార వాచకశబ్దములను" (ప్రౌఢ-శబ్ద-30). అనగా -ఇండ్లయందు నిత్యము ఉపయోగించు కొన్ని శబ్దములును నిత్యైక వచనాంతములే. ఉదా: ఇంగువ- ఉప్పు - చింతపండు-చమురు-పసుపు.

డి) "లోహవాచక శబ్దములును" (ప్రౌఢ-శబ్ద-31). అనగా - లోహములను తెలియజేయు శబ్దములును నిత్యైకవచనాంతములే. ఉదా: ఇత్తడి-రాగి-వెండి-బంగారము.

ఇ) "సమానార్థకములైన యీ డెన సరి సాటి లోనగు దేశ్య విశేషణ శబ్దములును' (ప్రౌఢ-శబ్ద-32)- అనగా- సమానము అను అర్థమును బోధించు 'ఈడు, ఎన, సరి సాటి' మొదలగు దేశ్య విశేషణ శబ్దములును నిత్యైకవచనములే. ఉదా: ఇరువురకుంజూడ నొక్కయీడై యునికిన్ (భా.రామా-కిష్కింధ); సతులీ భార్గవికి భాగ్యసంపదనెనయె (భార-ఆది-3ఆ).

ఎఫ్) "గుణరసవాచకములైన దేశ్యవిశేషణ శబ్దములును" (ప్రౌఢ-శబ్ద-33)- అనగా - గుణములను రసములను తెలుపు దేశ్య విశేషణ శబ్దములును నిత్యైకవచనాంతములే అగును. ఉదా: ఈ కాళ్ళు తెలుపు; ఆ పండ్లు పులుపు.

ఇవన్నియు నిత్యైకవచనాంత శబ్దములు.

ఇట్లు బాల-ప్రౌఢ వ్యాకరణ కర్తలు ఏకవచనాంతములైన ఆచ్ఛిక శబ్దముల తెలుగున ఏర్పడుచున్న విధానమును వివరించినారు.

## 2. బహువచన రూపములు

1. "పగతాదుల బహువచన లకారంబునకు రేఫంబగు" (బాల-ఆచ్ఛిక-5). అనగా- పగత మొదలైన ఆచ్ఛిక నామములకు బహువచనమును విధించునపుడు లకారమునకు బదులుగా రేఫము వచ్చునని అర్థము. ఈ పగతాదులు, బల్లిదాదుల లోనివి. కావున ఏకవచనమున వానికి ఉత్వడుజ్జులు కలుగును. ఆ తరువాత "లు వర్ణంబు బహువచనంబు" (బాల-తత్సమ-12) అన్న సూత్రము ప్రకారము వానికి బహువచనమున లువర్ణకము రావలసియుండగా ప్రస్తుత సూత్రము చేత 'ల' కారమునకు రేఫము కలిగి- పగతురు-అల్లురు-మల్లురు-వంటి రూపములేర్పడును.

సూత్రములో 'బహువచన లకార' మనుటచే ప్రథమావిభక్తి బహువచనము నందగు లు వర్ణకము తో పాటు, ద్వితీయాది విభక్తులకగు లడాగమమును కూడ గ్రహింపవలెనని భావము. అప్పుడు పగతురను - పగతురచేత - పగతురవలన వంటి రూపము లేర్పడును.

2. "కొన్ని డుమంతముల బహువచనలకారమునకు రేఫంబును దానికిముందు పూర్ణబిందుపూర్వక డకారంబు నగు" (బాల-ఆచ్ఛిక-6). డుజ్వర్ణకము చేరుటకు యోగ్యమైన రూపమును డుమంత మందురు (రాము-విష్ణు). అట్టి కొన్ని డుమంతములకు ప్రస్తుత సూత్రము చేత బహువచనమునందు వచ్చు లకారమునకు రేఫమై, దానికి పూర్వమందు పూర్ణబిందు పూర్వక డకారము (ండ్) అగునని అర్థము. ఉదా॥ గండండ్రు- మిండండ్రు.

3. "కా ప్రత్యయము మీది బహువచనలకారంబునకు లఘ్వలఘు రేఫంబులును, లఘురేఫంబునకు ముందు బిందుపూర్వక డకారంబునగు" (బాల-ఆచ్ఛిక-7).

ఆట, వేట మున్నగు శబ్దములకు మతుబర్థమున పుంస్త్వమున 'కా' ప్రత్యయము వచ్చునని సూరి తద్ధితపరిచ్ఛేదములో చెప్పియున్నాడు. అట్లు ఏర్పడిన కా ప్రత్యయాంతములును మగాది గణములోనివే (బాల-ఆచ్ఛిక-4) కనుక వానికి ఏకత్వమున డువర్ణకము కలుగును (ఆటకాడు-వేటకాడు). ప్రస్తుత సూత్రము చేత బహువచనము వచ్చు లకారమునకు బదులు లఘు-అలఘు రేఫములును, లఘురేఫమునకు ముందు బిందు పూర్వక డకారమును అగును. ఉదా॥ విలుకాండ్రు -విలుకాఱు; వేటకాండ్రు -

వేటకాఱు.

4. "ఱే ప్రభృతుల బహువచనమునకు ముందు డుఙ్జగు" (బాల-ఆచ్ఛిక-8). అనగా- 'ఱే' మొదలగు ఆచ్ఛిక నామముల బహువచన ప్రత్యయమునకు ముందు డుఙ్జగునని అర్థము.

ఈ 'ఱే' శబ్దము మగాది గణము లోనిది. దీనికి ఏకవచనమున 'డు' వర్ణకము కలిగి 'ఱేడు' అని అగును. బహువచనమున 'లు' ప్రత్యయము రాగా, ఏకవచన ప్రత్యయమైన 'డు' లోపించవలయును. అప్పుడు 'ఱేలు' అని కావలసి యుండును. కాని ప్రస్తు సూత్రముచే ఆ బహువచన లువర్ణమునకు ముందు డుఙ్జ వచ్చి 'ఱేడులు' అనియగును. కాగా - "సమాస పదంబునందు సంయోగంబు పరంబగునపుడెల్లచో ఖండబిందువునకుం బూర్ణంబగు" (బాల-ఆచ్ఛిక-15)- అన్న సూత్రము ప్రకారము 'ఱేండ్లు' అనియు నగును.

5. "కూఁతు శబ్దము ప్రథమైక వచనంబునకు రువర్ణంబగు" (బాల-ఆచ్ఛిక-9). అనగా - కూఁతు శబ్దమునకు ప్రథమైన వచనమున మాత్రమే రు వర్ణకము అధికముగా చేరునని అర్థము. అప్పుడు - బహువచన ప్రత్యయమైన లు వర్ణకము చేరినపుడు ప్రథమైక వచనమైన రువర్ణమునకు లోపము వచ్చును. ఉదా॥ కూఁతురు - కూఁతులను - కూఁతులచేత.

ఈ సూత్రము క్రింది వృత్తిలో - కూతురులు - కూతుళ్లు - కూతురిని - ఇత్యాది రూపములు గ్రామ్యములని ఎరుగవలెనని సూరి జ్ఞాపకము చేసినాడు. అనగా - అవి లక్షణ విరుద్ధములు గనుక ప్రయోగమున కనర్హములు.

6. "చెయువు బహువచనలకారంబున లఘురేఫంబు విభాషనగు" (బాల-ఆచ్ఛిక-10). అనగా- 'చెయువు' (చేష్ట) అను శబ్దమునకు బహువచనము పరమైనపుడు దాని లకారమునకు అలఘు రేఫము విభాషగా నగును. ఉదా॥ చెయువులు - చెయువుఱు; చెయువులను-చెయువుఱను.

7. "ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును, ముందరి లు వర్ణంబునకు బిందుపూర్వక డకారంబు నగు" (బాల-ఆచ్ఛిక-11).అనగా- 'ఆలు' మొదలైన శబ్దములు బహువచనలకారమునకు రేఫమగును. అట్టిచో తత్పూర్వమందున్న

శబ్దగత లు వర్ణమునకు బిందుపూర్వక డకారము (ండ్) అగునని అర్థము. ఉదా॥ ఆంౘ్రడు- ఆంౘ్రడును; చెల్లెంౘ్రడు- చెల్లెంౘ్రడను; కోడంౘ్రడు-కోడంౘ్రడను.

8. "బహువచనంబు పరంబగునపుడు డ-ల-ట-ర ల యుత్వంబుకు లోపంబు బహుళంబుగానగు" (బాల-అచ్చిక-12). అనగా- బహువచనమున వచ్చు లువర్ణముకాని, లడాగమము కాని పరమైనచో, డ-ల-ట-ర అను వర్ణములు అంతమందున్న శబ్దముల పైనున్న ఉత్వమునకు లోపము బహుళముగా అనునని అర్థము. ఉదా॥ గుండ్లు - గుండులు; కాళ్ళు-కాలులు; గొంట్లు-గొంటులు (దుప్టులు); గోరు - గోరులు.

బహుళ గ్రహణము చేత - విల్లులు, పిల్లులు, పులులు ఇత్యాదులందు లోపమురాదు.

తత్సమములైన 'కోటి-పిప్పలి' అనుశబ్దములకు ఈ కార్యము కనిపించు చున్నది. ఉదా॥ కోట్లు- కోటులు; పిప్పళ్ళు - పిప్పలులు.

9. "బహువచనము పరంబగునపు డసంయుక్తంబులై యుదంతంబులైన డ-ల-ర-ల కలఘులకారంబు బహుళంబుగానగు" (బాల-అచ్చిక-13). అనగా - అసంయుక్తములైన , ఉదంతములైన పదాంతముననున్న డ-ల-ర అను వర్ణములకు బహువచనమున లు ప్రత్యయముకాని, లడాగమముకాని పరమైనచో అలఘులకారము (ళ) బహుళముగా నగునని అర్థము. ఉదా॥ త్రాళులు-త్రాడులు; పిడికిళులు - పిడికిలులు; పందిళులు - పందిరులు.

10. " బహువచన శ్లిష్టంబులై యద్విరుక్తంబులైన డకారలకారంబుల కలఘు లకారంబు నిత్యంబుగానగు"(బాల-అచ్చిక -14). అనగా- బహువచన ప్రత్యయముతో సంశ్లేషమునొంది, అద్విరుక్తములైన డకార లకారములకు అలఘు రేఫము నిత్యముగా అచ్చికపరిచ్ఛేదముఅగునని అర్థము. ఉదా॥ త్రాళ్లు-గుమ్మళ్లు; మొగిళ్ళు-మొసళ్లు.

11. "సమాసపదంబునందు సంయోగంబు పరంబగునపు డెల్లచో ఖండ బిందువునకుం బూర్ణంబగు" (బాల-అచ్చిక-15). అనగా- సమాసపదము (అఖండపదము)లోని ఖండబిందువునకు బహువచన లకారముతో సంయుక్తమైన వర్ణము పరముగునపుడు అన్నియెడల పూర్ణబిందువగునని అర్థము. ఉదా॥ అనటులు - అనంట్లు; గోటులు-గోంట్లు; తేటులు-తేంట్లు; ఏడులు-ఏండ్లు.

ఈ సూత్రవృత్తిలో సూరి 'ఏండ్లు-కాండ్లు' వంటి శబ్దములందు డా కు ళా ఆదేశమగునని కొందఱు చెప్పినారని, తెనుగున బిందుపూర్వకములైన స్థిరములు లేమింజేసి అది గ్రాహ్యము కాదనియు చెప్పియున్నాడు. అందువలన - ఏఁళ్లు, కాఁళ్లు వంటి అనిష్టరూపములు వారింపబడినవి.

12. "ఔపవిభక్తికంబుల లివర్ణ సలల వర్ణంబులకు బహువచనంబు నరంబగునపుడు పూర్ణబిందు పూర్వక డువర్ణంబు బహుళంబుగా నగు"(బాల-ఆచ్ఛిక-16).

కొన్ని తెనుగు శబ్దములకు ద్వితీయాద్యేక వచనములు పరమగు నపుడు 'ఇ-చి-తి' అను వర్ణములు చేరుచున్నవి. అట్టి వానిని ఔపవిభక్తికములందురు. అట్టి ఔపవిభక్తిక శబ్దముల చివర నున్న లివర్ణమునకును, లకారముతోనున్న లువర్ణము(ల్లు) నకును, బహువచనము పరమగునపుడు బిందుపూర్వక డువర్ణము బహుళముగా నగును. ఉదా॥ కొడవలి-కొడవండులు;ఉల్లోపమైన-కొడవండ్లు; అలఘులకారము వచ్చినచో - కొడవళులు - కొడవళ్లు-కొడవలులు.

సూత్రమున ఈ విధి బహుళమనుటచే కల్లు- పల్లు-ఱెల్లు-వంటి శబ్దములు అనౌప విభక్తికము లగుటవలన వానికీవిధి వర్తింపదు.

13. "ఒకానొకచో నామంబు సంశ్లిష్ట బహువచనాంతతుల్యంబై బహువచనంబునెనయు" (బాల-ఆచ్ఛిక-17). అనగా- ఒక్కొక్కసారి బహువచన ప్రత్యయముతో సంయోగము నొందిన శబ్దము మరల బహువచనప్రత్యయమును పొందుట ప్రయోగములలో అచ్చట కన్పించుచున్నదని అర్థము. ఉదా॥ కొడవండ్లులు-కొడవండ్లులను; కొడవళ్లులు-కొడవళ్లులను.

14. "దేశ్యంబునం గొన్నియెడల మహన్మహత్వార్థక బహువచనాంత నామంబులపై మరల బహువచన ప్రత్యయములు చూపట్టెడు అచ్చో వారు - వీరు - మీరు శబ్దంబుల యంత్యోకారంబున కకారంబగు" (ప్రౌఢ-శబ్ద-48). దేశ్య శబ్దములు కొన్నింటికి మహదర్థకము నందును మహత్వార్థకము నందును బహువచనముపై మరొక బహువచనము వచ్చుట కొన్ని చోట్ల కనిపించుచున్నది. ఉదా॥ కోడండ్రురు - పెక్కండ్రురు-ఒకరులు.

అట్లే వారు - వీరు - మీరు అను శబ్దములును మరల బహువచనము నొంది నప్పుడు వాని చివరనున్న ఉకారమునకు అకారమగును. ఉదా: వారలు - వీరలు-మీరలు.

15. "కలన్వాదుల నువర్ణంబు కుబ్జగు, బహువచనము పరంబగునపుడు నిత్యముగానగు" (బాల-ఆచ్ఛిక-18). కలను మొదలైన శబ్దముల చివరి నువర్ణమునకు బదులుగా కుబ్జ ఏకవచనమున వికల్పముగను, బహువచనమున నిత్యముగను అగునని అర్థము. కుబ్జ అనగా బిందు పూర్వకమైన కువర్ణకమని అర్థము. ఉదా: కలను-కలఁకు-కలఁకులు;మ్రాను- మ్రాఁకు-మ్రాఁకులు.

కలను-కెలను-కొఱను-కొలను-గవను-నెఱను-మ్రాను-వరను-ఇవి కలన్వాదులు.

16. "అట్లు రేను గోను శబ్దముల నువర్ణకంబు గుజ్జగు" (బాల-ఆచ్ఛిక-19). అనగా- కలన్వాదులవలెనే రేను, గోను శబ్దముల చివరి నువర్ణమునకును వికల్పము గు పరమగును. ఉదా: రేఁగు - రేఁగులు; గోను - గోఁగు - గోఁగులు.

17. "బహువచనంబు పరంబగునపుడు చేను - పేను - మీను శబ్దంబుల నువర్ణంబు లోపించు" (బాల-ఆచ్ఛిక-20). అనగా- చేను - పేను - మీను శబ్దములకు బహువచనము పరమైనచో, వాని చివరి నువర్ణము లోపించును. ఉదా: చేను +లు = చేలు; పేను + లు = పేలు; మీను + లు = మీలు.

ద్వితీయాది విభక్తులు పరమైనచో లడాగమమై - చేలలో, పేలను, మీలకు - అను రూపము లేర్పడును.

18. "బహువచనంబు పంరబగునపుడు రేయి ప్రభృతుల తుది యక్షరంబు లోపించు"(బాల-ఆచ్ఛిక-21). అనగా- రేయి మొదలైన - శబ్దములకు బహువచనము పరమైనను, బహువచనలకారము పరమైనను వాని చివరి అక్షరము లోపించును. ఉదా: రేయి - రేలు; ఊయి - ఊలు; వేయి - వేలు.

"ఈ లోపంబు సమాసంబులందుఁజూపట్టెడు" - అని వృత్తిలో చెప్పినాడు సూరి. అందువలన ఈ రేయి మొదలైన శబ్దములు సమాసములలో పూర్వ శబ్దములైనప్పుడును, వాని తుది యక్షరమునకు లోపము వచ్చుచున్నది. ఉది: రేయి+రాజు = రేరాజు; వేయి + వెలుగు = వేవెలుగు.

19. "బహువచనంబు పరంబగునపు డావు ప్రభృతుల తుది యక్షరంబునకు లోపంబు విభాషనగు" (బాల-ఆచ్ఛిక-22). అనగా- ఆవు మొదలైన శబ్దములకు బహువచనముకాని - బహువచనలకారముకాని పరమైనప్పుడు, వాని తుది యక్షరమునకు లోపము విభాషగా నగును. ఉదా॥ ఆవు - ఆలు - ఆవులు ; జాము - జాలు - జాములు; చుట్టము - చుట్టలు - చుట్టములు ; మీసము - మీసలు - మీసములు.

20. ఎద్దు - దేవర శబ్దములకు 'లు-ల' లు పరమైనప్పుడు - దకారమునకు డకారమును, దాని ఉత్వమునకు లోపము వికల్పముగను అగును (ప్రౌఢ -శబ్ద-50).

ఉదా॥ ఎద్దులు - ఎడ్డులు - ఎడ్లు; ఎద్దులన్ - ఎడ్డులన్ - ఎడ్లన్.

అట్లే - దేవర శబ్దము చివరి రేఫమునకు ళకారమును, ఆ ళకారము యొక్క అత్వంబునకు లోపంబును నిత్యముగా నగును. ఉదా॥ దేవళ్లన్.

21. "కొన్ని యవ్యయంబులు బహువచనాంత తుల్యంబులునగు" (ప్రౌఢ-శబ్ద-34). అవ్యయములు లింగవచనవిభక్తి రహితములు. అందువలన వానిపై విభక్తులు చేరరాదు. కాని - 'అట్టు, ఇట్టు, ఎట్టు, నిచ్చ' వంటి వానిపైనను లు ప్రత్యయము చేరి 'అట్లు, ఇట్లు, ఎట్లు, నిచ్చలు' అని కన్పించుచున్నది. అవ్యయములకు బహువచనాంతత్వము లేదు కనుక, ప్రౌఢవ్యాకరణకర్త "బహువచనాంతతుల్యములగుచున్న" వని జాగరూకతతో తెల్పియున్నాడు.

సూత్రమున "బహువచనాంతుల్యంబులును అగు" అని సముచ్చయార్థకమును చేర్చి చెప్పుట వలన లువర్ణ విరహితములైన - 'అట్టు, ఇట్టు, ఎట్టు, నిచ్చ' వంటి రూపములు ఉండవచ్చునని తాత్పర్యము.

## 22. నిత్యబహువచనాంతములు:

ఎ) "అందఱ్వాదులు నిత్యబహువచనాంతములు" (ప్రౌఢ-శబ్ద-35). అనగా- అందఱు మున్నగు శబ్దములు నిత్య బహువచనాంతములు. వానికి ఏకవచనరూపములుండవనిభావము. ఉదా॥ అందఱు - ఇందఱు - ఎందఱు-కొందఱు-పెక్కండ్రు- పలువురు- పలుగుండ్రు.

ఇట్లే - ఇద్దరు, ముగ్గురు, నలుగురు వంటివి కూడ నిత్య బహువనచాంతములే! (బాల-ప్రౌఢ-వ్యాఖ్య - పు.312)

బి) "అదరులు లోనగుశబ్దములును" (ప్రౌఢ-శబ్ద-36). అనగా- అదరులు మొదలైన శబ్దములును నిత్య బహువచనాంతములే యని యర్థము. ఉదా॥ అదరులు(మిణుగురులు); అలుపుళ్ళు (ముక్కులు); ఎండుపులు (ఎండబోసిన ధాన్యము); మిడుఁగుఱులు (మిడుఁగుఱు పురుగులు).

కాని, పై ఉదాహరణలలోధాన్యవాచకమైన 'ఎండవులు' అన్నదికాక మిగిలిన వానికి ఏకవచన రూపములు లేవనుట సముచితముగా కన్పట్టదు (బాల-ప్రౌఢ-వ్యాఖ్య-పు. 313).

సి) "తఱచుగ ధాన్యవాచక శబ్దములును" (ప్రౌఢ-శబ్ద-37). అనగా - దాన్యవాచక శబ్దములు చాలవరకు నిత్యబహువచనాంతములే! ఉదా॥ వడ్లు - కందులు - పెసలు- మినుములు.

సూత్రమున 'తఱచుగ' అనుటచే 'బియ్యము, జీలకఱ్ఱ' వంటి ధాన్యవాచకములు నిత్యైకవచనాంతములేయని గ్రహింపవలయును.

అంతేకాక, సమాసవిధియందివి పూర్వశబ్దము లైనచో వానికిని ఏకవచన రూపము లేర్పడుచున్నవి. ఉదా॥ కందిచేను - వరిపంట - పెసరబద్ద.

డి) "క్రీడా విశేషవాచక శబ్దములను"(ప్రౌఢ-శబ్ద-38). అనగా- కొన్ని క్రీడా విశేషములను దెలుపు శబ్దములును నిత్యబహువచనాంతములే! ఉదా॥ అచ్చనగాయలు - ఓమన గుంటలు - గుజ్జెన గూళ్లు- కుప్పిగంతులు.

చిట్లపొట్లకాయ - చిడుగుడు - చిల్లకట్టె - సరిబేసి-వంటి ఏకవచనరూపములను కొందరు ప్రయోగించియున్నారు - కాని అది విచార్యము - అని వృత్తిలో పేర్కొన్నాడు ప్రౌఢవ్యాకరణకర్త.

## 23. విశేషరూపములు:

ఎ) కొన్ని దేశ్య శబ్దములకు పూజ్యతా ప్రతిపాదనమున 'గారు' అను శబ్దము కలుగుచున్నది(ప్రౌఢ-శబ్ద-39). ఉదా॥ అమ్మగారు - నాన్నగారు - సెట్టిగారు - నాయుడుగారు.

బి) వానికి ద్వితీయాది విభక్తులు పరమైనప్పుడు చివరి 'రు' - 'రి' అని యగును (ప్రౌఢ-శబ్ద-40). ఉదా: అయ్యగారిని - అయ్యగారితో - అయ్యగారికి.

సి) కొన్ని డుమంతములైన తత్సమశబ్దములకు పూజ్యతయందు గారునకు మారుగా 'వారు' అని అగుచున్నది (ప్రౌఢ-శబ్ద-41). ఉదా: శ్రీరాములవారు - స్వాములవారు - వ్యాసులవారు - రాయలవారు.

డి) ఈ 'వారు' అనునది పూజ్యతయందేకాక, విశేషార్థ బోధనమునను కన్పించుచున్నది (ప్రౌఢ-శబ్ద-42). ఉదా: అమ్మవారు (దేవత) - అయ్యవారు (గురువు)- దేవరవారు (రాజు)

ఇ) పూజ్యత్వాతిశయమున యుష్మదర్థ బహువచనాంత రూపమునకు బదులుగా ఆత్మార్థ బహువచనాంతరూపము కన్పించుచున్నది (ప్రౌఢ-శబ్ద-45). ఉదా: స్వామీ! తాము దయచేయవలయును.

ఎఫ్) సంబంధార్థమును తెలుపునప్పుడు యుష్మదస్మచ్ఛబ్దంబులకు బహుత్వము వచ్చును. ఉదా: మాయిల్లు - మీ యిల్లు.

జి) ఇంకను కొన్నిచోట్ల ఈ బహువచనాంతము తఱచుగా నిత్యవ్యవహారమున కన్పించుచున్నది. వానిని ప్రయోగములను బట్టి తెలిసికొనవలయును (ప్రౌఢ-శబ్ద-47). ఉదా: ఎవరక్కడ? - ఒకరు పోయిన త్రోవ కొకరు పోరు - వారొక్కరే వచ్చిరి - నీవెవ్వరు (భార - విరా-1ఆ) - మజ్జనని తానది యెవ్వరు? (పూర్వ - 5ఆ).

# 3. నామములు

1. "శబ్దములు విశేష్యములు విశేషణములని ద్వివిధంబులు" (ప్రౌఢ-శబ్ద-1). అనగా - శబ్దములు లేదా నామములు విశేష్యములనియు, విశేషణము లనియు రెండు విధములుగా నుండునని అర్థము. అయ్య, అన్న, అమ్మ, అక్క మొదలైనవి విశేష్యములు. తక్కినవి విశేషణములు (వృత్తి).

"విశేష్యమునా విశేషణముచే దెలుపబడు విశేషము గలది; విశేషణమునా జాత్యాది విశేషములను దెలుపునది" (ప్రౌఢ-శబ్ద-2). అనగా - విశేషణము చేత తెలుపబడు విశేషము కలది విశేష్యమనియు, నామము యొక్క జాత్యాది విశేషములను తెలుపునది విశేషణమనియు అందురు (బ్రాహ్మణుడు, పోవువాడు, నల్లనివాడు మున్నగునవి విశేషణములు).

2."విశేషణము జాత్యాది భేదంబుచే షడ్విధంబు" (ప్రౌఢ-శబ్ద-3). అనగా- జాతి, క్రియా, గుణ ద్రవ్య, సంఖ్యా, సంజ్ఞా భేదములచే విశేషణములు ఆరువిధములుగా ఉండునని అర్థము.

ఎ) జాతి ప్రయుక్త విశేషణము - బ్రాహ్మణుడు
బి) క్రియా ప్రయుక్త విశేషణము - పోవువాడు
సి) గుణ ప్రయుక్త విశేషణము - నల్లనివాడు
డి) ద్రవ్య ప్రయుక్త విశేషణము - ధనవంతుడు
ఇ) సంఖ్యాప్రయుక్త విశేషణము - ఒక్కడు
ఎఫ్). సంజ్ఞాప్రయుక్త విశేషణము - దేవదత్తుడు.

3. "విశేష్యంబు ప్రధానం బితరంబప్రధానంబు" (ప్రౌఢ-శబ్ద-6). అనగా - వాక్యములందు ప్రధానమైనది విశేష్యము, ప్రధానము కానిది విశేషణము అని అర్థము.

4. "ప్రధానంబు పశ్చాద్వాచ్యంబగు" (ప్రౌఢ-శబ్ద-7). అనగా - వాక్యమున విశేషణములను ముందు చెప్పి, తరువాత విశేష్యమును చెప్పవలెనని భావము.

5. "ఒక్కచో విశేషంబులును విశేష్యంబులగు" (ప్రౌఢ-శబ్ద-8). అనగా- ఒక్కొక్కచోట విశేషణము విశేష్యముగా ఉపయోగింపబడునని సూత్రార్థము. ఉదా॥ నారదుం డిట్లనియె. ఈ ఉదాహరణమున - 'నారదుడు' అనునది సంజ్ఞాప్రయుక్త విశేషణము (ప్రౌఢ-శబ్ద-3). విశేష్యము వేరుగా లేదు. కావున విశేషణమే విశేష్యము యొక్క స్థానము పొందినదని భావము.

నిజమునకు సంజ్ఞావాచకములను విశేష్యములుగా గ్రహింపవలెను. అట్లుకాక విశేషణములుగా గ్రహించుటయు, అవి మరల విశేష్యముల స్థానమున వచ్చిన వనుటయు, సరియైన మార్గముగా కన్పించుదు (బాల-ప్రౌఢ-వ్యాఖ్య-పు. 302).

6. "ఒక్కొక్కచో విశేష్య విశేష్య - విశేషణముల క్రమము తారుమారగునని అర్థము. ఉదా॥ నీ మాఱుఁదల్లి త్రిభువన భామారత్నంబు (హరి . పూర్వ - 2ఆ). ఈ ఉదాహరణములో - 'మాఱుఁదల్లి' అనునది విశేష్యము. దానికి 'త్రిభువనభామారత్నము' అను విశేషణము ముందుండవలసినది. ఇందు విశేషణ విశేష్యములు తారుమారైనవి.

7. "తెనుగునంగొన్ని శబ్దములు విశేష్య విశేషణంబు లుభయంబునగు" (ప్రౌఢ-శబ్ద-10). అనగా- తెలుగులో కీడు, నల్ల మొదలైన శబ్దములు విశేషణముగను, విశేష్యముగనుకూడ ప్రయోగింపబడునని అర్థము. ఉదా॥ ఏ కీడులేదు - ఇచట కీడు శబ్దము విశేష్యము; వారల తలంపులు కీడు - ఇచట కీడు శబ్దము విశేషణము.

అట్లే - అమ్మహాశ్వంబు ధవళదేహంబునందు నల్లగలిగిన - ఇచట నల్ల అనునది విశేష్యము; ఈ నల్ల తిరునామమెచట దొరికె అనుచోట నల్ల శబ్దము విశేషణము.

8. "విశేషంబులు కొన్ని వ్యవహితంబులునగు" (ప్రౌఢ-శబ్ద-11). అనగా- విశేషణములకును విశేష్యములకును నడుమ ఇతర పదములు ప్రవేశించి కొన్నియెడల వ్యవధానమును కలిగింప వచ్చునని తాత్పర్యము. ఉదా॥ ఈ లోకంబున వెదకితి, మేలెల్లెడ కాన వరుని (నిర్వ-3ఆ). ఇచట 'వరుని' అన్నది విశేష్యము. 'మేలు' అన్నది విశేషణము. ఈ రెంటికిని నడుమ 'ఎల్లెడ, కాన' అనురెండు నదములు చేరి వ్యవధానము కలిగించినవి.

9. "విశేషణంబులు కొన్ని యెడల విశేష్యలక్ష్యకంబులగు" (ప్రౌఢ-శబ్ద-12). అనగా - కొన్ని చోట్ల విశేషణములే విశేష్యములను సూచించునవిగా ఉండునని అర్థము. ఉదా॥ బెట్టిదంబులంగాని చక్కంబడడు (భార-ఆర-6ఆ). ఇచట 'బెట్టిదములు' అనగా బెట్టిదపు మాటలచేత అని అర్థము. విశేషణమే విశేష్యముగా ప్రయుక్తమైనది. ఇట్లే - దేవలతల కప్రియములు గావించి (భార-ఆర-2ఆ). ఇందులో 'అప్రియములు' అనగా అప్రియమైన కార్యములు అని అర్థము. అప్రియము అనునది విశేషణమే- కార్యములు అని అర్థము. అప్రియము అనునది విశేషణమే యైనప్పటికిని విశేష్యమును సూచించుచున్నది.

ఇట్లు విశేషణ - విశేష్యములు వివరింపబడినవి.

# 4. సర్వనామములు

1. "అన్ని ప్రభృతులు సర్వనామములు" (బాల-ఆచ్ఛిక-24). అన్ని మొదలగునవి సర్వనామములనబడును. అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - పెక్కు - పలు - ఆ - ఈ - ఏ - నీ - నా - మన - తా - సంఖ్యా వాచకంబులు - ఇవి అన్ని ప్రభృతులు. ఉదా:

అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని
అన్నింటిని - ఇన్నింటిని - ఎన్నింటిని - కొన్నింటిని
నేను - ఏను - నేము - ఏము
అంత - ఇంత - ఎంత - కొంత (ప్రౌఢ-శబ్ద-51)
ఆయది - అయ్యది; ఈయది - ఇయ్యది; ఏయది -ఎయ్యది (ప్రౌఢ-శబ్ద-54)
ఎవ్వడు - ఎవడు - ఎవ్వరు - ఎవరు (ప్రౌఢ - శబ్ద-55)
అతడు - ఇతడు - ఆకె - ఆపె - ఆమె - ఈపె - ఈమె
అది - అవి ; ఇది - ఇవి; ఏది - ఏవి (ప్రౌఢ-శబ్ద-58)
అద్ది - అవ్వి ; ఇద్ది - ఇవ్వి , ఎద్ది - ఎవ్వి (ప్రౌఢ-శబ్ద-59)
వీనిపై విభక్తులు చేరినప్పుడు - దానిన్ - వానిన్; దానిచేతన్ - వాని చేతన్
ఒకరితె - ఒక్కరితె - ఒక్కరితి - ఒక్కొరితి - ఒకొరితి (ప్రౌఢ-శబ్ద-66)
ఎవ్వర్త - ఎవ్వర్తి - ఎవ్వర్తె (ప్రౌఢ- శబ్ద-68)
ఈవు - నీవు; ఈరు - మీరు; ఏను - నేను; ఏము - మేము (ప్రౌఢ-శబ్ద - 71)
నినున్ - ననున్ - తనున్; మిమున్ - మమున్ - తమున్ (ప్రౌఢ - శబ్ద - 73)
తాము - తారు (ప్రౌఢ - శబ్ద -74)
ఒక్కరు - ఒకరు; ఒక్కొడు - ఒకొడు (ప్రౌఢ-శబ్ద-80)
ఒక్కరుడు-ఒకరుడు-ఒరుడు-ఒడ్డు-ఒండు(ప్రౌఢ-శబ్ద-81)
ఒక్కటి - ఒకటి; ఒక్కొటి - ఒకొటి (ప్రౌఢ - శబ్ద - 82)
ఎక్కటి - ఒక్కటి (ప్రౌఢ - శబ్ద - 83)
ఒకానొకడు - ఒకానొకతె - ఒకానొకటి (ప్రౌఢ - శబ్ద-86)
అందఱు - ఇందఱు-ఎందఱు-కొందఱు (ప్రౌఢ-శబ్ద -89)
పలుగురు - పలువురు; ఇరుగురు - ఇరువురు; వేగురు - వేవురు (బాల-ఆచ్ఛిక - 23))
ఇత్యాదులూహ్యంబులు.

# 5. ఔపవిభక్తికములు

విభక్తిని కారణముగా చేసికొని ఆదేశముగా కాని, ఆగమముగా కాని తెలుగు శబ్దములపై చేరు ఇ,టి,తి - వంటి వర్ణములకు ఔపవిభక్తికములని పేరు.

1. "ఇటితి వర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు" (బాల-అచ్చిక-28). అనగా- ఇకముందు చెప్పబోవు ఇటితి అను వానిని ఔపవిభక్తికములని అందురు.

2. "ఇవి ద్వితీయాద్యేక వచనంబులు పరంబులగునపుడు నామంబులకును గొన్నింటికి బ్రాయికంబుగానగు" (బాల- అచ్చిక - 29). అనగా - ఈ ఇటితి అను ఔపవిభక్తికములు కొన్ని తెలుగు నామములకు, ద్వితీయాద్యేకవచన ప్రత్యయములు పరమైనప్పుడు తరచుగా నగునని అర్థము. ఉదా॥ కాలు - కాలిని - కాలిచే (ఇ); నాగలి- నాగటిని - నాగటిచే (టి); నేయి - నేతిని - నేతిచే (తి).

3. "ఊరు మొదలగు వాని కిత్వంబగు" (బాల-అచ్చిక -30). ఊరు మొదలైన శబ్దములకు ద్వితీయాద్యేకవచన ప్రత్యయములు పరములగునపుడు 'ఇ' అను ఔపవిభక్తిక ప్రత్యయము వచ్చునని అర్థము. ఉదా॥ ఊరు - ఊరిని; కాలు - కాలిని; నోరు - నోరిని; చోటు - చోటిని.

4. "టి వర్ణంబు గొన్నింటి యంత్యాక్షరంబున కాదేశంబును నంత్యాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగానగు" (బాల -అచ్చిక -31). ఉదా
ఎ) ఆదేశము - త్రాడు - త్రాటిని; కాడు - కాటిని; నోరు - నోటిని; ఏరు - ఏటిని.
బి) ఆగమము - అన్ని -అన్నిటిని; ఎనిమిది - ఎనిమిదిటిని; వేయి - వేయిటిని.
సి) ఉభయము - ఏమి - ఏమిటిని - ఏటిని; పగలు - పగలిటిని - పగటిని ; మూడు- మూడిటిని - మూటిని.

5. "హ్రస్వము మీది టి వర్ణంబు ముందు పూర్ణబిందువు బహుళంబుగానగు' (బాల -అచ్చిక - 32). అనగా - పై సూత్రము ప్రకారము ఆదేశముగా కాని, ఆగమముగ కాని వచ్చిన టి వర్ణమునకు పూర్వమందు హ్రస్వమున్నచో పూర్ణబిందువు బహుళముగ వచ్చునని అర్థము. ఉదా॥ అన్నింటిని - పగలింటిని - మూడింటిని.

6. "పదాద్యంబగు హ్రస్వంబుమీది టి వర్ణంబునకు ముందు పూర్ణబిందువగు' (బాల-అచ్చిక-33). అనగా- పదమునకు మొట్ట మొదటి అక్షరము హ్రస్వమైనచో దానిమీద వచ్చు టి వర్ణమునకు పూర్వమందు నిత్యముగా పూర్ణబిందువగునని అర్థము

ఉదా॥ కన్ను - కంటిని; మిన్ను - మింటిని; ఇల్లు - ఇంటిని; పన్ను - పంటిని.

7. "అల్లు మొదలగు శబ్దముల కంతాగమంబు తివర్ణంబును రేఫంబున కొక్కటికి లోపంబు నగు" (బాల-ఆచ్ఛిక-34). అనగా - ద్వితీయాద్యేకవచనములు పరములగునపుడు అల్లుమున్నగు శబ్దములకు తివర్ణము ఆగమముగా వచ్చును. అప్పుడు నామాంతమున గల ఒక రేఫము లోపించునని అర్థము. ఉదా॥ అల్లు - అటితిని; కొల్లు-కొటితిని; వల్లు-వటితిని.

8. "విభక్తి పరంబగునపుడు గోయి ప్రభృతుల తుది యక్షరంబు తివర్ణంబగు" (బాల-ఆచ్ఛిక-35). అనగా- విభక్తి పరమగునపుడు గోయి మున్నగు శబ్దముల యొక్క తుది అక్షరమునకు బదులుగా తివర్ణకమగునని అర్థము. ఉదా॥ గోయి - గోతులు - గోతిని - గోతులను; చేయి - చేతులు - చేతిని - చేతులను.

గోయి-చేయి-దాయి-నేయి-వాయి-దోయి -ఇత్యాదులు గోయి ప్రభృతుల

9. "టి, తి వర్ణంబులు పరంబులగునపు డుత్వంబున కిత్వంబగు" (బాల-ఆచ్ఛిక-36). అనగా- ఔపవిభక్తికిములయిన 'టి - తి' వర్ణములు పరములగునపు వెనుకటి ఉత్వమునకు ఇత్వమగునని అర్థము. ఉదా॥ రెండిటికి (రెండు+టికి) - మూడిటి - పగలిటికి - పెక్కిటికి.

కాని కొన్నిచోట్ల ఉత్వమునకు ఇత్వము కన్పించదు. ఉదా॥ నెత్తుటికి.

10. "టివర్ణంబు పరంబగునప్పుడు క్రిందు మీదు ముందు పు వర్ణంబుల కత్వంబగు"(బాల-ఆచ్ఛిక-37). అనగా- క్రిందు, మీదు, ముందు మొదలైన శబ్దములకు ద్వితీయాద్యేక వచనములు పరమగునపుడు టి వర్ణము ఆగమముగా నగునని అర్థము. ఉదా క్రిందు-క్రిందటిని; ముందు-ముందటిని; మాపు-మాపటిని; అప్పుడు-అప్పటిని.

11. "ఔపవిభక్తికముల తృతీయ సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు" (బాల-ఆచ్ఛిక-38). అనగా- ఔపవిభక్తిక రూపములకు చివర తృతీయా విభక్తిప్రత్యయముకాని, సప్తమీ విభక్తి ప్రత్యయముకాని ఉన్నచో ఆ ప్రత్యయ స్థానమున అత్వము బహుళముగా అగునని అర్థము. ఉదా॥ గోరను గీరెను; ఊరనున్నాడు; ఇంటలేదు. సూత్రమున బహుళమనుటచే - గోరిచే గీరెను; ఊరియందున్నాడు -వంటి రూపములను ఉండును.

ఇట్లు ఔపవిభక్తిక ప్రత్యయములు ఆచ్ఛిక శబ్దములపై చేరు విధానము నిరూపింపబడినది.

# VI. కారక పరిచ్ఛేదము

## 1. విభక్తులు - ప్రత్యయములు

కారకమనగా - క్రియాన్వయమును కలిగించునది. లేదా క్రియాన్వయము కలది. అనగా- వాక్యములోని శబ్దములకు క్రియతో అన్వయము కలిగించునది అనికాని, క్రియతో అన్వయము కలది అనికాని అర్థము.

ఈ పరిచ్ఛేదమున వాక్యములోని వేరువేరు పదములు క్రియతో అన్వయమును పొందునపుడు ఏయే విభక్తులను పొందునో వివరింపబడినవి.

1. **కారకములు:** "కారకంబులనం గర్మాదులు" (ప్రౌఢ-కారక-1). అనగా- కర్త, కర్మము, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము- అను ఆరును కారకములు.

**2. ప్రథమా విభక్తి:**

'ప్రాతిపదిక సంబోధ నోక్తార్థంబులం బ్రథమ యగు" (బాల-కారక-1). అనగా- ప్రాతిపదికార్థమునందును, సంబోధనార్థమునందును ఉక్తార్థమునందును ప్రథమావిభక్తి అగునని అర్థము.

అ) ప్రాతిపదికార్థమనగా- నియతమైన ఉనికి కలిగినది. అనగా ఇతర పదములతో ఏవిధమైన సంబంధమును లేక ప్రాతిపదిక యొక్క అర్థమును మాత్రమే బోధించునది. ఉదా: రాముడు, రావణుడు.

ఆ) సంబోధనమనగా- ఇతరులను అభిముఖము చేసికొనుటకు పిలుచుట. ఇచటకూడ సంబోధ్యవాచకము ప్రథమావిభక్తిని పొందును. ఉదా: ఓ రాముడ! ఓ రావణుడ!

ఇ) ఉక్తమనగా- చెప్పబడినది. అనగా- క్రియచేత చెప్పబడినది అని భావము. కనుక

వాక్యమునందలి క్రియా పదముచే ఏది చెప్పబడినదో దానికి ప్రథమా విభక్తి అగును. ఉదా: రాముడు రావణుని సంహరించెను– ఈ వాక్యమున 'సంహరించెను' అను క్రియను 'ఎవరు' అని ప్రశ్నింపగా 'రాముడు' అని సమాధానము వచ్చును. ఈ వాక్యమున క్రియాపదము రాముడు అను కర్తను చెప్పుచున్నది. అందువలన అది ప్రథమాంతమై యుండును.

అట్లే– రామునిచే రావణుడు సంహరింపబడియె– అను వాక్యమున 'సంహరింపబడియె' అను క్రియను 'ఎవరు' అని ప్రశ్నించినపుడు 'రావణుడు' అను కర్మమును చెప్పుచున్నది కనుక 'రావణుడు' అను శబ్దమునకు ప్రథమావిభక్తి కలిగినది.

ఉక్తార్థమనగా కర్తయనికాని, కర్మయనికాని అనుకొనరాదు. క్రియాపదమును ఎవరు అని ఆకాంక్షించినపుడు వచ్చు సమాధానము కర్తయైనను కర్మయైనను ప్రథమావిభక్తిని పొందునని తాత్పర్యము.

## 3. ద్వితీయావిభక్తి:

"కర్మంబున ద్వితీయ యగు" (బాల–కారక–2). అనగా– కర్మార్థమున ద్వితీయావిభక్తి అగునని అర్థము.

ఎ) ను:– "ధాత్వర్థ ఫలాశ్రయంబు కర్మంబు నాబడు" (వృత్తి). అనగా– ధాతువుయొక్క అర్థమైన ఫలమునకు ఆశ్రయమైనది కర్మముఅనబడును. ఉదా: దేవదత్తుడు వంటకమును వండెను. ఇచట వంట ఫలము. దానికి ఆశ్రయమైన దగుటచే వంటకము కర్మమైనది. కనుక దానికి ద్వితీయావిభక్తి వచ్చును. "నువర్ణంబు ద్వితీయ" (బాల–తత్సమ–2) అను సూత్రమునుబట్టి కర్మార్థక శబ్దమునకు ద్వితీయావిభక్తి ప్రత్యయమగు 'ను' చేరి 'వంటకమును' అని యైనది.

బి) గుఱించి:– "ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱిచియు ననుప్రయుక్తంబగు" (ప్రౌఢ–కారక–2). అనగా– కర్మకు ఉద్దేశమే అర్థమైనపుడు గుఱిచి అను శబ్దము అనుప్రయుక్తము (అనుసరించి ప్రయోగింపబడినది) అగును. ఉదా: మముగుఱిచి నామగోత్రమున మీరర్చసేయ (హరి–పూ.భా.–2ఆ) – ఇచ్చట అర్చన 'మము' నుద్దేశించియే జరిగినది కనుక (ఉద్దేశార్థమున) 'మమున్'అను ద్వితీయావిభక్త్యంతమునకు

గుఱిచి అనునదియు అనుప్రయుక్తమైనది.

2. ఒక్కొక్కసారి ఆ'గుఱిచి' అనునది కర్మకు అనుప్రయుక్తముగనే కాక, వ్యవహితముగను ప్రయోగింపబడును (ప్రౌఢ-కారక-3). ఉదా॥ అబ్జాసనుడు తన్ను నర్థితో గుఱిచి (హరి-పూ.భా.-2అ)- ఇచ్చట 'తన్ను' అను ద్వితీయాంతమునకును, 'గుఱిచి'కి ని మధ్య 'అర్థితో' అన్న పదము చేరి వ్యవధానము కలిగించుచున్నది.

## 4. తృతీయావిభక్తిః

ఎ) చేత॥- 1. "చేతవర్ణకంబు కర్త కగు" (బాల-కారక-3)

"ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్త నాబడు". అనగా- ధాతువు యొక్క అర్థమైన వ్యాపారమునకు ఆశ్రయమైన శబ్దము కర్తయగును. దానికి 'చేత' అను తృతీయావిభక్తిప్రత్యయము వచ్చును. ఉదా॥ దేవదత్తునిచేత వంటకము వండబడియె. ఇచట 'వండ బడియె' అను వ్యాపారమునకు ఆశ్రయమైనవాడు దేవదత్తుడు. కావున దేవదత్తుడు అను శబ్దమునకు 'చేత' అను తృతీయావిభక్తి ప్రత్యయము వచ్చినది. "డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాషనగు" (బాల-తత్సమ-23) అను సూత్రముచే దేవదత్తునిచేత అనురూపము ఏర్పడును.

2. "చేతవర్ణకంబు హేతు కరణంబులకు గ్రహ్యాదియోగజంబగు పంచమికిని బహుళముగా నగు" (బాల-కారక-4). అనగా- చేత అను తృతీయావిభక్తి ప్రత్యయము హేతువునందును, కరణార్థమునందును, గ్రహ్యాయోగమునందగు పంచమీవిభక్తికిని, బహుళముగా అగునని అర్థము.

అ) ఫలసాధనయోగ్యమైన పదార్థము హేతువు- ఉదా॥ ధనముచేత సౌఖ్యంబు గలుగు; విద్యచేత యశమ్ము గలుగు- ఇచ్చట సౌఖ్యమునకు ధనమును, యశస్సుకు విద్యయు హేతువులు. కనుక తృతీయావిభక్తి వచ్చినది. "పక్షంబున వలనవర్ణకం బగు"- ఉదా॥ ధనమువలన సౌఖ్యము కలుగు; విద్యవలన యశమ్ము కలుగు.

ఆ) క్రియాసిద్ధికి ప్రకృష్టోపకారకమైనది కరణము- ఉదా॥ ఖడ్గంబుచేత

ఖండించె; కోలచేత గూలనేసె. ఇచట ఖండించుటకు ఖడ్గమును, కూలనేయుటకు కోలయు ఉపకరణములు. కనుక వానికి తృతీయావిభక్తి ప్రత్యయము చేరినది. "పక్షమున వలనవర్ణకం బగు" – ఖడ్గమువలన ఖండించె; కోలవలన గూలనేసె.

(ఇ) గ్రహ్యాదియోగమనగా– గ్రహించుట మొదలైన అర్థములకలయికయందు వచ్చు పంచమికి(వలన) బదులుగా చేతవర్ణకము వచ్చును. ఉదా॥ జరాసంధుండు రాజులచేత గప్పంబుగొనియె; మైత్రుండు చైత్రునిచేత ఋణంబుగొనియె.

స్వీకరించు, గ్రహించు, ఎఱుగు, కొను, విను మొదలైనవి గ్రహ్యాదులు. పై ఉదాహరణమున– కప్పముగొనుటకు రాజులును, ఋణముగొనుటకు చైత్రుడును ఆశ్రయులు. కావున వానికి తృతీయావిభక్తి ప్రత్యయమైన చేతవర్ణకమువచ్చినది.

"పక్షమున వలనవర్ణకం బగు"– జరాసంధుండు రాజులవలన గప్పంబు గొనియె; మైత్రుండు చైత్రునివలన ఋణంబుగొనియె.

3. "కొన్నియెడలఁ జేత విభక్త్యర్థకవర్ణకంబులకును వలనవర్ణకంబునకును దఱచుగఁ జేసి యనుప్రయుక్తంబగు" (ప్రౌఢ–కారక–4). అనగా– 'చేత'వర్ణకమును బోధించు తృతీయావిభక్త్యర్థకప్రత్యయములకును, పంచమీవిభక్తిప్రత్యయమైన 'వలన'వర్ణకమునకును తఱచుగా 'చేసి' అను ప్రత్యయము అనుప్రయుక్తమగును. ఉదా॥ ఏకవిప్రసంబోధనఁ జేసి(భార–ఆది–1ఆ)– ఇచ్చట 'సంబోధనన్' అనగా 'సంబోధనచేత' అని అర్థము. దానికి 'చేసి' అమనది అనుప్రయుక్తమై 'సంబోధనఁజేసి' అయినది.

ఇట్లే– ధర్మతనూభవువలనఁ జేసి (భార–విరాట–2ఆ)– ఇచ్చట 'వలన'కు 'చేసి' వర్ణకము అనుప్రయుక్తమైనది. తరచుగా ననుటచే ద్వితీయావిభక్తిప్రత్యయమునకును అనుప్రయుక్తమగునని తెలియవలయును. ఉదా॥ తండ్రిపనుపుఁజేసి (భారత–ఆది3ఆ).

4. "అయ్యెడి యొక్కచోఁ బెక్కుచోట్ల కొక్కటియ చాలెడి" (ప్రౌఢ–కారక–5). అనగా– 'చేసి' అనునది పెక్కుచోట్ల అనుప్రయుక్తము కావలసియున్నను, అది ఒక్కచోటనే వాడినను సరిపడునని అర్థము. ఉదా॥ ". . . . మదవిలాసాలస మందగతులఁ, వక్రాలకంబుల వలుఁదపిఱుందుల దర్పగద్గద భాషితములఁ జేసి" (భార–ఆది–8ఆ). పై ఉదాహరణలో– మందగతులఁజేసి, వక్రాలకంబులఁజేసి, గద్గదభాషితములఁజేసి – అని ఉండవలసినది. కానీ చివరిపదమునకు మాత్రమే

అనుప్రయుక్తమగుటవలన ప్రౌఢవ్యాకరణకర్త సూత్రము ఆవశ్యకమైనది.

బి) తోడః- 1. "కరణసహార్థ తుల్యార్థ యోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు" (బాల-కారక-5). అనగా- కరణార్థమునందును, సహార్థమునందును (కూడియుండుట) తుల్యార్థమునందును (సామ్యముచెప్పుట), తృతీయావిభక్తిలో 'తోడ' వర్ణకము వచ్చును. ఉదా: కరణము- కోలతోడఁగూలనేసె; సహార్థము- రాజా సేనలతోడ వచ్చె; తుల్యార్థము- చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు.

దీని వృత్తిలో సూరి- "తృతీయకనుటంజేసి చైత్రునకు మైత్రుండు తుల్యుండని తుల్యార్థయోగంబున షష్ఠియు నగు" అని చెప్పినాడు. అందువలన- 'చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు' అనునట్లే, 'చైత్రునకు మైత్రుండు తుల్యుండు' అనియు అగును.

2. "జడపదంబులమీది తోడకు మెయి మై లు వికల్పంబుగ నగు" (ప్రౌఢ-శబ్ద-18). అనగా- జడవాచకముల మీద వచ్చు తృతీయావిభక్తికి బదులుగా 'మెయి' కాని, 'మై' కాని వికల్పముగా వచ్చును. ఉదా: అర్థిమెయిం జనుదెంచి (నిర్వ-2ఆ); మోహము బాయఁగఁద్రోచి భక్తిమైన్ (లక్ష్మీ-4ఆ). ఈవిధి వికల్పము కనుక- అర్థితోడఁజనుదెంచి; భక్తితోన్- అన్నవిధముగా కూడ ఉండవచ్చును.

3. "వచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ దోడ కు వర్ణంబులు ప్రాయికంబుగా నగు" (బాల-కారక-6). అనగా- 'వచ్' (పలుకు, చెప్పు) అను నర్థముగల క్రియలతో అన్వయించునట్టి అప్రధానమైన కర్మమునకు 'తోడ' అనికాని, 'కు' అనికాని అగునని అర్థము. ఉదా: మైత్రుండు చైత్రునితోడ నిట్లనియె- మైత్రుండు చైత్రునకిట్లనియె.

ప్రాయికముగా ననుటచే- ఒక్కొక్కసారి ద్వితీయయు వచ్చును. ఉదా: మైత్రుండు చైత్రు నిట్లనియె.

4. "ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకం బగు" (బాల-కారక-7). ఉపయోగమనగా- నియమపూర్వక విద్యాస్వీకారము. ఆఖ్యాతయనగా- విద్యను బోధించువాడు. కనుక- నియమపూర్వక విద్యాస్వీకారమును గూర్చి చెప్పునప్పుడు బోధకునకు 'తోడ' వర్ణకము వచ్చునని అర్థము. ఉదా: రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులం జదివిరి. ఇచ్చట- సాందీపని వలన చదివిరి అని అర్థము.

5. "ఒకానొకచో తోడకుఁ బ్రత్యేక ప్రయోగంబునుం జూపట్టెడి" (ప్రౌఢ-

కారక-6). అనగా- తోడ ప్రత్యయమునకు ఒక్కొక్కసారి నామముతో కలియకయే స్వతంత్రముగా ప్రయోగమును కలదని అర్థము. సామాన్యముగా ప్రత్యయము లెప్పుడును ప్రకృతులపై ననే విధింపబడుచుండును. వానికి ప్రత్యేక ప్రయోగార్హత ఉండదు. కాని ప్రౌఢ వ్యాకర్త ప్రస్తుత సూత్రమున 'తోడ'కు ప్రత్యేక ప్రయోగార్హతను ప్రదర్శించుచు- "స్తంభగతరత్నపుత్రిక తనదు బోటియని విలోకించి తోడ మాటాడకునికి" (రామా-4ఆ) అను ప్రయోగము నిచ్చినాడు. ఇచ్చట 'తోడ' అనునది నామవిరహితమై వ్యస్తముగా ప్రయోగింపబడినది.

6. ఈ 'తోడ' వర్ణకమునకు 'తోడుత' అనియు రూపాంతరము కలదు. (ప్రౌఢ-కారక-8). ఉదా॥ పగతురచేతిలోఁ బడక ప్రాణముతోడుత నున్న వాడవే (భాగ-10స్కం). కానీ దీనికి 'తోడ' ప్రత్యయమునకువలె ఇతరకార్యములు కలుగవు.

## 5. చతుర్థీ విభక్తిః

1. ఎ) కొఱకు ‌: "సంప్రదానంబునకుం జతుర్థియగు" (బాల-కారక-8). అనగా- సంప్రదానమను అర్థమున చతుర్థీ విభక్తి యగును. సంప్రదానమనగా త్యాగోద్దేశ్యము. ఉదా॥ జనకుండు రామునికొఱకుఁ గన్యనిచ్చెను.

2. ఒక్కొక్కసారి ఇది ఉద్దేశ్యమాత్రముననను వచ్చును.అనగా- అచ్చట త్యాగోద్దేశ్యము లేక పోయినను చతుర్థీ ప్రత్యయములు వచ్చును. ఉదా॥ పురుషార్థంబుకొఱకు యత్నింపవలయు.

కాని, ఇట్టి ప్రయోగములలో సామాన్యముగాచతుర్థికి బదులు షష్ఠియే కన్పించుచున్నది(వృత్తి). ఉదా॥ జనకుండు రామునకుంగన్య నిచ్చెను; పురుషార్థంబునకు యత్నింపవలయు.

బి) పొంటె :"చతుర్థికిం బొంటెవర్ణకం బగు" (ప్రౌఢ-కారక-9). అనగా- చతుర్థీ విభక్తియగు 'కొఱకు' ప్రత్యయమునకు బదులు 'పొంటె' అనునదియు వచ్చును. ఉదా॥ కార్యసంప్రయోగముపొంటెను (భార-సభా-1ఆ). పక్షమున- కార్యసంప్రయోగము కొఱకు- అని యగును.

## 6. పంచమీ విభక్తిః

ఎ) వలన: "అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరామాంతర్ధి వారణంబు లెద్దాననగు దానికి వలన వర్ణకం బగు" (బాల-కారక-9). అనగా- అపాయము (వేఱుపడుట), భయము (వెఱపు), జుగుప్స (ఏవగింపు), పరాజయము (అలసిపోవుట), ప్రమాదము (పరాకు), గ్రహణము (తీసికొనుట), భవనము (పుట్టుట), త్రాణము (రక్షించుట), విరామము (విరమించుట), అంతర్ధి (అంతర్ధానమగుట), వారణము (వారించుట)- అనునవి దేనివలన కలుగునో దానికి 'వలన' వర్ణకము వచ్చును. ఉదా:

అపాయమునకు- మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుండయ్యె.
భయమునకు- చోరునివలన భయపడియె
జుగుప్సకు- పాపంబువలన నేవగించె
పరాజయమునకు- అధ్యయనము వలన డస్సె
ప్రమాదమునకు- పాడివలనం బరాకుపడియె
గ్రహణమునకు - మైత్రునివలన ధనంబుగొనియె
భవనమునకు- మనువువలనం బ్రజలు పుట్టిరి
త్రాణమునకు-చోరునివలనం గాచె
విరామమునకు-భోగంబువలన విరమించె
అంతర్ధికి-కృష్ణుడు తల్లివలనడాగె
వారణంబునకు-శోకంబువలన వారించె.

కొన్నియెడల ఈ పంచమికి బదులు షష్ఠియు నగును. ఉదా: చోరునకు వెఱచె; పాపంబున కేవగించె; అధ్యయంబునకు డస్సె; పాడికిం బరాకుపడియె; మనువునకు నిక్ష్వాకుండుపుట్టె.

2. "ఉండిపదం బొకచో వలన వర్ణకంబున కనుప్రయుక్తంబగు" (బాల-కారక-10). అనగా- ఒక్కొక్కచోట 'వలన' ప్రత్యయమునకు 'ఉండి' శబ్దము అనుప్రయుక్తమగును. ఉదా: హిమగిరి వలననుండి గంగవొడమె; నాకంబువలన నుండి నారదుండు వచ్చె.

3. "ఉండిశబ్దంబు పరంబగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయకంబుగ

నగు" (బాల-కారక-11). అనగా- ఈ 'ఉండి' శబ్దము అనుప్రయుక్తమగునపుడు 'వలన'కు బదులుగా ద్వితీయావిభక్తి ప్రత్యయమగు 'ను' వర్ణముగాని, పంచమీ విభక్తి ప్రత్యయములగు 'అందు,న'లు గాని తరచుగా వచ్చును. ఉదా॥ వనమునుండి వచ్చె- వనమందుండి వచ్చె; ఊరినుండి వచ్చె- ఊరనుండి వచ్చె.

కొందఱు 'వనమునుంచి, ధనమునుంచి' అని 'ఉంచి' శబ్దమును ప్రయోగించి వ్యవహరింతురనియు, కాని అది సాధుకవి ప్రయోగారూఢము కాదనియు ఈ సూత్రవృత్తిలో చెప్పినాడు సూరి.

4. "ఉండిపదంబు పరంబగుచో వలన కందువర్ణకమట్లు నువర్ణకంబు నగు" (ప్రౌఢ-కారక-10). పై సూత్రము(బాల-కారక-1) క్రింద ఇచ్చిన ఉదాహరణలలో సూరి 'వలన' వర్ణకమునకు బదులు సప్తమీ విభక్తి ప్రత్యయములు వచ్చునని తెల్పి, వానిలో ఒక్క 'అందు' ప్రత్యయమునకే ఉదాహరణ మిచ్చినాడు. 'న'వర్ణమున కీయకపోవుటచే ప్రౌఢవ్యాకరణకర్త ప్రస్తుత సూత్రమున దానినికూడ చూపుచున్నాడు- సనత్కుమారుడు మహి కింజనుదెంచె బ్రహ్మలోకంబున నుండి (భార-ఆది-3ఆ).

'బహుళగ్రహణము' చే 'అందు' వర్ణకముమీది యుండికి లోపము కలుగదు. ఉదా॥ వనమందుండి.

బి) **కంటె॥** 1. "కంటెవర్ణకం బన్యార్థయోగజంబగు పంచమి కగు" (బాల-కారక-12).అన్యము- ఇతరము- పూర్వము- పరము- ఉత్తరము- ఇత్యాదులు అన్యాదులు. అట్టి అర్థములతో కూడియుండునప్పుడు వచ్చు పంచమీవిభక్తికి 'కంటె' అను ప్రత్యయము వచ్చును. ఉదా॥ రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేడు; లోభంబుకంటె నితరంబు దోషంబులేదు.

ఇచట పంచమికి బదులు షష్ఠియు నగును- ఉదా॥ రామున కన్యుండు ధానుష్కుండు లేడు.

2."కంటె వర్ణకంబు నిర్ధారణపంచమి కగు" (బాల-కారక-13). ఎచ్చట నిర్ధారించవలసినది జాత్యాది భేదములను కలిగియుండునో అచ్చట పంచమియగును. అనగా భిన్నజాతులలో ఒక జాతినిగాని, భిన్నగుణములలో ఒక గుణమునుకాని వేరుచేసి

నిర్ధారించవలసివచ్చినప్పుడు 'కంటె' అను ప్రత్యయము కలుగును. ఉదా: జానపదులకంటె నాగరకులు వివేకులు; మానహానికంటె మరణము మేలు.

సి) **పట్టి:** 1. "పట్టివర్ణకంబు హేతువులగు గుణ క్రియల కగు" (బాల-కారక-14). అనగా- హేత్వర్థమును బోధించు గుణవాచకములకు గాని, క్రియావాచకములకుగాని 'పట్టి' వర్ణకము వచ్చును. ఉదా: గుణవాచకమునకు- జ్ఞానముబట్టి ముక్తుడగు; క్రియావాచకమునకు- నీవు వచ్చుటంబట్టి ధన్యుడ నయితి.

ఇచ్చట వలన వర్ణకమును అగును- ఉదా: జ్ఞానము వలన ముక్తుండగు.

2. "కొన్నియెడల హేతువునం దన్నంత క్రియలమీదను బట్టివర్ణకంబు విభాషనగు" (ప్రౌఢ-కారక-12). అనగా- కొన్నిచోట్ల హేత్వర్థమునందున్న అన్నంతక్రియా పదములమీదను పట్టి వర్ణకము విభాషగా నగును. ఉదా: ఈవు గలుగంగబట్టిగా కిందువదన (కాశీ-3ఆ).

ఈవిధి విభాష కనుక- కలుగుటం బట్టి- అనియు అగును. సూత్రమున 'విభాష'యను పదమున్నది కనుక సూత్రములో 'కొన్నియెడల' అనునది నిరుపయోగము (బాల-ప్రౌఢ-వ్యాఖ్య - II-పు.45)

## 6. షష్ఠీవిభక్తి:

ఎ) **యొక్క:** 1. "శేషషష్ఠికి యొక్కయు నగు" (బాల-కారక-15). ఇచ్చట శేషమనగా సంబంధము (వృత్తి). అనగా సంబంధార్థమును తెలుపునప్పుడు షష్ఠీవిభక్తి ప్రత్యయమైన 'యొక్క' అను ప్రత్యయము వచ్చును. ఉదా: రాముని యొక్కగుణములు; నాయొక్క మిత్రుడు.

2. "యొక్కకు లోపంబు బహుళంబు" (ప్రౌఢ-కారక-16). అనగా- షష్ఠీవిభక్తి ప్రత్యయమైన 'యొక్క' కు లోపము బహుళముగా నగును. ఉదా: మనుజవిభుని (నైష-3ఆ); సమ్మెటకోలల .... కోలల్రేటుల (ద్రోణ-3ఆ).

బహుళ గ్రహణము చేత 'యొక్క'కు లోపము కొన్నింటిలో నిత్యము. ఉదా: బాహుకురథంబుగడుపునేర్పున కచ్చెరువడి (భార-అర-2ఆ); వానివన్నిన వృషభగోమయభక్షణంబు చేసి (భార-ఆది-2ఆ). ఈ ఉదాహరణలలో- 'బాహుకునియొక్కరథంబు గడుపునేర్పు'; 'వానియొక్క వన్నిన వృషభ గోమయము' అని యుండదు.

వాస్తవమునకు గ్రంథములలో ఎక్కడను 'యొక్క' అని కన్పించదు. వ్యాకరణకర్తలు కూడ దానిని ప్రత్యయముగా చెప్పినను ప్రయోగములు చూపలేదు. విగ్రహవాక్యములలో 'యొక్క' వచ్చుచున్నను, సమాసములలో అది లోపించుట గమనార్హము (బాల-ప్రౌఢ-వ్యాఖ్య - II-పు.-57,58)

బి) **కు**: సంబంధార్థమున కొన్నియెడల కు వర్ణకమును వచ్చును (వృత్తి). ఉదా: నాకుందమ్ముడు; మీకు నెచ్చెలి.

"షష్ఠీస్థానికంబగు కువర్ణకం బొక్కొకచో ద్వితీయాది విభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి (ప్రౌఢ-కారక-17). అనగా- షష్ఠీవిభక్తిప్రత్యయమైన ఈ 'కు' ప్రత్యయము ద్వితీయాది విభక్తులకు మాఱుగా వచ్చి, ఆయా విభక్తు యర్థములనే బోధించునని అర్థము. ఉదా:

ద్వితీయకు- వేటకు బోయిరి- వేటఁబోయిరి (భార-ఆర-6ఆ), పాలమున కేగెను- పాల మేగెను (వి.పు-7ఆ)
తృతీయకు- ఆకావ్యుతనూజ నీకు నారాధ్యమ (భార-ఆది-3ఆ).పక్షంబున-నీచే నారాధ్యమ.
చతుర్థికి- వారు వేటకు పోయిరి- వారు వేటకొఱకై పోయిరి (ఉద్దేశ్యార్థమున చతుర్థి).
పంచమికి- విలువిద్య నీకు నొరు లగ్గలముగ లేకుండ (భార-ఆది-5ఆ)- నీకంటె నగ్గలముగ.
సప్తమికి- కోమలి నీ కనురక్త (భార-ఆర-2ఆ)- నీయందనురక్త.

సి) **లోపల**: "నిర్ధారణ షష్ఠికి లోపల వర్ణకం బగు" (బాల-కారక-16). జాతి గుణ క్రియా సంజ్ఞలను బట్టి, ఒక సముదాయము నుండి ఒకదానిని వేరు చేయుట నిర్ధారణ మనబడును. అట్టి నిర్ధారణ దేనివలన కలుగునో దానికి 'లోపల'వర్ణకము వచ్చును. ఉదా: జాతినిబట్టి- మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు. గుణమునుబట్టి- గోవులలోపల కపిల బహుక్షీర. క్రియనుబట్టి- అధ్వగులలోపలం బాఱువాడు శీఘ్రగామి.

## 7. సప్తమీవిభక్తి:

ఎ) **అందు**: "అధికరణంబునకు సప్తమియగు" (బాల-కారక-17). అధికరణమనగా ఆధారము. అది- ఔపశ్లేషికము (ఆధారము), వైషయికము (విషయసంబంధి), అభివ్యాపకము (అంతటను వ్యాపించియుండునది)- అని 3విధములు. వానిని బోధించు శబ్దములకు సప్తమీవిభక్తి ప్రత్యయమైన 'అందు' వచ్చును. ఉదా:

1. ఔపశ్లేషికము- ఘటమందు జలమున్నది (ఇచ్చట-జలమునకు ఆధారము ఘటము)

2. వైషయికము- మోక్షమందిచ్ఛగలదు (ఇచ్చట- ఇచ్ఛకు ఆధారము మోక్షము)
3. అభివ్యాపకము- అన్నింటియందీశ్వరుండు గలడు (ఇచ్చట- ఈశ్వరునకు ఆధారము అన్నివస్తువులు)

బి) సూ "ఉకారాంత జడంబునకు నవర్ణకం బగు" (బాల-కారక-18). అనగా- జడవాచకములైన ఉకారాంత శబ్దములకు 'న' వర్ణకము వచ్చునని అర్థము. ఉదా: ఘటంబున జలంబున్నది; దేవదత్తునకు మోక్షమున నిచ్ఛగలదు.

ఇట్లు బాల-ప్రౌఢవ్యాకరణకర్తలు విభక్తిప్రత్యయములు కలుగువిధానమును నిర్దేశించినారు.

## 2. ఒకవిభక్తికి మరొక విభక్తి

కారకపరిచ్ఛేద ప్రారంభమున చిన్నయసూరి కారకములను, ఆయా సందర్భములలో వానికి వచ్చు విభక్తిప్రత్యయములను సోదాహరణముగా వివరించినాడు. ఆ సందర్భముననే ఒక విభక్తికి బదులు మరియొకవిభక్తి వచ్చు విధానమును కూడ నిర్దేశించియున్నాడు. 'చేత' 'తోడ' వర్ణకములకు బదులు 'వలన' వచ్చుట, కొఱకు' 'కంటె' 'యొక్క' వర్ణకములకు బదులు 'కు' వర్ణకము వచ్చుట, 'లోపల' వర్ణకమునకు బదులు 'అందు' వచ్చుట వంటివి అచట నిరూపింపబడినవి. వానితోపాటు బాలప్రౌఢవ్యాకరణకర్తలు మరికొన్ని రూపములలో ఒక విభక్తికి బదులు మరొక విభక్తి ఎట్లు వచ్చుచున్నదో ఇట్లు వివరించినారు.

1. "ఒకానొకచో నొక విభక్తికి మరియొక విభక్తియు నగు" (బాల-కారక-21). అనగా- కొన్నిచోట్ల ఒక విభక్తి కలుగవలసియుండగా దానితో పాటు మరియొక విభక్తియు కలుగుచున్నదని అర్థము. ఉదా: మైత్రుండు గృహమును వెడలెను; వాడు వాహనమును దిగెను. ఇక్కడ 'గృహమునుండి', 'వాహనమునుండి' అను వానిలోని 'ఉండి' ప్రత్యయమునకు బదులు 'ను' వర్ణకము వచ్చినది. అట్లే- 'వారు సుఖమున్నారు'- అన్నప్పుడు 'సుఖముతో' నని అర్థము. ఇచట తృతీయకు బదులు ప్రథమ వచ్చినది.

2. "జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు" (బాల-కారక-22). అనగా- జడవాచకముల మీది తృతీయావిభక్తిని, సప్తమీ విభక్తికిని బదులుగా ద్వితీయావిభక్తి బహుళముగా అగునని అర్థము. ఉదా:

తృతీయకు- రాముడు వాలి నొక్క కోలం గూలవేసె- కోలతో నని యర్థము.

సప్తమికి- లంకం గలికలంబు పుట్టె- లంకయందని అర్థము.

ఇది బాహుళక మనుటవలన, ఈ కార్యము ఉదంతమునకు బహుత్వమునందే అగునని సూరి వృత్తియందు చెప్పినాడు. ఉదా: తృతీయకు- అర్జునుడు శత్రుసేనలను బాణంబులను రూపుమాపె- బాణంబులచే అని యర్థము.

సప్తమికి- మీనంబు జలంబుల నుండు- జలంబులందని యర్థము.

చిన్నయసూరి జడవాచకములమీది తృతీయాసప్తములకు బహుత్వము వచ్చునని చెప్పగా ప్రౌఢవ్యాకరణకర్త దానిని కొంచెము సవరించి "కొన్నియెడల నజడంబు తృతీయాసప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి" (ప్రౌఢ-కారక-18) అని సూత్రించినాడు. అనగా- జడవాచకములైన తృతీయాసప్తములకును బహుత్వమున ద్వితీయ కొన్నిచోట్ల కలుగుచున్నదని అర్థము. ఉదా: తృతీయకు- ఘనతరస్తనచక్రవాకముల నలరు నంబ (హరి-ఉ.భా-7ఆ)- స్తన చక్రవాకములతోనని అర్థము. సప్తమికి- బలిమిగొనిన ధనము పదివేల యొంటెల బెరిగి రాగ (భార-సభా-1ఆ)- ఒంటెలయందు అని అర్థము.

3. "ఉదంతజడంబు తృతీయకు నవర్ణకం బగు" (బాల-కారక-27). అనగా- ఉదంతమైన జడవాచకము యొక్క తృతీయావిభక్తికి బదులు సప్తమీ విభక్తి ప్రత్యయమైన నవర్ణకము వచ్చునని అర్థము. ఉదా: రాముడొక్క బాణంబున వాలిం గూలనేసె- బాణముచే అని యర్థము.

ఈ సూత్రమును ప్రౌఢ వ్యాకరణకర్త సవరించుచు- "ఒక్కచో నుదంతంబగు నజడంబు తృతీయకును నవర్ణకంబు గానంబడియెడి" (ప్రౌఢ-కారక-17)- అని సూత్రించినాడు. అనగా- ఉదంతజడముయొక్క తృతీయా విభక్తికే కాక ఉదంతమైన, అజడమునకును తృతీయావిభక్తిస్థానమున నవర్ణకము వచ్చునని అర్థము. ఉదా: ఏనుగున నేనుగు వైచుచు (రామా-యుద్ధకాండ)- ఏనుగుచేత ఏనుగును అని అర్థము. "దీనికి ప్రయోగాంతరంబు మృగ్యంబు" అని ప్రౌఢవ్యాకరణకర్తయే చెప్పుట గమనార్హము.

4. "జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు" (బాల-కారక-24).

అనగా- జడవాచకము యొక్క ద్వితీయావిభక్తికి బదులుగా ప్రథమా విభక్తి బహుళముగా అగునని అర్థము. ఉదా:

వాడు పూవులు దెచ్చె- వాడు పూవులను దెచ్చె

ఆకె సొమ్ములు దాల్చె- ఆకె సొమ్ములను దాల్చె

వాడిల్లు వెడలె- వాడు ఇంటిని వెడలె

బహుళకముచే తృతీయాసప్తములకు విధించిన ద్వితీయకు మాత్రము ప్రస్తుత సూత్రముచే రావలసిన ప్రథమ రాదు. అనగా- బాల-కారక-22 సూత్రముచే తృతీయా సప్తములకు బదులు వచ్చిన ద్వితీయకు ఈవిధి వర్తింపదనియు, సహజమైన ద్వితీయావిభక్తికి మాత్రమే వర్తించుననియు అర్థము.

ప్రౌఢవ్యాకరణకర్త ఈ సూత్రమును సవరించుచు- "కొన్నియెడల నజడంబు ద్వితీయకును ప్రథమ గానంబడియెడి" (ప్రౌఢ-కారక-19) అని చెప్పియున్నాడు. అనగా- బాలవ్యాకరణకర్త చెప్పినట్లు జడవాచకద్వితీయకు మాత్రమేకాక అజడవాచకమైన ద్వితీయకును ప్రథమ అగునని ప్రౌఢవ్యాకరణకర్త నిరూపించుచున్నాడు. ఉదా: అమ్మదనాగ మెదిర్చి క్రమ్మరించిన పరికాడు వోలె (భార-ఆది-4ఆ). ఇచ్చట 'అమ్మదనాగము నెదిర్చి' అనుటకు బదులు 'అమ్మదనాగ మెదిర్చి' అని ద్వితీయకు బదులు ప్రథమయే కలిగినది. ఇట్లే- తన వారణేంద్ర మక్కురుకులవీరు మీద నెసకొల్పిన (భార-ఆర-6ఆ)- ఇచ్చటను 'వారణేంద్రమును అక్కురుకులవీరుమీద' అనుటకు బదులు 'వారణేంద్రము' అని ప్రథమయే వచ్చినది.

5. ఒక్కొక్కచో జడంబు సప్తమికిం ప్రథమయునగు" (ప్రౌఢ-కారక-20). అనగా- ఒక్కొక్కసారి జడవాచకము మీది సప్తమీవిభక్తికిని ప్రథమవిభక్తి వచ్చుచున్నదని అర్థము. ఉదా: వాహికమునాగబరగు తీర్థమాడి మేథా సమన్వితులగుదురు (భార-ఆర-2ఆ). ఇచట 'తీర్థమాడి' అనగా 'తీర్థమునందు ఆడి' అని అర్థము. సూత్రమున ఒక్కకచో అనుట వలన- 'తీర్థమందాడి' వంటి రూపములును ఉండవచ్చును.

6. "కాలాధ్వములకుం బ్రాయికంబుగా ప్రథమ యగు" (బాల-కారక-15). అనగా- కాలమును, మార్గమును చెప్పవలసివచ్చినపుడు తద్వాచకములకు తరచుగా ప్రథమావిభక్తి అగునని అర్థము. ఉదా: కాలమునకు- వాడు నిన్నవచ్చె; రేపు పొమ్ము. అధ్వమునకు- వారు క్రోశము నడిచిరి; పీ రామాడ వోయిరి. ప్రాయికముగా అనుటచే-

'వాడు నిన్నను వచ్చె; వారు క్రోశమును నడచిరి' వంటి రూపములును ఉండవచ్చును.

7. "సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబులం దెయ్యది ముందు ప్రయోగింపబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు" (బాల-కారక 26). అనగా- సర్వనామముకాని సంఖ్యావాచకముకాని విశేషణముగా ఉన్నప్పుడు, విశేషణ విశేష్యములలో ఏది ముందుగా ప్రయోగింపబడునో దాని ద్వితీయకు ప్రథమ బహుళముగా అగునని అర్థము. ఈ విధి విశేషణ విశేష్యములు వ్యస్తములైనప్పుడు మాత్రమే వర్తించును. ఉదా: అన్నిగుఱ్ఱములకు- అన్నింటికి గుఱ్ఱములకు; గుఱ్ఱములు లక్షకు- గుఱ్ఱములకు లక్షకు. ఇట్లే- స్త్రీలందఱకు- స్త్రీలకందఱకు; అందఱుస్త్రీలకు- అందఱకు స్త్రీలకు.

8. అ) "ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాష నగు" (బాల-కారక-27). అనగా- విశేష్యము షష్ఠ్యంతమై యున్నప్పుడు దాని విశేషణమును ఒక్కొక్కసారి విభాషగా ప్రథమాంతమగును. ఉదా: సుగుణాభిరాముడు రామునకు జోహారు ఒనర్చెద. ఈ విధి విభాష అనుటచే ప్రథమరాని పక్షమున షష్ఠియే యుండును. ఉదా: సుగుణాభిరామునకు జోహారు ఒనర్చెద. వాస్తవమునకు -"విశేష్యంబునకుం బోలె విశేషణంబునకు లింగ విభక్తి వచనంబు లగు" (బాల-కారక-19) అను సూత్రము ప్రకారము నామవాచకము ఏ లింగము, ఏ విభక్తి, ఏ వచనమున ఉండునో, విశేషణమునకు కూడ అదే లింగము, అదే విభక్తి, అదే వచనము రావలయును. ప్రస్తుత సూత్రము దీనికి అపవాదము.

ఆ) "ఒక్కచో సమాసాంతర్గత విశేష్యంబులకగు విశేషణంబుల షష్ఠికిని ప్రథమ చూపట్టెడి" (ప్రౌఢ-కారక-21). అనగా- ఒక్కొక్క మారు సమాసమునందున్న విశేష్యముయొక్క వ్యస్తవిశేషణము మీది షష్ఠికిని ప్రథమావిభక్తి వచ్చుచున్నదని అర్థము. ఉదా: పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతు పన్పిది నీ కలంఘ్యము (భార-అర-5ఆ). ఈ ఉదాహరణమున 'ధర్మసుతు' అన్న విశేష్యము షష్ఠ్యంతముగను, దాని విశేషణమైన 'పార్థివప్రాగ్రసరుండు' అన్నది ప్రథమాంతముగను ఉన్నవి. ఇట్లే- ఉత్పల్లిలోచను డా విష్ణుమూర్తితో (హరి-ఉ.భా.-5ఆ).

9. "కొన్నియెడల విశేషణంబుల ద్వితీయాదులకును ప్రథమ చూపట్టెడి"

(ప్రౌఢ-కారక-22). అనగా- కొన్నిచోట్ల విశేషణముల షష్ఠికి ప్రథమ యైనట్లే ద్వితీయాది విభక్తులకును ప్రథమ కన్పించుచున్నది. ఉదా: అహీనబాహుబలసారఘనుల్ మధుకైటభారిదైత్యపతులనెల్ల ద్రుళ్ళడచె (నిర్వ-రామా-5ఆ). ఇచ్చట 'మధుకైటభారి దైత్యపతులన్' అనునది ద్వితీయాంతముగను, దాని విశేషణము 'అహీన బాహుబల సారఘనుల్' అనునది ప్రథమాంతముగను ప్రయోగింపబడినది.

10. "క్రియాన్వయంబున రెండు పదంబులకు స్వస్వామిసంబంధముగలచో సంబంధిపదము షష్ఠికి ద్వితీయయగు" (ప్రౌఢ-కారక-23). అనగా- క్రియతో అన్వయము కలిగిన రెండు పదములు స్వస్వామి సంబంధము (స్వము అనగా తన సొత్తు; స్వామి అనగా ఆ సొత్తుగలవాడు అని అర్థము) గలవైనచో సంబంధిపదముయొక్క షష్ఠికి బదులుగా ద్వితీయవచ్చునని అర్థము.

ఉదా: స్వసంబంధమున- నన్ను నతడు చెట్టబట్టినన్ (భార-విరాట-2ఆ). ఇచ్చట 'అతడు నాయొక్క చెట్ట పట్టినచో' అని యర్థము. కాని షష్ఠికి బదులు ద్వితీయ వచ్చి 'నన్ను నతడు చెట్టబట్టినన్' అనియైనది. స్వామిసంబంధమున- రాముతమ్ముం లవుం యిరుమూడమ్మల జాపముం దునుమ (జైమినీ-6ఆ). ఇచట 'రాముతమ్మున్' అనునది షష్ఠియందుండగా అతనికి సంబంధించిన 'చాపమున్' అనునది ద్వితీయలో కలదు.

11. "ఒక్కచో ద్వితీయాంత విధేయ విశేషణంబునకుం బ్రథమయు నగు" (ప్రౌఢ-కారక-24). అనగా- విధేయవిశేషణము యొక్క ద్వితీయావిభక్తి బదులు ఒక్కొక్కమారు ప్రథమ వచ్చునని అర్థము.

విధేయమును తెలుపు విశేషణము విధేయవిశేషణము. ఉద్దేశ్యమును తెలుపు విశేషణము ఉద్దేశ్య విశేషణము. ఉదా: ఎవ్వనిం బ్రాకట ధర్మతత్త్వవిదు బ్రాహ్మణ ముఖ్యుబురోహితుండుగా జేకొనువారము (భార-ఆది-7ఆ). ఇచ్చట 'పురోహితుండు' అను విధేయ విశేషణము ప్రథమాంతముగనున్నది. దాని విశేషణములు- 'ధర్మతత్త్వవిదు, బ్రాహ్మణ ముఖ్యున్' అను రెండును ద్వితీయాంతములుగా నున్నవి.

సూత్రమున 'ఒక్కచో' అనుటవలన ప్రథమ రాని పక్షమున ద్వితీయాంతముగనే ఉండునని భావము.

12. "కొన్నియెడల విధేయ విశేషణ మొండ బహువచనాంతంబయి విశేష్యంబులు పెక్కింటి కన్వయ యోగ్యంబగు" (ప్రౌఢ-కారక-25). అనగా- ఏకవచనాంతములైన విశేష్యములు పెక్కులున్నప్పటికిని, విధేయవిశేషణము బహువచనాంతమై ఒక్కచోటనే ఉండి అన్నింటితోను అన్వయించును. ఉదా: ఇది దక్షిణాపథంబున కిది విదర్భాపురమున కిది కోసలకిం దిది యుజ్జయినికి దెరువులు (భార-ఆర-2ఆ).

ఇట్లు బహువచనాంతము కాక, ఏకవచనాంతముగా ఉండవలయునన్నచో- ఇది దక్షిణాపథంబునకు దెరువు, ఇది విదర్భాపురమునకు దెరువు, ఇది కోసలకు దెరువు, ఇది ఉజ్జయినికి దెరువు అని ఉండవలయును.

13. "కొన్నియెడల విభక్తి పరిణామంబు గ్రాహ్యంబు" (ప్రౌఢ-కారక-26) అనగా- కొన్నిచోట్ల ఒకేవిభక్తి, తరువాతవచ్చు పెక్కుపదములతో అన్వయమును కలిగియుండును. 'విభక్తిపరిణామము' అనగా- ఒకేవిభక్తి మరొకవిభక్తిగా పరిణమించి, తత్కార్యమును నిర్వహించుట. ఉదా: ఈతనితో సాటియనంగ మేలన (నిర్వ-3ఆ). ఇచ్చట 'ఈతనితో సాటి' యున్నప్పుడు సహార్థమున 'తో' వచ్చినది. కాని (ఈతనితో) మేలన' అన్నప్పుడు నిర్ధారణార్థమున 'కంటె' రావలయును. కానిముందున్న 'తో' ప్రత్యయమే, 'మేలన' అను పదముతో అన్వయించినప్పుడు 'కంటె' అనునర్థము నిచ్చుచున్నది. అనగా తృతీయయే పంచమిగా పరిణామించినదని భావము. ఇది విభక్తిపరిణామ మనబడును.

14. "భవత్యర్థ వ్యవహితంబులగు విశేషణంబులకుం బ్రథమయగు" (బాల-కారక-28). అనగా- అగు, అయిన వంటి భవత్యర్థ బోధకములచే విశేష్యమునుండి వేరుచేయబడిన విశేషణములకు ప్రథమయగును. ఉదా: విద్యాశాలియగు పురుషుని సకలజనులు సన్మానింతురు. ఇచ్చట- 'పురుషుని' అన్న విశేష్యము ద్వితీయావిభక్తిలో నుండగా, 'విద్యాశాలి' అను దానివిశేషణము 'అగు' అను పదముచే వేరుచేయబడినదై ప్రథమావిభక్తియందే యున్నది.

ఇట్లు బాల-ప్రౌఢవ్యాకరణకర్తలు ఒకవిభక్తిబదులు మఱియొక విభక్తివచ్చు రూపములను సోదాహరణముగా వివరించినారు.

# VII. సమాస పరిచ్ఛేదము

## 1. సమాసము

'సమాస' పదమునకు మనువు 'సంక్షేప' మనియు, హేమచంద్రుడు 'ఏకపద' మనియు అర్థము చెప్పినారు. మేదినీ కోశము – 'సమర్థనము, సంక్షేపము' అను అర్థముల నిచ్చినది. హలాయుధకోశమున 'సమాహార' మనియు, సంక్షిప్త వ్యాకరణము 'ఏకపదీకరణ'మనియు అర్థముల నిచ్చినవి. పాణినీయము – "సమర్థః పదవిధిః" (అష్టా- 2-1-1) – అనగా సమర్థమైన పదవిధి అని నిర్వచించినది. ఈ అర్థముల నన్నింటినీ జాగ్రత్తగా పరిశీలించినచో అన్నింటి అర్థము ఒక్కటిగనే కనిపించును. సంక్షేపమన్నను, ఏకపదమన్నను, సమాహారమన్నను, ఏకపదీకరణమన్నను పృథక్పదములకు ఏకపదవభాసమే ఉదిష్టార్థము. నిర్వచించుటలో భేదము తప్ప, అభిప్రాయమున భేదము లేదు.

పాణినీయమున చెప్పిన నిర్వచనమున – సామర్థ్యమనగా ఏకార్థీభావము. పృథక్పదములకు ఏకార్థీభావము సామర్థ్యము. ఇది మరికొంత కచ్చితముగా చెప్పబడిన లక్షణము.

పై అర్థములుకాని, లక్షణములుకాని, సమాసమన్న పదమును జాగ్రత్తగా విచారించుటవలన లభించినవే కాని, నూతనముగా తెచ్చిపెట్టినవికాదు. 'సమ్' అను ఉపసర్గతో కూడిన 'అస్' ధాతువునకు భావార్థమున 'ఘఞ్' ప్రత్యయము చేర్చగా, 'సమాస' పదము సిద్ధించును. దానికి 'చక్కగా కలిసి యుండుట' అని అర్థము. అదే విషయము పైన అన్ని విధముల చెప్పబడినది.

తొలి తెలుగు వ్యాకరణమును వ్రాసిన కేతన – "మొదలిపదంబు విభక్తులంబుచ్చి మీది పదంబుతోడి సమ్యక్సక్తంబు లగుటంజేసి సమాసంబులయ్యె" అని చెప్పినాడు. ఇచ్చట సమ్యక్సక్తిని ఏకపదీకరణమనియు, ఏకార్థీభావమనియు చెప్పవచ్చును. విన్నకోట పెద్దన కేతన మార్గమునే అనుసరించినాడు. అనంతుడు సమాసమును నిర్వచింపలేదు. గణపవరపువేంకటకవి తన 'ఆంధ్రకౌముది'లో చెప్పినది అశాస్త్రీయముగానున్నది. ఆయన "మొదటి పదము తుది అక్షరమతో పెరనుడి మొదటియక్షరము గదియనదికించిన సమాసమండ్రు" – అని చెప్పినాడు. ఈ విషయము సంధి విషయమున సరిపోవునుకాని, సమాసమునకు కుదరదు.

సంస్కృతముననే కాక ద్రావిడభాషలలోను ఈ సమాసవిధి కన్పించును. అరవమున సమాసప్రక్రియ ఉన్నట్లు తొల్కాప్పియమున చెప్పబడినది. అందులో సమాసమునకు 'తొగై' అనునది సమానార్థకముగా వాడబడినది. దానికి 'కూడు, చేరు' అనియు 'తొలగు, లోపించు' అనియు అర్థములు. అనగా పదములకలయిక, విభక్తిలోపము అను రెండును ఆ ద్రావిడ పదమున నున్నవి. తరువాతి వ్యాకర్తలు సంస్కృతములోని పేళ్లనే ఉపయోగించి చెప్పినారు. కన్నడవ్యాకర్తలు కూడ సంస్కృత ప్రణాళికనే గ్రహించినారు.

చిన్నయసూరి – "సమర్థంబులగు పదంబు లేకపదంబగుట సమాసము"(బాల– సమాస–1) అని నిర్వచించినాడు. అనగా సామర్థ్యము కలిగిన భిన్న పదములు ఏకార్థమునందుండుట సమాసము. ఇందలి 'సామర్థ్యము' – అను పదమును – "పృథగ్భూతంబులగు నర్థంబులకు ఏకార్థీభావము సామర్థ్యము – పృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబులకేకార్థంబునందు వృత్తి సామర్థ్యము" – అని వృత్తియందు చెప్పినాడు. వ్యాకరణశాస్త్ర ప్రకారము ఈ సామర్థ్యము– 2 విధములు.

1. వ్యపేక్షాసామర్థ్యము : ఏకవాక్యమునందు అకాంక్షను బట్టి వేర్వేరు పదములకు స్పష్టమగు సంబంధము వ్యపేక్షాసామర్థ్యము. ఇది వాక్యవిషయికమైనది.

2. ఏకార్థీభావసామర్థ్యము: వేరు వేరుగా ప్రసిద్ధములైన పదములకు ఏకార్థమునందు ఉనికి ఏకార్థీభావ సామర్థ్యము. ఇది ప్రస్తుత విషయికము – అనగా సమాసమునకు సంబంధించినది. అందువలన సూరి ఈ విషయమునే వృత్తియందు గ్రహించి వివరించినాడు.

సమాసమున సాధారణముగా రెండుకాని, అంతకన్న ఎక్కువ పదములుకానీ ఉండవలయును. కాని, 'పితరులు' వంటి కొన్ని ఏకశేషద్వంద్వ సమాసములును కొన్ని ఉన్నవి.

సమాసమున విభక్తికి లోపము కలుగును. కాని విభక్తి లోపించని మనసిజుడు, వనేచరుడు, పంకేరుహము వంటి సమాసములును కొన్నికలవు.

సమాసములలోని చివరి పదమును బట్టి అది యేసమాసమో నిర్ధారింపబడును. ఉదా: దారుణాఖండల శస్త్రతుల్యము – అన్నప్పుడు దారుణమైన – ఆఖండలునియొక్క శస్త్రమైన వజ్రాయుధముతో – సమానము అని చెప్పినప్పుడు, అది తృతీయాతత్పురుష సమాసమని నిర్ధారించవలెను.

ఇవి సమాస లక్షణములు!

## 2. సమాస విభజనము

### (అ) స్థూల విభజనము

"సాంస్కృతికాచ్ఛిక మిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు" (బాల-సమాస-2) - సాంస్కృతికము, ఆచ్ఛికము, మిశ్రమము - అని సమాసములు 3 విధములు.

**1. సాంస్కృతిక సమాసము :** ఇది మరల 2 విధములు.

(ఎ) సిద్ధము - కేవల సంస్కృతశబ్దములతో ఏర్పడిన సమాసము. ఉదా: రాజాజ్ఞ - ఇందలి రెండు శబ్దములును సంస్కృత శబ్దములే!

రాజ +ఆజ్ఞా = రాజాజ్ఞా అని ఏర్పడి, ఆ తరువాత "నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు" (బాల-తత్సమ- 54) అన్న సూత్రము ప్రకారము 'రాజాజ్ఞ' అని అయినది. ఇచట జరిగిన సంధియు సంస్కృతసంధియే (సవర్ణదీర్ఘసంధి). ఇట్లే- తటాకోదకము, లక్ష్మీవల్లభుడు.

(బి) సాధ్యము - తత్సమ పదములతో నేర్పడిన సమాసము. ఉదా: రాజునాజ్ఞ. ఇందలి రెండు శబ్దములును తత్సమ శబ్దములు. ఇచట జరిగిన సంధి తెలుగుసంధి (నుగాగమసంధి). ఇట్లే- తటాకోదకము, లక్ష్మీవల్లభుడు.

**2. ఆచ్ఛిక సమాసము:** ఆచ్ఛిక శబ్దములతో ఏర్పడిన సమాసము. ఉదా: తేనియానతి- ఇందలి 2 శబ్దములును అచ్చతెనుగుశబ్దములు. ఇచట జరిగిన సంధి తెలుగు సంధి( యడాగమము). ఇట్లే- చెఱువునీరు; సిరిచెలువుడు.

**3. మిశ్రమ సమాసము:** తత్సమ - ఆచ్ఛిక శబ్దములతో ఏర్పడినది మిశ్రసమాసము. ఉదా: రాజాముదల - ఇందులో పూర్వశబ్దము తత్సమము, ఉత్తరశబ్దము ఆచ్ఛికము. ఇట్లే- చెఱువునుదకము, సిరివల్లభుడు అన్నవానిలో పూర్వపదములు ఆచ్ఛికములు, ఉత్తరపదములు తత్సమములు.

ఇది సమాసముల స్థూలవిభజన.

## (ఆ) సూక్ష్మవిభజనము

"తత్పురుషము బహువ్రీహి ద్వంద్వంబులని సమాసంబులెల్లం ద్రివిధంబులయియుండు"(బాల-సమాస-3-వృత్తి). అనగా- తత్పురుషము, బహువ్రీహి, ద్వంద్వము అని సమాసములన్నియు 3 విధములు. అవి మూడును సామాన్యముగా ఉత్తర -అన్య- ఉభయప్రధానములై యుండును. అనగా - తత్పురుషము ఉత్తర పదార్థప్రధానమును, బహువ్రీహి అన్యపదార్థప్రధానమును, ద్వంద్వము ఉభయ పదార్థప్రధానమును కలవియైయుండును. ఈ తత్పురుషాదులకు లక్షణము సామాన్యముగా సంస్కృతమున చెప్పబడినదియే అగును (బాల-సమాస-3).

**1. తత్పురుష సమాసము–** ఇది వ్యధికరణమనియు, సమానాధికరణమనియు మరల రెండు రకములు.

(ఎ) వ్యధికరణము - ద్వితీయాది విభక్తులు మీది పదముతో సమసించుట వ్యధికరణము. దీనికే తత్పురుషమనియు నామాంతరము. ఉదా:

నెలతాల్పు - నెలను ధరించువాడు (ద్వితీయా తత్పురుషము)
నెలతక్కువవాడు - నెలచేత తక్కువవాడు (తృతీయ తత్పురుషము)
దేవరమేలు - దేవరకొఱకు మేలు (చతుర్థీ తత్పురుషము)
దొంగభయము - దొంగవలన భయము (పంచమీ తత్పురుషము)
రామునిబాణము - రాముని యొక్క బాణము (షష్ఠీ తత్పురుషము)
మాట నేర్పరి - మాటయందు నేర్పరి (సప్తమీ తత్పురుషము)

(బి) సమానాధికరణము - విశేషంబునకు విశేష్యంబుతోడ సమాసము సమానాధికరణము. దీనికే కర్మధారయమనియు పేరు. ఉదా: సరసపు వచనము; తెల్లగుఱ్ఱము; మంచిరాజు.

ఇదియె సంఖ్యాపూర్వకమైనచో ద్విగువు అనబడును (సమాస - 3-వృత్తి). ఉదా: ముజ్జగములు, ముల్లోకములు.

**2. బహువ్రీహి** - అన్యపదార్థ ప్రధానమైనది బహువ్రీహి.

ఉదా: ముక్కంటి - మూడు కన్నులు కలవాడు - ఈశ్వరుడు.
చలివెలుగు - చల్లనైన వెలుగు కలవాడు - చంద్రుడు.

ఈ సమాసములలో - పూర్వపదార్థమునకుగాని, ఉత్తరపదార్థమునకుగాని ప్రాధాన్యములేదు. ఆ రెంటి కలయిక వలన కలుగుచున్న వేరొక పదార్థమునకు (ఈశ్వరుడు, చంద్రుడు) ప్రాధాన్యము కలుగుచున్నది. కనుక ఇవి అన్యపదార్థ ప్రాధాన్యములైనవి.

3. ద్వంద్వము - ఉభయ పదార్థ ప్రధానమైనది ద్వంద్వము. అనగా ఇందలి పూర్వోత్తరపదములు రెంటికిని ప్రాధాన్యము ఉండును. ఉదా: తల్లిదండ్రులు; అన్నదమ్ములు.

సూత్రమున ప్రాయికముగా అని చెప్పుటవలన సంస్కృత లక్షణమునకు సరిపడని సమాసములును కొన్ని గలవని సూచింపబడినది. ఉదా: చిగురుగేలు; జుంటిమోవి- వీనిలోని పూర్వపదమైన విశేషణము స్థానమున ఉపమాన పదమున్నది. అందువలన నివి ఉపమానపూర్వపదకర్మధారయ సమాసములనబడును.

ఇట్లే ఉపమానోత్తరపద కర్మధారయ సమాసములును కొన్ని గలవు. ఉదా: ముఖపద్మము; చరణకమలములు. వీనిలో విశేషణస్థానికమైన ఉత్తరపదము ఉపమాన పదమైయున్నది. అందువలన నివి ఉపమానోత్తరపద కర్మధారయ సమాసములనబడును. కాని ఇట్టి ఉపమానోత్తర పదకర్మధారయ సమాసములకు 'విపరీతములు' లేవని సూరి చెప్పియున్నాడు. అనగా - కమలచరణములు, పద్మముఖము - వంటివి ఉండవని తాత్పర్యము.

"సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు" - అన్న వృత్తిలోని సూచనను బట్టి సంస్కృతములోని సిద్ధసమాసముల నన్నింటినీ గ్రహింపవచ్చును. ఉదా: రాజపురుషుడు; నీలోత్పలము; పీతాంబరుడు; రామలక్ష్మణులు.

"కేవల సంస్కృతశబ్దము వికృతి శబ్దముతోడ సమసింపదు" - అన్న వృత్తిలోని వాక్యముచే - కేవల సంస్కృత శబ్దములు తత్సమీకరణము చెందక తెలుగుశబ్దముతో సమసింపవు. అనగా - పూర్వపదము సంస్కృత శబ్దముగను, ఉత్తరపదము తెలుగుశబ్దముగను ఉంచి సమాసముచేయరాదు. అందువలన అనేకమూఁకలు - అల్పదండు వంటి సమాసములు దుష్టసమాసములని తెలియవలయును అని చెప్పినాడు సూరి. వీనినే 'వైరి సమాసము' లనియు అందురు. ఇట్టి సమాసములు చేయరాదు. కాని కొన్నివైరిసమాసములు లోకమున బహుళ ప్రచారమును పొందియున్నవి. ఉదా: గర్భగుడి - లింగకాయ- ఆదివారము- శుద్ధతప్పు. ఇవి అనివార్యములు.

ఇది సమాసముల సూక్ష్మవిభజనము.

# 3. తత్పురుషము

ఉత్తరపదార్థప్రాధాన్యము కలది తత్పురుషసమాసము. ఇది వ్యధికరణ మనియు, సమానాధికరణ మనియు మరల రెండు విధములు.

1. ద్వితీయాది విభక్తులు మీది పదముతో సమసించుట వ్యధికరణము.

ఉదా: నెలతాల్పు - నెలను ధరించువాడు (ద్వితీయా తత్పురుషము)
నెలతక్కువవాడు - నెలచేత తక్కువవాడు (తృతీయా తత్పురుషము)
దేవరమేలు - దేవరకొఱకు మేలు (చతుర్థీ తత్పురుషము)
దొంగభయము - దొంగవలన భయము (పంచమీ తత్పురుషము)
రాముని బాణము - రాముని యొక్క బాణము (షష్ఠీ తత్పురుషము)
మాటనేర్పరి - మాటయందు నేర్పరి (సప్తమీ తత్పురుషము).

2. షష్ఠీ తత్పురుషంబులందు నగాగమంబు విభాషనగు (ప్రౌఢ - సమాస-1). అనగా- షష్ఠీతత్పురుష సమాసములలోని షష్ఠ్యంతపదమునకు విభాషగా నగాగమ మగునని అర్థము. ఉదా: ఎలజవ్వనంబున విలసనంబు. ఇందులో- ఎలజవ్వనంబు యొక్క విలసనంబు అని యున్నప్పుడు, "సమాస విభక్తికి లోపంబగు" (బాల- సమాస-25) అను విధి ప్రకారము యొక్కకు లోపముకలిగి, ప్రస్తుత సూత్రము ప్రకారము నగాగమము రాగా - ఎలజవ్వనంబున విలసనంబు' అనియైనది. ఇట్లే - యోగక్షేమంబున తెఱగు (భార-ఉద్యో- 1ఆ); అరదంబున యురవడికిన్ (నిర్వ -6ఆ).

ఈ విధి 'విభాష'గా వచ్చుననుటచేత నగాగమము వికల్పముగానగును. నగాగమము రానిచో - ఎలజవ్వనంబు విలసనంబు, యోగక్షేమంబు తెఱగు, అరదంబు నురవడికిన్ - అని యుండును.

'విభాష' అనుటవలన ఇచ్చట నిషేధమును చెప్పబడినది. అందువలన ఈ నగాగమము ఉదంతములైన అమహత్తులకు మాత్రమే కలుగును; తక్కినవానికి కలుగదు (బాల-ప్రౌఢ-వ్యాఖ్య-II - పు.119).

3. "సర్వశబ్దంబులు సంబంధంబునందు దచ్ఛబ్దంబుతోడ సమసించు" (బాల- సమాస-8). అనగా- సంబంధార్థమున అన్ని శబ్దంబులును తత్ శబ్దముతో సమసించును. ఉదా: నా వాడు - నాయది - ఇంటివాడు - ఇంటిది - రామునివాడు - రామునిది.

4. "యుష్మదస్మదాత్మార్థంబుల కుత్తరపదంబు పరంబగునపుడు దుగాగమము విభాషనగు" (బాల-సమాస-11). అనగా- యుష్మదర్థకములు (నీవు, మీరు), అస్మదర్థకములు ( నేను, మేము), ఆత్మార్థకములు (తాను,తాము)- వీనికి ఉత్తర పదము పరమైనచో దుగాగమము విభాషగానగును. ఉదా: నీదుకరుణ-నాదునేరిమి - తనదురూపు.

ఈవిధి పాక్షిక మనుటవలన, దుగాగమమురానిచో - నీకరుణ, నానేరిమి, తన రూపు - అనియే యుండును.

5. "సమాసవిభక్తికి లోపంబగు; లట్టునకుఁగాదు" (బాల-సమాస-25). అనగా- సమాసమునందు పూర్వశబ్దము యొక్క విభక్తికి లోపము కలుగును. కాని, ద్వితీయాది విభక్తులకు బహువచనమున వచ్చు ఆగమలకారమునకు మాత్రము లోపమురాదు. ఉదా: రామునిబాణములు - ఇందులో - 'రామునియొక్క బాణములు' అన్నదానికి ప్రస్తుత సూత్రము చేత 'యొక్క'కు లోపము రాగా 'రాముని బాణములు' అని అయినది. ఇట్లే- గుణముల ప్రోక - ఇందులో కూడ 'గుణములయొక్క ప్రోక' అన్నదాని లోని యొక్కకు లోపము రాగా 'గుణములప్రోక' అనియైనది. బహువచన 'ల'కారమునకు లోపమురాదు.

6. "కొన్ని యెడల సప్తమీ తత్పురుషమునందు నవర్ణకంబునగు" (ప్రౌఢ-సమాస-37). అనగా- కొన్ని యెడల సప్తమీతత్పురుషసమాసమున పూర్వపదమునకు నవర్ణకమును కలుగును. ఉదా: కువలయంబునవారు (భార-ఆది-2ఆ).

సూత్రమున 'నవర్ణకంబును' అన్న సముచ్చయార్థకమువలన 'అందు' అను సప్తమీ ప్రత్యయమును రావచ్చునని వృత్తి యందు చెప్పినాడు. ఉదా: కువలయంబునందలివారు.

ఇట్లు బాల-ప్రౌఢవ్యాకరణకర్తలు తత్పురుషసమాసములలో కల్గుచున్న విశేషరూపములను వివరించినారు.

# 4. కర్మధారయము

దీనికి సమానాధికరణమనియు పేరు. విశేషంబునకు విశేష్యంబుతోడ సమాసము సమానాధికరణము. ఉదా॥ సరసపువచనము - తెల్లగుఱ్ఱము-మంచిరాజు. ఇదియె సంఖ్యాపూర్వకమైనచో ద్విగువు అనబడును. ఉదా॥ ముజ్జగములు - ముల్లోకములు.

1. "కర్మధారయంబు త్రిక స్త్రీసమ ముగంతధాతుజవిశేషణ పూర్వపదంబై యుండు" (బాల-సమాస-5). అనగా- కర్మధారయ సమాసములోని పూర్వపదము త్రికముగాని, స్త్రీసమముగాని, మువర్ణకాంతముగాని, ధాతుజ విశేషణముకాని అయియుండును.

(ఎ) త్రికముతో - ఆ ఈ ఏ యను సర్వనామములు త్రికమనబడును (బాల సమాస-4). ఈ మూడు సర్వనామములు పూర్వపదములుగా చేరుటవలన కర్మధారయ సమాసము లేర్పడుచున్నవి. ఉదా॥ ఆచందము - ఈచిందము- ఏబ్బందము.

(బి) స్త్రీసమములతో - ప్రథమైకలోపించిన శబ్దములు స్త్రీ సమములు. అవి పూర్వపదములైనప్పుడు ఉదా॥ వాడి మాట - పోడి పాట.

(సి) ముగంతములతో - ముపర్ణాంతపదములతో ఏర్పడు కర్మధారయశబ్దము లకు ఉదా॥ బెడిదపుటడిదము= బెడిదము +అడిదము - అన్నదానిలోని పూర్వశబ్దము ముపర్ణాంతము. "కర్మధారయంబుల ముపర్ణంబునకుంబుంపులగు" (బాల-సంధి-32) అన్న సూత్రము ప్రకారము పుగాగమముకలిగి 'బెడిదపు+అడిదము' అని యగును. తరువాత "కర్మధారయంబులందుత్తునకచ్చుపరంబగునపుడు టుగాగమంబగు"(బాల-సంధి-28) అన్న సూత్రముచే టుగాగమమై 'బెడిదపుటడిదము' అని అయినది.

(డి) ధాతుజవిశేషణములతో - క్రియాపదములవలన ఏర్పడిన విశేషణములు ధాతుజవిశేషణములు (వచ్చిన - వచ్చుచున్న-వచ్చెడు- రాగల-రాని). అట్టిపదముతో ఏర్పడిన కర్మధారయ సమాసములకు ఉదా॥ మడిసెడు దడములు.

వృత్తిలో - "ఈ నియముచే - బల్లిదుడుమల్లుడు- కావలుడు రావణుడు - ఇత్యాదుల సమాసంబు లేదు" - అని సూరి చెప్పియున్నాడు. వీనిలోని పూర్వశబ్దము

డువర్ణాంతము. ఇది త్రికముకాని, స్త్రీసమముకాని, ముగంతముకాని, ధాతుజవిశేషణముకాని కాదు. కనుక ఉత్తర పదముతో సమసింపక, వ్యస్తముగానే ఉండిపోవును.

2. (ఎ) కర్మధారయ సమాసమున ఉత్తరపదము బిరుదవాచకము కాని కులవాచకముకాని అయినప్పుడు, దాని పూర్వపదము రెండు అక్షరములుకల సంజ్ఞా వాచకమైనచో, అది పులింగమైనను స్త్రీ లింగమైనను, దాని చివరి అక్షరమునకు దీర్ఘము బహుళముగావచ్చును (ప్రౌఢ-సమాస-2). ఈ విధి సాంస్కృతిక -ఆచ్ఛిక-మిశ్రసమాసము లన్నింటికిని వర్తించును. ఉదా: రామాశాస్త్రి - సుబ్బాశాస్త్రి-రామానాయడు-సుబ్బారెడ్డి-వీరాసెట్టి-రామారావు-ఎఱ్ఱాప్రెగడ-చిన్నాదేవి.

ఈ విధి 'బాహుళక'మనుటవలన - రామనాయడు - రామశాస్త్రి - వంటివానిలో దీర్ఘము వైకల్పికము. అట్లే - కృష్ణశాస్త్రి వంటివానికి దీర్ఘముకలుగదు.

(బి) "ఇటపూర్వపదంబు నత్వంబున కిత్వంబు బహుళంబుగానగు" (ప్రౌఢ-సమాస-3) - అనుటవలన పై సూత్రమువలన వచ్చిన అత్వమునకు ఇత్వమును బహుళముగానగును. ఉదా : సుబ్బానాయుడు - సుబ్బినాయుడు; రామారెడ్డి - రామిరెడ్డి ; ఎల్లా సెట్టి - ఎల్లిసెట్టి.

ఇది - 'బాహుళక' మనుటవలన - రామిసెట్టి - సుబ్బిసెట్టి ఇత్యాదులలో ఇత్వము నిత్యము.

(సి) "కొన్ని యెడల నిచ్చో ననాపామా యాగమంబులగు" (ప్రౌఢ-సమాస-4). పై సూత్రమున (ప్రౌఢ-సమాస-2) చెప్పినట్లు రెండక్షరములుకల పూర్వపదములకు చివర 'అన-అప-అమ-అయ '- అనునవి ఆగాగమములగును. ఉదా: తిక్కనసోమయాజి-నన్నపార్యుడు - కృష్ణ నాయడు - నన్నయభట్టు.

(డి) "పై యాగమంబులు కొన్నియెడల ద్విత్వయుక్తంబులగు" (ప్రౌఢ-సమాస-5). పై సూత్రము ప్రకారము వచ్చిన - అన-అప- అమ-అయ-అనువానికి కొన్నియెడల ద్విత్వమును కలుగును. ఉదా: రామన్న సెట్టి - తిమ్మప్పనాయుడు-కృష్ణమ్మపంతులు- మల్లయ్యశాస్త్రి.

3. "కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసంబట్లయగు" (ప్రౌఢ-సమాస-6). అనగా- బిరుదాది పదములు ఉత్తరపదములుగా కలిగిన కర్మధారయ సమాసములు మిశ్రసమాసములే అయినను, వానికి ప్రక్రియ సిద్ధసమాసముల వలెనే అగును. ఉదా॥ రామరావు - కృష్ణరాయడు. ప్రౌఢవ్యాకరణకర్త చెప్పిన పై నియమములు కేవలము రెండక్షరములు పూర్వపదములుగా కలిగిన సమాసములకే చెప్పినాడు. కాని అంతకన్న ఎక్కువ అక్షరములు కలిగిన పూర్వపదములకును వర్తించుచున్నది. ఉదా॥ మోహనరావు - నారాయణరెడ్డి. అదంతములు కాని పదములపైనను రావచ్చును - గురుమూర్తి నాయడు(బాల-ప్రౌఢ-వ్యాఖ్య- III-పు.125).

4. "క్రొత్తాదులు లుప్తశేషంబులు దేశ్యంబులతోడం బలె, దత్సమంబులతోడం గొన్నియెడల గర్మధారయంబగు" (ప్రౌఢ-సమాస-3). అనగా- బాల-సంధి-36వ సూత్రముచే నేర్పడిన క్రొత్తాదుల ఆద్యక్షరశేషము లైన 'క్రొ' మొదలగునవి, దేశ్యశబ్దములతో సమసించినట్లు, కొన్నియెడల తత్సమ శబ్దములతోను సమసించును. ఉదా॥ క్రొంబులకలు (క్రొత్త+పులకలు) ( ఉ.రామా-6ఆ); ముంగోపము (ముందు+కోపము)(ఉ.రామా-3ఆ); సగరాజ్యము (రామా-కిష్కింధ).

5. "గుణవచనంబులగు నల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగముంబు బహుళంబుగా నగు" (బాల-సమాస-12). అనగా- గుణవచనములైన నల్ల-తెల్లవంటి శబ్దములు పూర్వపదములై ఏర్పడిన కర్మధారయసమాసములలో, ఆ విశేషణములకు నిగాగమము బహుళముగా చేరును. ఉదా॥ నల్లని గుఱ్ఱము - నల్ల గుఱ్ఱము.

నల్ల-తెల్ల-పచ్చ-ఎఱ్ఱ-చామ-తియ్య-కమ్మ-పుల్ల-వంటివి నల్లాదులు.

ఇట్లు వచ్చిన నిగాగమమునకు పరుషములు పరమైనచో బిందువగును (ప్రౌఢ-సమాస-13). ఉదా॥ కమ్మఁదేనె-కమ్మందేనె(నైష.-2ఆ).

6. "తమ్మిఁగుఱ్ఱలు చిలుకమొకరియిత్యాదులు విశేష్యపూర్వపదకర్మధారయ సమాసంబులు" (ప్రౌఢ-సమాస-16). కర్మధారయసమాసములలో సాధారణముగా విశేషణము పూర్వపదముగను, విశేష్యము ఉత్తరపదముగను ఉండును. అట్లుకాక విశేష్యము పూర్వపదమై, విశేషణముత్తర పదములుగా నున్నవానికి 'విశేష్య పూర్వపదకర్మధారయ సమాసము' అని పేరు. ఉదా॥ తమ్మిఁగుఱ్ఱలు (భార-ఆర-7ఆ), చిలుకమొకరి (శుక.-2ఆ).

7. ఆ ఈ ఏ - అను సర్వనామములు త్రికమనబడును (బాల-సమాస-4). "త్రికంబుమీది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు" (బాల-సమాస-14). అనగా- ఆ ఈ ఏ అను మూడు సర్వనామములకు పరముగా అసంయుక్తహల్లున్నచో దానికి ద్విత్వము బహుళముగా నగును.

"ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్చికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు". అనగా - ద్విరుక్తమైన హల్లు పరమైనప్పుడు ఆచ్చికశబ్దముపై నున్న దీర్ఘము హ్రస్వమగును. ఉదా : ఆకన్య - అక్కన్య; ఈకాలము - ఇక్కాలము; ఏలోకము - ఎల్లోకము.

ఈ విధి 'బాహుళకము' అనుటవలన ఊష్మరేఫములకు వర్తించదు (వృత్తి). ఉదా: ఆరూపము - ఈశబ్దము - ఏషండము - ఆసుకృతి-ఆహయము.

8. "కృత హ్రస్వంబగు త్రికంబు మీది చోటు శబ్దంబు నోత్వంబునకు అత్వహ్రస్వంబులు విభాషనగు" (బాల-సమాస-15). అనగా - త్రికము పైనున్న చోటు శబ్దమునకు పై సూత్రములచే (బాల-సమాస-4,13,14)- అచ్చోటు-ఇచ్చోటు- ఎచ్చోటు వంటి రూపము లేర్పడును. ప్రస్తుత సూత్రముచే వానికి అత్వము వచ్చినప్పుడు - అచ్చటు - ఇచ్చటు- ఎచ్చటు-అనియు అగును.

"అక్కటాదుల జడ్డకు లోపంబు బహుళంబుగానగు" (బాల-ప్రకీర్ణ-8) అను సూత్రముచే - అచటు-అచోటు; ఇచటు-ఇచోటు; ఎచటు - ఎచోటు - అను రూపములును కలుగును.

ఈ చోటు శబ్దము ఔపవిభక్తిము కనుక, దాని అంతిమ టకారమును విభాషగా లోపించును (బాల-సమాస-16). ఉదా: అచ్చోనున్నాడు - అచ్చోటనున్నాడు; ఒకచోనుండె - ఒకచోటనుండె.

9. "ఆ యీత్యాదిఘటితంబులువిశేషణోభయ పదకర్మధారయంబులు" (ప్రౌఢ-సమాస-17). అనగా- ఆ, ఈ వంటి రెండేసి విశేషణములు పూర్వపదములుగా కలిగిన వానిని విశేషణోభయపదకర్మధారయసమాసము లందురు. ఉదా: ఆ యీ నేరములు; ఈయాదేశంబననేల (మను-1ఆ); కొట్టిన తిట్టిన యాతడు (భోజ-6ఆ).

కొన్ని త్రికక్రియాజన్యవిశేషణ ఘటితములైన విశేషణోభయపద కర్మధారయ సమాసములు, సందర్భోచితపదములతో వ్యవహితములై యుండియు విశేష్యముతో సమసించును (ప్రౌఢ-సమాస-18). ఉదా॥ ఈ కన్నులు తెలవని శిశు వేకీడొనరించె నీకు (భోజ-6ఆ).

10. "కొండొకచో సమాసంబులందు నామ్వాది కనుమ్వాదుల మువర్ణంబులు పజ్వవర్ణంబులగు" (బాల-సమాస-19). అనగా- సమాసములందు పూర్వశబ్దములైన నామ్వాదుల మువర్ణమునకు పజ్వర్ణకమును (బిందుపూర్వక పవర్ణము), కనుమ్వాదుల ము వర్ణమునకు పవర్ణమును ఆదేశమగును. ఉదా॥ నాపచేను - పాపతేడు; కనుపపులు- జనుపనార.

నాము-పాము-ప్రేము-వేము-అమ్ము-ఎమ్ము-ఇవి నామ్వాదులు.

కనుము-ఇనుము-ఉడుము-ఎనుము-జనుము-మినుము-ఇత్యాదులు కనుమ్వాదులు.

11. "నిక్కాలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు"(బాల-సమాస-20). అనగా - నిక్కాల, కవ్వడి మొదలైన సమాసములను ప్రయోగములలో నున్నట్లు గ్రహింపవలెను. ఉదా॥ నిక్కాల (నిక్కము+కల); కవ్వడి (కవ+వడి).

ఇట్లు బాల-ప్రౌఢవ్యాకరణకర్తలు కర్మధారయసమాసము లేర్పడుచున్న విధానమును వివరించినారు.

# 5. ద్విగువు

సంఖ్యావాచకశబ్దము పూర్వపదముగా కల కర్మధారయసమాసమునకే ద్విగు సమాసమని పేరు. ఆ ద్విగుసమాసములు తెలుగులో ఏర్పడుచున్న విధానమును బాల-ప్రౌఢవ్యాకరణములు వివరించినవి.

1. "సమానాధికరణంబగు నుత్తర పదంబు పరంబగునపుడు మూడు శబ్దము డువర్ణంబునకు లోపంబును, మీది హల్లునకు ద్విత్వంబునగు" (ప్రౌఢ-సమాస-17). అనగా- సమానాధికరణ సమాసములోని మూడు శబ్దమునకు ఉత్తరపదము పరమగునపుడు, దాని డువర్ణమునకు లోపమును, మీది హల్లునకు ద్విత్వమును అగును. ఆ తరువాత - "ద్విరుక్తంబగు హల్లుపరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు" (బాల-సమాస-13)అన్న సూత్రము ప్రకారము - మూడు + జగములు= ముజ్జగములు; మూడు + లోకములు = ముల్లోకములు. ఇచ్చట సమాసమైనచో - ముజ్జగములు, ముల్లోకములు వంటి రూపములేర్పడును. సమాసము కానిచో - మూడు జగములు, మూడులోకములు వంటి రూపములే యుండును.

ఈ విధి 'ముయ్యేడు' వంటి సమాసములకు నిత్యమని - "ముయ్యేడ్వాదులందు హ్రస్వద్విత్వములు నిత్యంబులు" (ప్రౌఢ-సమాస-10)- అని ప్రౌఢవాకరణ్యకర్త చెప్పియున్నాడు. ఉదా॥ ముయ్యేడు మాఱుల్ (భార-ఆది-1ఆ); ముమ్మడుగు (భార-ఆది-1ఆ).

2. "ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగానగు; మిశ్రంబునకుగాదు" (బాల-సమాస-18). అనగా- ద్విగుసమాసములోని పూర్వోత్తరపదములు రెండును ఆచ్ఛికములేయైనచో, ప్రాయికముగా ఆ సమాసాంతమున బహువచనమునకు బదులు ఏకవచనము వచ్చును. ఇచ్చట 'ప్రాయికముగా' అనుటవలన బహువచసమును యథాతథాముగా ఉండవచ్చునని భావము. ఉదా॥ ముచ్చిచ్చు-ముక్కారు- ముప్పాతిక- ముత్రోవ. ఏకవచనమురానిచో - ముచ్చిచ్చులు - ముక్కారులు.

ఆ సమాసము మిశ్రసమాసమైనచో - అనగా ఒక పదము ఆచ్ఛికము, మరొక పదము తత్సమము అయినచో, ఏకవచనము కాదు. ఉదా॥ ముప్పిధములు - ముజ్జగములు. కాని కొన్ని ప్రాచీనకావ్యములందు మిశ్ర ద్విగుసమాసములును ఏకవచనాంతములుగా

నున్నవని చూపుచు ప్రౌఢవ్యాకరణకర్త – "ఒక్కచో ద్విగువు మిశ్రంబేకవచనాంతంబునగు" (ప్రౌఢ-సమాస-20) అని బాలవ్యాకర్త చెప్పినదానిని సవరించినాడు. ఉదా: నల్దిక్కుదిరిగి (ఉ.హరి.-6ఆ); ముల్లోకము దానయేలుగతి (హరి-1ఆ); మున్ముహూర్తమునకు(జై.-7ఆ).

3. "వారార్థకశబ్దంబు లద్విరుక్తంబులు తఱచుగ సంఖ్యాపూర్వకంబులగు" (ప్రౌఢ-సమాస-21). అనగా- వారార్థక శబ్దములు అద్విరుక్తములు కానిచో తఱచుగ సంఖ్యాపూర్వకములై యుండును. ఉదా: ఒక తడవ – ఒక మాటు – ఒకసారి – రెండు తడవలు.

ద్విరుక్తములైనచో సంఖ్యాపూర్వకములు కానక్కరలేదు. ఉదా: తేపతేపకు తడవతడవకు – మాటిమాటికి.

'తఱచుగ' ననుటచే – ద్విరుక్తములుకానప్పుడును వానిని సంఖ్యా వాచక విరహితములుగా ప్రయోగింపవచ్చును. ఉదా: తడవకు – మాటికి.

తడవ – తూరి – తేప – మాటు – సారి – వంటివి వారార్థకములు.

4. " ఒకండ్వాదులు పరంబులగుచో ( దఱచుగ నున్ బదికగు" (ప్రౌఢ-సమాస-22). 'పది' శబ్దమునకు 'ఒకండు'వంటి సంఖ్యావాచకములు పరమందున్నచో 'ఉన్' అనునది తఱచుగా ఆగమముగా వచ్చును. ఉదా:పదునొకండు(పది+ఉన్+ఒకండు). ఇట్లే – పదుమూడు – పదునేను – పదునాఱు.

సూత్రమున'తఱచుగ' అనుటవలన – 'ఉన్' ఆగమముగా రాని పదియాఱు పదాఱు వంటి రూపములును కలుగవచ్చునని వృత్తియందు వివరింపబడినది.

5. "పదికి రెండిరు దొమ్మదుల పరంబులగునపుడు బిందుపూర్వక డకారంబును, ద్విరుక్త నివర్ణంబును, బిందువును గ్రమంబుగ దివర్ణంబునకగు" (ప్రౌఢ-సమాస-23). అనగా– 'పది' శబ్దమునకు రెండుశబ్దము పరమైనప్పుడు దాని చివరి దివర్ణమునకు బిందుపూర్వక డకారమును,'ఇరు' అనుశబ్దము పరమగునప్పుడు ద్విరుక్త నివర్ణమును, 'తొమ్మిది' శబ్దము పరమగునప్పుడు బిందువును ఆదేశమగును.

ఉదా: పది+రెండు = పండ్+రెండు = పండ్రెండు.
పది + ఇద్దఱు = పన్ని+ఇద్దఱు = పన్నిద్దఱు.
పది = తొమ్మిది = పం+తొమ్మిది = పందొమ్మిది.

6. "పదియుత్తరపదంబగుచో నేను దొమ్ముల నుమ్ములకు బిందువును, ఎని కేనును, ఏడునకు వర్ణవ్యత్యయంబును, ఆపరుషంబునకు సరళంబును, క్రమంబుగనగు" (ప్రౌఢ-సమాస-24).

1. 'పది' ఉత్తర పదముగా నున్నప్పుడు – ఏను శబ్దము యొక్క నువర్ణమునకు బిందువు ఆదేశమగును - ఏను + పది = ఏం+పది; దీర్ఘముపైన సాధ్యపూర్ణము ఉండదు కనుక- ఏ+పది; సరళదేశమురాగా - ఏఁబది అని యగును.

2. పదికి పూర్వమున తొమ్మిది యున్నచో – బిందువును సరళమును కలిగి – తొంబది అని యగును.

3. పదికి పూర్వమున ఎనిమిది ఉన్నచో – 'ఏను'కుబదులు 'ఎని' వచ్చును- ఎనిమిది+పది= ఎను+పది. సరళమురాగా – ఎనుఁబదియని యగును.

4. పదికి పూర్వమున ఏడు ఉన్నచో – వర్ణవ్యత్యయము కలుగును – ఏడు+పది = డుఏ+ పది; అపదాది స్వరమునకు సంధికలిగి –డే అనియు; 'పదియుత్తరపదంబగుచో పూర్వపదంబు దీర్ఘంబునకు హ్రస్వంబగు' (ప్రౌఢ-సమాస-25) అను సూత్రము ప్రకారము - డె+పది అనియు; 'ప్రాప్తహ్రస్వంబులగు మూడేల మీది వర్ణంబులకు ద్విత్వంబు బహుళంబుగా నగు (ప్రౌఢ-శబ్ద-100) అను సూత్రము ప్రకారము 'డెబ్బది' అనియు అగును.

7. "పది యుత్తరపదంబగుచోఁ బూర్వపదంబు దీర్ఘయునకు హ్రస్వంబగు; ఏకు రాదు" (ప్రౌఢ-సమాస-25). అనగా – పదిశబ్దము ఉత్తరపదముగా నున్నప్పుడు, పూర్వపదము యొక్క, దీర్ఘమునకు హ్రస్వమగును. 'ఏను' శబ్దములోని 'ఏ'కు మాత్రమురాదు. ఉదా: ముప్పది- ముప్పండ్రు; నలువది-నలువండ్రు; ఏఁబది- ఏఁబండ్రు.

8. "కొన్ని యెడల నీ సమాసపదంబులు యువర్ణ వ్యవహితంబులునగు" (ప్రౌఢ-సమాస-26). అనగా- కొన్నిచోట్ల పై ద్విగుసమాసములోని పదములు 'యు' ర్ణము చే వ్యవహితములును అనుగు. ఉదా: పదియు రెండేడులజ్ఞాతవాస (భార-ఆది- ఆ); పదియు నొక్కండ్రు రుద్రుల బాఱవిడిచె(కాశీ-7 ఆ).

ఇట్లు బాలప్రౌఢవ్యాకరణకర్తలు ద్విగుసమాసములను నిరూపించినారు.

# 6. బహువ్రీహి

అన్య పదార్థప్రధానమైనది బహువ్రీహి.

ఉదా: ముక్కంటి – మూడు కన్నులు కలవాడు – ఈశ్వరుడు.
చలివెలుగు – చల్లనైన వెలుగు కలవాడు – చంద్రుడు.
చక్రపాణి – చక్రము చేతియందుకలవాడు – విష్ణువు.

ఈ సమాసములు రెండుపదముల కలయికవలన ఏర్పడినవి(మూడు+కన్నులు; చలి+వెలుగు; చక్రము+పాణి). వీనిలో కొన్ని సమాసములైన పిదప, అంతమున కొన్ని మార్పులనొందినవి. కొన్నింటికి మార్పులు లేవు. ఏమైనను, వీనిలోని పూర్వపదమునకు గాని, ఉత్తర పదమునకుగాని అర్థప్రాధాన్యములేదు. ఆ రెండు పదముల కలయిక వలన ఆసమాసములు విశేషార్థబోధకములు (ఈశ్వరుడు, చంద్రుడు, విష్ణువు) అగుచున్నవి. అందువలన అన్యపదార్థ ప్రధానములైనవి.

ఇట్టి బహువ్రీహి సమాసము లేర్పడుచున్న విధానమును బాల–ప్రౌఢవ్యాకరణకర్తః వివరించినారు.

1. "స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడి"(బాల–సమాస-6). అనగా – బహువ్రీహి సమాసములలోని పూర్వోత్తర పదములు రెండును స్త్రీ సమములై యుండును. ఉదా: చలివెలుగు – వేవెలుగు – మోటబరి(మోటలాగు ఎద్దు).

2. "బహువ్రీహి ని సమాసాంతకార్యాంబులుం గానంబడియెడి"(బాల–సమాస–22). అనగా– సమాసములందు సమాసాంతమున ఆగమాదేశాది కార్యములు కొన్ని జరుగునని అర్థము. ఉదా: ముక్కంటి – కడలిరాచూలి – నలువ – గట్టువిలుతుడు.

3. "బహువ్రీహి ని స్త్రీ వాచ్యంబగుచో నుపమానంబు మీది మేనునకు బోడియగు (బాల–సమాస–23). అనగా– బహువ్రీహి సమాసమున, పూర్వశబ్దము ఉపమానవాచకముగను, ఉత్తరశబ్దము 'మేను' అనియు ఉండి, ఆ సమాసము స్త్రీ వాచకమైనచో, 'మేను' శబ్దమునకు 'బోడి' అనునది ఆదేశమగును. ఉదా: అలరు బోడి (అలరు+మేను–పువ్వువంటి శరీరముగలస్త్రీ). ఇట్లే – ననబోడి – పూబోడి– విరిబోడి. ఇందలి 'అలరుఁబోడి' అగు దానిని గ్రహించి, ప్రౌఢవ్యాకర్త – "అలరుఁబోడి త్యాదులుపమాన

పూర్వపద కర్మధారయంబులు" (ప్రౌఢ-సమాస-89) అని సవరించి చెప్పబూనినాడు. అనగా- అలరుఁబోడి మొదలగునవి ఉపమానపూర్వపదకర్మధారయ సమాసములని ఆయన అభిప్రాయము. ఆయన - అలరు + పోడి - అని ఆసమాసమును విడదీసి, " ఇట పోడి పరంబగు చో నెల్లెడం నుమ్మగు " (వృత్తి) అని నుగాగమును విధించి, ద్రుతకార్యము జరిపి, 'అలరుఁబోడి' అనురూపమును సాధించినాడు. దీని లోని 'పోడి' శబ్దమునకు 'మనోజ్ఞమైనది' అని అర్థము నిచ్చినాడు.

పై సమాసములలోని ఉత్తరపదమును చిన్నయసూరి 'బోడి' యని గ్రహింపగా, ప్రౌఢవ్యాకర్త 'పోడి' యని చెప్పుట గమనార్హము. దీనికి కారణము – ప్రాచీన కావ్యములలో– చిగురుంబోడి (కళా-3ఆ); తీయంబోడి (పాంచాలీ- 3 ఆ); పువ్వుంబోండ్లు (యయాతి. 1 ఆ)- వంటి ప్రయోగములలో పోడి శబ్దమునకు పూర్వమున బిందువుండుటయే అనవచ్చును. కాని సూరి ఇచ్చిన ఉదాహరణలలో బిందువు లేదు. కనుక ఆయన అభిప్రాయమున 'బోడి' యనియే స్పష్టమగును.

ఉదంతస్త్రీసమములకును సరళములు పరమగునప్పుడు నుగాగమము విధింపబడినది (బాల-సంధి-35). కనుక, ఆసూత్రము ప్రకారము 'అలరుంబోడి, పూవుంబోడి' వంటి రూపములను సాధించుటకు సూరివిధానము అవకాశము కల్గించుచున్నది. కాని – 'విరిబోడి', ననబోడి' వంటివానికి బిందువు కలుగుటకు అవకాశము లేదు కనుక సూరి అన్నింటికీ సరిపడు నట్లు 'బోడి' పదమునే స్వీకరించినాడు. ప్రౌఢవ్యాకర్త – "ఇట పోడి పరంబగుచో నెల్లెడలనుమ్మగు" అని నుగాగమమును విధించి పై రూపములను సాధించినాడు. అవసరమైన పదములను విధించి రూపసాధనమును క్లిష్టతరము చేయుటకన్న, సూరి అనుసరించిన విధానమే సముచితముగా నున్నది.

4. "కఱకంఠుడు బహువ్రీహి" (ప్రౌఢ-సమాస-27). అనగా- కఱకంఠుడు అనునది బహువ్రీహి సమాసమని అర్థము.

కఱకంఠుడు – అన్న బహువ్రీహి సమాసమున పూర్వపదము అచ్చికము (శకటరేఫము అచ్చిక శబ్దములయందే కన్పించును). ఉత్తరశబ్దము తత్సమము. కనుకదీనిని అహోబలపతి మిశ్రబహువ్రీహి గా చెప్పినట్లు ప్రౌఢవ్యాకర్త చెప్పి, "కాని అది యట్లగుట దర్శటము" అని స్పష్టపరిచినాడు. అందువలన ఆయన దానిని 'గరకంఠః'

అన్న సంస్కృత సమాసమునకు తద్భవరూపమని చెప్పినాడు. ఏమైనను అది బహువ్రీహి అనియే ఆయన అభిప్రాయము.

కాని అట్లు స్వీకరించినను 'కఱకంఠుడు' అన్నదానిలో ఱవర్ణమున్నది. అది తద్భవములలో ఉండదు. కనుక దానిని తద్భవమనుటకును వీలులేదు.

అందువలన చిన్నయసూరి దానిన 'కఱకంఠుడు' అనియే గ్రహించి, లక్షణవిరుద్ధమైనది కావున గ్రామ్యమనిచెప్పినాడు. కాని మహాకవులచే ప్రయోగింపబడినది కావున అనింద్యగ్రామ్యమని నాడు (బాల-సంజ్ఞా-23).

ఏమైనను ఈ ప్రయోగవిషయమున ప్రౌఢవ్యాకరణకర్త చెప్పిన దానికన్న సూరి చెప్పినదే సముచితముగానున్నది.

ఇట్లు బాల-ప్రౌఢవ్యాకరణకర్తలు ఈ బహువ్రీహి సమాసములను వివరించినారు.

# 7. ద్వంద్వము

ఉభయ పదార్థ ప్రధానమైనది ద్వంద్వసమాసము. ఇందలి పూర్వోత్తరపదములు రెంటికిని సమప్రాధాన్యముండును. ఉదా: తల్లిదండ్రులు - అన్నదమ్ములు.

1. "ఆచ్ఛిక శబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వంబగు" (బాల-సమాస-7). అనగా- ద్వంద్వసమాసము సాధారణముగా పూర్వపదము స్త్రీసమమును, ఉత్తరపదము ఆచ్ఛికమును అయియుండును. ఉదా: అన్నదమ్ములు - తల్లిదండ్రులు - ఊరు వల్లెలు - ఆలుమగలు. వీనిని ఆచ్ఛికద్వంద్వములందురు.

ఈ నియమమువలన - 'మగడును బిడ్డలును - పల్లమును గళ్లెమును' అనునవి సమసింపవని వృత్తిలో చెప్పినాడు. ఇవి రెండును ఆచ్ఛికశబ్దములే అయినను పూర్వపదములు స్త్రీసమములు కావు కనుక సమసింపవు. సముచ్చయార్థకముతో కూర్పబడి, వ్యస్తముగనే యుండును.

2. "ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాషనగు" (బాల-సమాస-24). అనగా- ద్వంద్వసమాసములో పూర్వ పదము చివరనున్న ఋవర్ణమునకు బదులు రవర్ణము విభాషగా నగును. ఉదా: మాతృ+పితలు = మాత్రపితలు; మాంధాతృ=రఘుక్షితీశులు = మాంధాత్రరఘుక్షితీశులు.

ఈ విధి విభాషకనుక - మాతాపితలు.

3. "కొన్ని యెడల మహద్ద్వంద్వంబునం బూర్వపదాంత్య స్వరంబునకు దీర్ఘంబును జూపట్టెడు" (ప్రౌఢ-సమాస-28). అనగా- మహద్వాచకములచేగాని, మహతీవాచకములచేగాని ఏర్పడిన ద్వంద్వసమాసములలో పూర్వ పదాంత్య స్వరమునకు కొన్ని యెడల దీర్ఘమును అగును. ఉదా: అన్నాదమ్ములు (ఉ.హరి-4ఆ); అప్పాచెల్లెండ్రు నిర్వ.రామా. - 3ఆ); తల్లీదండ్రులు (భల్లా-4ఆ).

4. "ఒకానొకచో ద్వంద్వబునం బూర్వ పదంబు క్లీబసమంబగు; అగుచో నాము వర్ణంబునకు లోపంబగు (ప్రౌఢ-సమాస-29). అనగా- సాధారణముగా ద్వంద్వసమాసములో పూర్వపదము స్త్రీసమమే అగును. ఒక్కొక్కసారి ఆపూర్వ

పదము క్లీబసమముగను ఉండవచ్చును. అప్పుడు దాని చివరిమువర్ణమునకు లోపము కలుగును. ఉదా: అందచందములు (అని.-5ఆ); వెచ్చసచ్చముల (వేం.పంచ.-1ఆ).

5. "ద్వంద్వం బప్రాణివాచక కృదంతశబ్దఘటితం బేకవచనాంతంబునగు" (ప్రౌఢ-సమాస-30). అనగా- అప్రాణివాచకములతో కాని, కృదంత శబ్దములతోగాని ఏర్పడిన ద్వంద్వ సమాసము ఏకవచనాంతముగ కూడ నుండవచ్చును. ఉదా: కూడుగుడ్డ- కూరగాయ (జై.భార-4ఆ)- దరిదాపు (భోజ-2ఆ)- తాకుదగులు (హరి-ఉ-5ఆ).

సూత్రములోని 'సు' అను సముచ్చయార్థకమువలన - కూడుగుడ్డలు - కూరగాయలు - దరిదాపులు -తాకుదగులులు - అనియు నుండవచ్చును.

6. "భావద్వంద్వంబునం దొలి పదంబు టవర్ణకంబునకు లోపంబగు" (ప్రౌఢ- సమాస-31). అనగా- భావార్థకశబ్దములతో నేర్పడిన ద్వంద్వసమాసమున పూర్వ పదము చివరనున్న టవర్ణమునకు లోపముకలుగును. ఉదా: ఔగాములు (ఔట+కామి) (పరమయోగి -3ఆ) - చెల్లుచెల్లములు (చెల్లుట+చెల్లమి) (వేం.పంచ-1ఆ)- వచ్చురాములు (వచ్చుట+రామి) (పాండు-4ఆ).

7. "ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు లోపంబొండెనగు" (ప్రౌఢ-సమాస-32). అనగా - ఒక్కొక్కసారి ద్వంద్వసమాసములోని పూర్వపద్యాంత్య అవయమునకు లోపము వికల్పముగా నగును. ఉదా: పుట్టుగ్రుంకుగట్లు (పుట్టుగట్టు + క్రుంకుగట్టు) (యయాతి.-5ఆ); తొవదమ్మి విందు (తొవవిందు + తమ్మివిందు) (రామా.-3ఆ); విన్నకన్నది (విన్నది+కన్నది)(వి.పు-2ఆ).

8. "ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రంబుగను, అందలి పూర్వపదంబు క్లీబ సమంబుగను గానంబడియెడి" (ప్రౌఢ-సమాస-33). అనగా- క్లీబసమమైన శబ్దము పూర్వపదముగా కలిగిన మిశ్రద్వంద్వ సమసమును ఒక్కచో కనిపించవచ్చును. ఉదా: అవసరమక్కఱలు (రామా - 2ఆ).

ఇట్లు బాల-ప్రౌఢవ్యాకరణకర్తలు తెలుగులో ద్వంద్వ సమాసములుకలుగుచున్న విధానములను వివరించినారు.

# VIII. తద్ధిత పరిచ్ఛేదము

విభక్త్యంతములైన పదములపైన భావార్థము, స్వార్థము, మతుబర్థము, దఘ్నార్థములలో చేరెడు ప్రత్యయములను తద్ధిత ప్రత్యయములందురు.

"తద్ధిత ప్రత్యయములు పరంబగునపుడు పదంబుల డువర్ణకాదులకు లోపంబగు"(ప్రౌఢ-తద్ధిత-1). అనగా - తద్ధిత ప్రత్యయములు పరమైనపుడు పూర్వ పదాంతముననున్న విభక్తి ప్రత్యయములకు లోపము కలుగును.

## 1. భావార్థక ప్రత్యయములు

1. అ) "తన వర్ణకంబు త్వార్థంబునందగు" (బాల-తద్ధిత-1)- త్వార్థమనగా భావము. "ప్రకృతిజన్యబోధంబునందు ప్రకారంబు భావంబు"- అనగా ప్రాతిపదికచే తెలుపబడు పదార్థమునందలి ధర్మము భావము. సంస్కృతమున ఇట్టి భావార్థ బోధనమున 'త్వ' ప్రత్యయము చేరును (రామత్వం; పాత్రత్వం). ఈ 'త్వ' ప్రత్యయము సంస్కృతమున ఏయర్థమున చేరునో, తెలుగున ఆ అర్థమున 'తన' ప్రత్యయముచేరునని సూత్రార్థము. ఉదా॥ రాముని తనము- రాముతనము; హనుమనితనము; సీతతనము; గొప్పతనము; నల్లఁదనము; పుల్లఁదనము.

ఆ) "తనవర్ణకంబు పరంబగునపుడు తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాషనగు" (ప్రౌఢ-తద్ధిత-2). అనగా- ఈ 'తన' ప్రత్యయము పరమైనప్పుడు తచ్ఛబ్దమునకు లోపము విభాషగానగును. ఉదా॥ ఆకొన్నతనము - ఓర్వలేనితనము (పెల్లాకొన్నతనాన-భీమ-2ఆ).

ఈవిధి విభాషకనుక లోపముకలుగనిచో-ఆకొన్నవానితనము; ఓర్వలేని దానితనము.

"ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకంబగు" (బాల-తద్ధిత-2). ఈ తద్ధిత పరిచ్ఛేదమున ముందుముందు విశేషముగా విధింపబడు ప్రత్యయములు, కొన్ని సామాన్య ప్రత్యయములకు విభాషగా బాధకములగును. అనగా- విశేషప్రత్యయములైన 'న' వంటివి ప్రత్యయములు చేరినప్పుడు (నల్లన-తెల్లన), సామాన్య ప్రత్యయములైన 'తనము' (నల్లఁదనము-తెల్లఁదనము) రాదు. అవి రానప్పుడు 'తనము' అనునదే వచ్చును.

2.అ) "చిన్నాదులకు ఱికవర్ణకంబగు" (బాల-తద్ధిత-3). చిన్న- కన్నె- చుట్టము- దొంగ- పేద- మిండ- లంజె- ఇత్యాదులు చిన్నాదులు. వీనికి భావార్థమున 'ఱికము' అను ప్రత్యయము కలుగును .ఉదా: చిన్నఱికము- కన్నెఱికము- చుట్టఱికము- పేదఱికము.

ఆ) "ఉత్వంబున కత్వంబు ఱికము పరంబగునపుడగు" (బాల-తద్ధిత-4). ఈ 'ఱికము' పరమగునపుడు పూర్వపదాంతమునందలి ఉత్వమునకు అత్వము వచ్చును. ఉదా: తొత్తఱికము (తొత్తు + ఱికము); వెజ్జఱికము (వెజ్జు + ఱికము).

3. " పేర్వాదుల కిమి వర్ణకంబగు" (బాల- తద్ధిత-5). పేరు- కడు- ముచ్చు- మేలు-చెలి - పోడి-వేడి- ఇత్యాదులు పేర్వాదులు. వీనికి భావార్థమున 'ఇమి' ప్రత్యయమువచ్చును. ఉదా: పేరిమి- కడిమి- ముచ్చిమి- మేలిమి- చెలిమి- పోడిమి- వేడిమి.

4. "నవర్ణకంబు గుణవచనంబులగు నల్లాదులకగు" (బాల-తద్ధిత-6). నల్ల- తెల్ల- ఎఱ్ఱ-తియ్య-కమ్మ- తిన్న-చక్క-వ్రేక- ఇత్యాదులు నల్లాదులు. వీనికి భావార్థమున 'న'వర్ణకము వచ్చును. ఉదా: నల్లన - తెల్లన- ఎఱ్ఱన- తియ్యన- కమ్మన- తిన్నన- చక్కన- వ్రేకన.

ఈ గుణవాచకములకు – బాల-తద్ధిత-1వ సూత్రమున 'తనము'విధింపబడినది. ప్రస్తుత సూత్రమున 'న'వర్ణకము విధింపబడినది. ఈ 'న'వర్ణకము వచ్చినప్పుడు 'తనము' రాదు (బాల-తద్ధిత-2).

5. "ఇక వర్ణకం బగ్గలాదుల కగు" (బాల-తద్ధిత-3). అగ్గలము- ఒమ్మ మొదలైనవి అగ్గలాదులు. వీటికి భావార్థమున 'ఇక'వర్ణకము కలుగును. ఉదా: అగ్గలిక- ఒమ్మిక(ఒమ్మ+ఇక=ఒమ్మిక)- ఇందలి మువర్ణము శబ్దగతమైనదేకాని, ప్రత్యయాత్మకమైనది కాదు. కనుక అది లోపించదు.

6. "మగటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు" (బాల-తద్ధిత-8). మగటిమి మొదలైన రూపములకు చేరిన ప్రత్యయములను ప్రయోగములను బట్టి తెలిసికొనవలెను. ఉదా: మగటిమి (మగ+టిమిజ్); మగతనము (మగ+తనము); పేదఱిమి (పేద+ఱిమి); కోటరము (కోడలు+టరము); చెలికారము (చెలి+కారము); నలుపు (నల్ల+పు); పసుపు(పచ్చ+పు).

7. "కరవర్ణకంబు నాయకశబ్దంబునకు భావంబునందగు" (ప్రౌఢ-తద్ధిత-11). నాయక శబ్దమునకు భావార్థమున కర ప్రత్యయము కలుగును. ఉదా: నాయకరము (నాయక+కరము).

8. "కారవర్ణకము చెలి నయములకు భావంబునందగు" (ప్రౌఢ-తద్ధిత-13). 'చెలి-నయము' అను శబ్దములకు భావార్థమున 'కారము' అని కలుగును. ఉదా: చెలికారము- నయగారము (మృదుత్వము).

9. "టివర్ణకం బొండు నంత్యవర్ణంబునకు భావంబునందగు" (ప్రౌఢ-తద్ధిత-15).

'ఒండు' శబ్దము చివరి అక్షరమునకు బదులుగా 'టి' అనునది భావార్థమున వచ్చును. ఉదా: ఒంటి.

ఇవి భావార్థక ప్రత్యయములు.

## 2. స్వార్థ ప్రత్యయములు

'ఇక, ఉక, కా, కత్తియ' వంటి ప్రత్యయములు కొన్ని స్వార్థమున చేరుచున్నవి. అనగా అట్టి ప్రత్యయములు చేరుట వలన అర్థమున మార్పేమియు కలుగదు.

1. "అరమరాదులకు స్వార్థంబునందిక వర్ణకంబగు"(బాల-తద్ధిత-9). అరమర- అల్లిబిల్లి -నడవడి- పొత్తి- నివ్వాళి- మెలి- ఇత్యాదులు అరమరాదులు. వీనికి స్వార్థమున 'ఇక' ప్రత్యయము కలుగును. ఉదా: అరమరిక- అల్లిబిల్లిక- నడవడిక- పొత్తిక- నివ్వాళిక- మెలిక.

2. "ఉక వర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునందగు" (బాల-తద్ధిత-10). చిఱుత- నెలత - పడతి- పొలతి- వెలది- ఇత్యాదులు చిఱుతాదులు. వీనికి స్వార్థమున 'ఉక' వర్ణకమగును. ఉదా: చిఱుతుక- నెలతుక- పడతుక- పొలతుక- వెలదుక.

3. "కాకత్తియులు కొండొకవానికి స్వార్థంబునం జూపట్టెడు" (బాల-తద్ధిత-13). పురుషబోధకమైన 'కా' ప్రత్యయమును, స్త్రీబోధకమైన 'కత్తియ'ప్రత్యయమును కొన్ని శబ్దములపైన (మతుబర్థముననే కాక) స్వార్థమునను చేరుచున్నవి. ఉదా: చెలికాడు- చెలికత్తియ; హెగ్గడికాడు- హెగ్గడికత్తియ.

4. " ఈ ప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునందగు" (బాల-తద్ధిత-16). 'ఈ' ప్రత్యయము కొన్ని పదములపైన (మతుబర్థముననే కాక) స్వార్థమునను చేరుచున్నది. ఉదా: మొక్కలీడు (మొక్కలి=వీరుడు); కల్లరీడు (కల్లరి).

5. "వేఱున కడ వర్ణకంబు స్వార్థంబునందగు" (ప్రౌఢ-తద్ధిత-6). 'వేఱు' అను పదమునకు స్వార్థమున 'అడ' వర్ణకమగును. ఉదా: వేఱడము.

6. "వెల్లి కడి వర్ణకంబు స్వార్థంబునందగు" (ప్రౌఢ-తద్ధిత-7). 'వెల్లి' అను పదమునకు ప్రాతిపదికార్థమున 'అడి' వర్ణకమగును. ఉదా: వెల్లడి.

7. "తెలివి విరివి వినికి లేమి రాపులకు స్వార్థంబునం దిడి వర్ణకంబగు" (ప్రౌఢ-తద్ధిత-8). 'తెలివి, విరివి, వినికి, లేమి, రాపు'అనువానికి స్వార్థమున 'ఇడి' వర్ణకమగును. ఉదా: తెలివిడి- విరివిడి- వినికిడి- లేమిడి- రాపిడి.

8. "ఇతవర్ణకం బింపు బిగు పోరులకు స్వార్థంబునందగు" (ప్రౌఢ-తద్ధిత-9). 'ఇంపు,బిగు, పోరు' లకు స్వార్థమున 'ఇత' వర్ణకమగును. ఉదా: ఇంపితము- బిగితము- పోరితము.

9. "ఇదవర్ణకం బొప్పు తప్పు పెల్లులకు స్వార్థంబునందగు" (ప్రౌఢ-తద్ధిత-10). 'ఒప్పు, తప్పు, పెల్లు' లకు స్వార్థమున 'ఇద' వర్ణకమగును. ఉదా: ఒప్పిదము- తప్పిదము- పెల్లిదము. ఇట్లే- క్రొవ్విదము- బెట్టిదము.

10. "స్వార్థమునం దిరి వర్ణకంబు వాపునకగు" (ప్రౌఢ-తద్ధిత-11). 'వాపు' శబ్దమునకు స్వార్థమున 'ఇరి' వర్ణకమగును. ఉదా: వాపిరి.

11. "కారవర్ణకంబు నుడి కొలతలకు స్వార్థంబునందగు" (ప్రౌఢ-తద్ధిత-13). 'నుడి, కొలత' శబ్దములకు స్వార్థమున 'కార' వర్ణకమగును. ఉదా: నుడికారము- కొలగారము.

12. "చలికి మిరి వర్ణకంబు స్వార్థంబునందగు" (ప్రౌఢ-తద్ధిత-14). 'చలి' అను శబ్దమునకు స్వార్థమున 'మిరి'వర్ణకమగును. ఉదా: చలిమిరి.

ఇవి స్వార్థ ప్రత్యయములు.

## 3. మతుబర్థక ప్రత్యయములు

సంస్కృత పదములపైన 'మతుప్' ప్రత్యయము 'కలిగియుండువాడు-కలిగియుండునది' అను అర్థమున కలుగుచున్నది. వీనిని మతుబర్థములందురు. ఆ అర్థమున తెలుగున చేరు ప్రత్యయములు ఇందు చెప్పబడుచున్నవి.

1.అ) "కాకత్తియ వర్ణకంబులు పుంస్త్వ స్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదులకగు"(బాల-తద్ధిత-11). ఆట- అడపము- ఒయారము- చెలిమి- తిండి- బేరము- విలు- సొగసు- ఇత్యాదులు ఆటాదులు. వీనికి మతుబర్థమున పురుష బోధకములైనచో 'కా' ప్రత్యయమును, స్త్రీబోధకమైనచో 'కత్తియ' ప్రత్యయమును కలుగును. ఉదా॥ ఆటకాడు- ఆటకత్తియ; అడపకాడు- అడపకత్తియ; బేరకాడు- బేరకత్తియ; చెలికాడు- చెలికత్తియ.

వీనిలోని 'కత్తియ'కు బదులు 'కత్తె' అనునది- "ఇయకుమాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు" (బాల-అచ్చిక-23) అన్న సూత్రము ప్రకారము రావచ్చును. అప్పుడు - ఆటకత్తియ- ఆటకత్తె; చెలికత్తియ- చెలికత్తె; సొగసు కత్తియ- సొగసుకత్తె.

ఆ) "కాకత్తియల కకారంబునకు గకారంబు కొండొకచో గానంబడియెడి"(బాల-తద్ధిత-12). పైన చెప్పిన 'కా, కత్తియ' ల 'క' కారమునకు కొన్నియెడల 'గ' కార వచ్చును. ఉదా॥ అందగాడు- అందగత్తియ; కొండెగాడు- కొండెగత్తియ; బేరగాడు- బేరగత్తియ.

2. "అటమటాదులకు మతుబర్థంబునం దీవర్ణకంబు పుంస్త్వంబునందగు" (బాల-తద్ధిత-15). అటమటము- కన్నడము -కొండెము- బూటకము- సుంకము- ఇత్యాదులు అటమటాదులు. వీనికి మతుబర్థమున, పురుష వాచకమైనప్పుడు 'ఈ' ప్రత్యయము కలుగును. ఉదా॥ అటమటీడు- కన్నడీడు- కొండీడు- బూటకీడు- సుంకీడు.

3.అ) "అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదులకగు" (బాల-తద్ధిత- 17). జాలి- కల్ల- చదువు- జూదము -టక్కు- తెరువు- నేర్పు- ఇత్యాదులు జాలాదులు. వీనికి మతుబర్థమున 'అరి' వర్ణకమగును. ఉదా॥ జాలరి - కల్లరి- చదువరి- జూదరి- టక్కరి- తెరువరి- నేర్పరి.

ఆ) "మతుబర్థంబునం దరివర్ణకము పరంబగునపుడు పూజ సొన్నముల కడయచ్చునకు వైకల్పికముగాను నిత్యముగాను దీర్ఘంబగు" (ప్రౌఢ- తద్ధిత-7)- మతుబర్థమున 'అరి' వర్ణకము పరమగునప్పుడు 'పూజ' శబ్దము చివరి అచ్చునకు దీర్ఘము వైకల్పికముగను, 'సొన్న' శబ్దము చివరి అచ్చునకు దీర్ఘము నిత్యముగను వచ్చును. ఉదా॥ పూజారి- పూజరి; సొన్నారి.

4. "ఇవర్ణకం బోయారాదులకు మతుబర్థంబునందగు" (బాల-తద్ధిత-15). ఓయారి- కడలు- చాగము- జోగము- బిత్తరము- బేహారము- మిటారము- ఇత్యాదులు ఓయారాదులు. వీనికి మతుబర్థమున 'ఇ' ప్రత్యయమగును. ఉదా॥ ఓయారి- కడలి- చాగి- జోగి- బిత్తరి- బేహారి- మిటారి.

5.అ) "తవర్ణకంబు కుల వాచకంబునకు స్త్రీవాచ్యంబగునపుడు మతుబర్థంబునందగు" (బాల-తద్ధిత-19). కులబోధకమైన స్త్రీవాచక శబ్దమునకు మతుబర్థమున 'త' వర్ణకమగును. చాకి- బోయ- వ్రే- సాలె- ఇత్యాదులు కుల వాచకములు. ఉదా॥ చాకిత- బోయత- వ్రేత- సాలెత.

ఆ) "మతుబర్థంబునం జెంచునకు దవర్ణకంబు పరంబగుచో నిత్వంబునగు" (ప్రౌఢ- తద్ధిత-4). కులవాచకమైన చెంచుశబ్దమునకు మతుబర్థమున 'త' వర్ణకమగును. అప్పుడు దాని చివరి యచ్చునకు ఇత్వంబు కూడనగును. ఉదా॥ చెంచిత (చెంచు+ఇ+త)- (భాగ- 10స్క. పూ). దీనికి జానపదుల పాటలలో దీర్ఘమును కన్పించును- చెంచీత.

ఇ) ఈ 'త' వర్ణకము కుల వాచకములపైనే కాక, కొన్ని ఇతర పదముల పైనను కన్పించుచున్నది (బాల-తద్ధిత-21). ఉదా॥ గుబ్బెత (యువతి); మిండత (విటి); ముట్టుత (రజస్వల).

6. "వగాదులకు బహువచనాంతంబులకు మత్వర్థంబునం దాడివర్ణకంబగు" (బాల-తద్ధిత-22). వగ- చిన్నె- కులుకు- వన్నె- దొమ్మి- ఇత్యాదులు వగాదులు. ఇవి స్త్రీ బోధకములై బహువచనాంతములుగా నున్నప్పుడు, వానికి 'ఆడి' ప్రత్యయమగును. ఉదా॥ వగలాడి (వగ+లు+ఆడి). ఇట్లే-చిన్నెలాడి- కులుకులాడి- వన్నెలాడి-దొమ్మలాడి.

7. "వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బాకారంబగు" (బాల-తద్ధిత-23). బహువచనాంతములైన వగాదులు పుంలింగబోధకములైనప్పుడు, మతుబర్థమున 'ఆ' వర్ణకమగును. ఉదా॥ వగలాడు (వగలు+ఆ+డుఁ); ఇట్లే- చిన్నెలాడు- కులుకులాడు- వన్నెలాడు- దొమ్మలాడు.

8. "చెడుగు దుడుకు నిడుపులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బకారంబగు" (ప్రౌఢ-తద్ధిత-5). చెడుగు- దుడుకు- నిడుపు- అను శబ్దములు పుంలింగ బోధకములైనప్పుడు మతుబర్థమున 'అ' అను ప్రత్యయము కలుగును. ఉదా॥ చెడుగడు(చెడుగు+అ+డుజ్=క్రూరుడు); దుడుకడు (ఉద్ధతుడు); నిడుపడు (పొడుగువాడు).

9. "ముక్కులోనగువానికిం దదభావద్యోతకంబయి మతుబర్థంబునం దిఁడివర్ణకంబగు" (బాల-తద్ధిత-24). ముక్కు- వాలు- వెరవు- సిగ్గు- ఇత్యాదులకు తదభావద్యోతకముగా మతుబర్థమున 'ఇఁడి' వర్ణకమగును. ఉదా॥ ముక్కిడి- వాలిడి- వెరవిడి- సిగ్గిడి.

ఈ 'ఇడి' ప్రత్యయము స్త్రీపురుషోభయవాచకము-ముక్కిడి అనగా ముక్కులేనివాడు/ ముక్కులేనిది.

10. "ఇద వర్ణకంబు క్రొవ్వు బెట్టులకు మతుబర్థమునందగు" (ప్రౌఢ-తద్ధిత-10). క్రొవ్వు, బెట్టులకు మతుబర్థమున 'ఇద' వర్ణకమగును. ఉదా॥ క్రొవ్విదము- బెట్టిదము.

11. "అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులను మహత్ప్రయోగంబుల నెఱుంగునది" (బాల-తద్ధిత-28). ఇంకను వేరువేరర్థములను తెలుపు తద్ధిత ప్రత్యయములను పెద్దల ప్రయోగములను బట్టి తెలిసికొనవలెను.

అ) తాచ్ఛీల్యమున (స్వభావమును తెలుపు అర్థమున) 'మారి,పోతు' ప్రత్యయములు వచ్చును. ఉదా॥ మంటమారి- తిండిపోతు.

ఆ) మతుబర్థమున 'అ' ప్రత్యయము- ఉదా॥ అడప (అడపము+అ= తాంబూలకరండవాహిని).

ఇ) 'పెండ్లి' శబ్దమునకు మతుబర్థమున 'అము' ప్రత్యయము- ఉదా॥ పెండ్లము (పెండ్లి+అము).

ఇవి మతుబర్థక ప్రత్యయములు.

## 4. పరిమాణ- దఘ్న-ప్రాచుర్యార్థకములు

పరిమాణ- దఘ్న- ప్రాచుర్యార్థములను తెలుపు పదములపై కొన్ని తద్ధిత ప్రత్యయములు కలుగుచున్నవి. అవి ఇందు వివరింపబడినవి.

1 అ) "మానార్థంబున కేకత్వంబునం దెడు వర్ణకంబగు" (బాల-తద్ధిత-25). పరిమాణార్థక శబ్దము ఏకత్వబోధకమైనప్పుడు 'ఎడు' వర్ణకమగును. ఉదా॥ తూమెడు- ముంతెడు- వీసెడు- జానెడు- మూరెడు.

ఆ) "ఎడు వర్ణకంబు పరంబగునపుడు లివర్ణంబు లోపించు" (బాల-తద్ధిత-26). అనగా- పరిమాణార్థకమైన 'ఎడు' వర్ణకము పరమగునప్పుడు పూర్వపదాంతమున నున్న 'లి' వర్ణములోపించును. ఉదా॥ దోసెడు (దోసిలి+ఎడు). ఇట్లే- పిడికెడు- పుడిసెడు.

ఇ) "పరిమాణార్థంబునం బ్రథమైకవచనంబునంద యెడు వర్ణకంబగు" (ప్రౌఢ-తద్ధిత-16). అనగా- పరిమాణార్థకమై, ప్రథమైకవచనమునందున్న శబ్దముపైననే 'ఎడు' వర్ణకముకలుగును. ఉదా॥ మూరెడు తోక- తూమెడు బియ్యము.

2 అ) "దఘ్నార్థంబున బంటి కొలదులగు" (బాల- తద్ధిత-27). అనగా- లోతును తెలుపుటకు సంస్కృతమున ఎచట 'దఘ్నచ్' ప్రత్యయము వచ్చునో (జానుదఘ్నం), అచ్చట తెలుగున 'బంటి, కొలది' అను ప్రత్యయములు వచ్చును ఉదా॥ మోకాలిబంటి- మోకాలికొలది; తొమ్ముబంటి- తొమ్ముకొలది.

ఆ) "దఘ్నార్థంబునం దత్సమపదంబుల మీదను బంటి కానంబడియెడి" (ప్రౌఢ-తద్ధిత-17). అనగా- పై 'బంటి' ప్రత్యయము తత్సమపదములపైనను కన్పించుచున్నది. ఉదా॥ కటిబంటి కాలువల్ (రామా-8ఆ).

3. "ప్రాచుర్యార్థంబునం దెలుగుపదంబుల మీదను మయట్ప్రత్యయము చూపట్టెడి" (ప్రౌఢ-తద్ధిత-18). అనగా- ప్రాచుర్యార్థమును తెలుపు 'మయట్' అను సంస్కృత ప్రత్యయము, తెలుగు పదములపైనను కలుగుచున్నది. ఉదా॥ తన మయము (ఉ.హరి-3ఆ). తమ మయము (నిర్వ-6ఆ); ప్రోవుల మయము (హరి.-ఉ.-10ఆ).

ఇవి పరిమాణ-దఘ్న- ప్రాచుర్యార్థక తద్ధిత ప్రత్యయములు.

# IX. క్రియా పరిచ్ఛేదము

## 1. క్రియానిరూపణము

క్రియా విభక్తులు చేరని ప్రాతిపదికరూపమును ధాతువందురు. అట్టి ధాతువునకు–

1. "వర్తమానంబున లట్టగు" (బాల–క్రియా–2). అనగా – ధాతువునకు వర్తమానార్థమున లట్టగును. వర్తమానమనగా ప్రారంభింపబడి పరిసమాప్తము కానిదని అర్థము.

2. "భూతంబున లిట్టగు" (బాల–క్రియా–3). అనగా – భూతకాలమునందు ధాతువునకు లిట్టగును. భూతమనగా విద్యమాన ధ్వంస ప్రతియోగి – ముందుండిఅప్పటికి పుట్టకుండునది.

3. "భావిని ల్పట్టగు" (బాల – క్రియా – 4). అనగా – భవిష్యత్కాల ధాతువునకు 'ల్పట్' ప్రత్యయము కలుగును. భావియనగా విద్యమాన ప్రాగభావ ప్రతియోగి – అప్పటికి పుట్టకుండునది.

4."తద్ధర్మాదులందు లాట్టగు" (బాల–క్రియా–5). తద్ధర్మార్థమనగా ధాతువు యొక్క అర్థమున తెలుపునది. అనగా – ప్రత్యేకముగా ఏకాలమును సూచింపక అన్నికాలములకు బోధకముగుదని భావము. సూత్రమున 'తద్ధర్మాదులు' అని చెప్పుట వలన 'ఆది' పదముచేత – తచ్ఛీలము, సంభావన, సంప్రశ్నము, సాతత్యము, వర్తమానము, భావి, ఆశీస్సు మున్నగు వానిని కూడ గ్రహింపవలయును. తచ్ఛీలమనగా ధాతువు యొక్క స్వభావము. సంభావనమనగా ఊహ. సంప్రశ్న మనగా ప్రశ్నించుట. సాతత్యమనగా ఎల్లప్పుడు నుండుట. వర్తమానముగా జరుగుచున్నది. భావి యనగా అప్పటికి పుట్టనిది. ఆశీస్సనగా దీవెన. ఇవికాక శాపమును కూడ గ్రహింపవచ్చును. ఈ అర్థములలో లాట్టగును.

5 "ఆశీ శ్శాప సంప్రార్థన విధులందు లూట్టగు" (బాల–క్రియా –6). అనగా ఆశీస్సు, శాపము, సంప్రార్థన, విధి (ఆజ్ఞాపించుట) అనువానిని బోధించు ధాతువులకు 'లూట్' ప్రత్యయ మగును.

6. "వ్యతిరేకంబున లజీ యగు" (బాల–క్రియా–7). అనగా వ్యతిరేకార్థక ధాతువునకు 'లజీ' ప్రత్యయమగును.

## 2. సమాపక క్రియలు

### ఏ) వర్తమానము (లట్)

1. " లకారంబునకు డు ౙు వు రు ను ము ఙ్గ గు" (బాల-క్రియా-8). అనగా- పైన చెప్పిన లట్, లిట్, ల్ృట్, లాట్, లూట్, లజీ అను షడ్విధ లకారములను బోధించు ధాతువులకు 'డు -రు, వు-రు, ను-ము' అను క్రియా విభక్తులు ప్రథమ-మధ్యమ-ఉత్తమ పురుష బోధకములై చేరును. ఇవి క్రియలపై చేరునవి కావున క్రియావిభక్తులనియు, ప్రథమ - మధ్యమ - ఉత్తమ పురుషలపై చేరునవి కావున పురుష ప్రత్యయములనియు వ్యవహరింపబడును.

2. " అందు వరుసను రెండేసి ప్రథమ మధ్య మోత్తమంబులనంబడును" (బాల-క్రియా-9). అనగా - పైన చెప్పిన పురుషప్రత్యయములలో 'డు-రు' అనునవి ప్రథమ పురుషక్రియాపదములకును (కలడు కలరు), 'వు-రు' లు మధ్యమపురుషక్రియా పదములకును (కలవు-కలరు), 'ను-ము'లు ఉత్తమపురుషక్రియా పదములకును (కలను-కలము) చివర చేరును.

3. "వానిలో రు-ము లు బహువచనంబులు; పెఱ లేకవచనంబులు" (బాల-క్రియా-10). అనగా -పైన చెప్పిన ప్రత్యయములలో 'రు-ము' అనునవి బహుత్వమును బోధించునవి. మిగిలిన 'డుఙ్, వు,ను' అనునవి ఏకత్వమును బోధించునవి.

4. " నామ యుష్మ దస్మదర్థంబులందుం బ్రథమ మధ్య మోత్తమంబులగు" (బాల-క్రియా-11). అనగా- నామము కర్తగా నున్నప్పుడు దాని క్రియను ప్రథమ పురుష యనియు, యుష్మదర్థము కర్తయైనపుడు దాని క్రియను మధ్యమపురుషయనియు, అస్మదర్థకము కర్తయైనపుడు దాని క్రియను ఉత్తమ పురుష యనియు అందురు.

5. "అమహదర్థంబునందు డు ౙులకు దువు లగు; ఉన్నానుబంధంబుమీది దివియగు"(బాల-క్రియా-12). అనగా - అమహత్తును బోధించునపుడు డుజ్వర్ణకమునకు బదులుగా 'దు' అనియు (కలదు), 'రు' వర్ణకమునకు బదులుగా 'వు' అనియు (కలవు) అగును. ధాతువు పైన 'ఉన్న' అను అనుబంధము చేరినపుడు దానిమీది ఏకత్వమున 'ది' అనియు (వచ్చుచున్నది), బహుత్వమున 'వి' అనియు (వచ్చుచున్నవి) అగును.

6. అ) "ఉదంతంబునకు లట్టు పరంబగునపు డున్నానుబంధం బగు" (బాల-క్రియా-13). అనగా ఉదంతమైన ధాతువునకు లట్టు పరమగునపుడు 'ఉన్న' అను శబ్దము అనుప్రయుక్తమగును (చేయు +ఉన్న).

ఆ) "ఉన్నశబ్దంబు పరంబగునపుడు చువర్ణకం బగు" (బాల-క్రియా-14). అనగా--ఉన్న అను శబ్దము పరమగునపుడు ధాతువునకు'చు' ప్రత్యయము కలుగును (చేయు +చు+ఉన్న).

ఇ) " దివీతరంబగు డుజ్ఞు పరంబగునపుడున్నానుబంధంబునకు దీర్ఘంబగు" (బాల-క్రియా-15). అనగా- 'ది-వి' అనునవికాక మిగిలిన పురుష ప్రత్యయములు పరమగునపుడు 'ఉన్న' అను అనుబంధమునకు దీర్ఘమగును (వండు+చు+ఉన్నా).

వీనిపై పురుషప్రత్యయములు కలుగగా- వండుచున్నాడు - వండుచున్నారు- వంటి రూపములు కలుగును.

7. "ఉన్న శబ్దంబు పరంబగునపుడు ఉండు ధాతువునకు లోపంబగు" (బాల-క్రియా-56). అనగా 'ఉన్న' అను శబ్దము పరమగునపుడు పూర్వమున్న 'ఉండు' అనుధాతు వంతటికిని లోపము కలుగునని అర్థము . ఇచ్చట 'ఉండు' శబ్దమునకు లోపముకలుగగా దానికి అనుబంధముగా విధింపబడిన 'చు' ప్రత్యయమును లోపించును. కాగా - ఉన్న +అ+డు = ఉన్నాడు - అని అగును.

8. అ). "క్రియాఫలంబు కర్తృగామి యగుచో గొనుధాతు వనుప్రయుక్తంబగు" (బాల-క్రియా-52). అనగా- క్రియాఫలము కర్తకు చెందినచో, ధాతువునకు 'కొను' అనునది అనుప్రయుక్తమగును. ఇదియే ఆత్మనే పదార్థమని చెప్పబడును. ఉదా: వండుకొనుచున్నాడు.

ఇట్లు వర్తమానార్థక క్రియ లేర్పడుచున్నవి.

## బి). భూతము (లిట్)

1. "లిడ్లాట్టుల డుజ్ఞున కెను ను వర్ణకంబు లగు" (బాల-క్రియా-16). అనగా- భూతకాలమునందు (లిట్) ధాతువునకు చేరు డుజ్ఞునకు బదులు 'ఎను' వర్ణకమును (వచ్చెను), తద్ధర్మాదులందు (లాట్) చేరు డుజ్ఞునకు బదులు 'ను' వర్ణకమును (వచ్చును) కలుగును.

2. "భూతంబునం దిగాగమ ంబగు" (బాల-క్రియా-17). అనగా - భూతార్థకమైన ధాతువునకు ఇగాగమ మగును (ఉదా: వండితిని - వండితివి - వండిరి).

3. "లిట్ పుజ్ఞ పరంబగు నపుడు తివర్ణకం బగు" (బాల-క్రియా-18). అనగా- భూతకాలికమైన పుజ్ఞ (వు - రు - ను - ము ) పరమగునపుడు ధాతువునకు 'తి' వర్ణకమగును. ఉదా: వండితివి - వండితిరి - వండితిమి.

4. " తిర్యగ్జడంబులు వాచ్యంబులగునపుడు లిడ్లాట్టుల ప్రథమ బహువచనంబున కేకవచనం బగు" (బాల-క్రియా-25). అనగా - తిర్యక్కులను జడములను క్రియా పదములు చెప్పినప్పుడు, లిట్- లాట్టుల ప్రథమ పరుష బహువచనమునకు ఏకవచన మగునని అర్థము. ఉదా: చిలుకలు వలికెను - చిలుకలు వలుకును; మేఘములు గర్జిల్లెను- మేఘములు గర్జిల్లును.

5. అ) "ఇకార వక్రంబులందలివి పరంబులగుచో యాకు సకారంబగు" (బాల-క్రియా-54). అనగా - ఇకారము కాని ఎత్వము కాని పరమగునపుడు ధాతువుచివరి యకారమునకు సకారమగును. ఉదా: చేసిరి - చేసెను.

ఆ) "అగు పోవుల కడవ్రాల కిద్వక్రంబులు పరంబులగునపుడు యకారంబగు" (బాల-క్రియా-99). అనగా - ఇత్వమును ఎత్వమును పరమగునపుడు అగు, పోవు అను ధాతువుల తుది యక్షరమునకు యకారము ఆదేశమగును. ఉదా: అయిరి - పోయిరి; పోయెను.

వీనిలో ఇకార ఎకారములకు పూర్వమందున్న యకారమునకు సకారము వచ్చుట లేదు. కారణము ఇది ప్రత్యేకముగ విధింపబడిన యకారము.

ఇట్లు భూతకాలిక క్రియ లేర్పడుచున్నవి.

## సి) భవిష్యత్ (ల్పట్)

1.అ) "కలజ్యనుబంధంబు ల్పట్ పరంబగునపు డగు" (బాల-క్రియా-19). అనగా ల్పట్ పరంబగునపుడు ధాతువునకు 'కలజీ' అనునది అనుప్రయుక్తమగును- వండు +కలజీ.

ఆ) "జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు" (బాల-క్రియా-20). 'జి' అనునది ఇత్తుగా కలది జీత్తు. కలజి శబ్దము జీత్తు కావున అది పరమైనపుడు ధాతువు యొక్క ఉత్వమునకు అత్వమగును - వండ +కల.

ఇ) "కలజి పడుజులు పరంబగునపుడు నుగాగమం బగు" (బాల-క్రియా-21). అనగా - 'కలజి - పడుజు' అను అనుబంధములు పరములగునపుడు నుగాగమ మగును. అప్పుడు ద్రుత కార్యము జరిగి - వండఁగలడు - వండఁగలరు; వండఁబడదు- వండఁబడవు -అను రూపము లేర్పడును.

ఇట్లు భవిష్యదర్థక క్రియలు ఏర్పడుచున్నవి.

## డి) తద్ధర్మాదులు (లాట్టు)

1. "లాట్టు డుఙ్మనకు ను వర్ణకంబగు" (బాల-క్రియా-16). అనగా - లాట్టు పరంబగునపుడు డుఙ్మనకు 'ను' అనునది ఆదేశమగును. ఉదా॥ వచ్చును; వండును.

2. " లాట్టు రు ఙ్మ పరంబగు నపుడు దుగాగమంబగు" (బాల-క్రియా-22). అనగా – తద్ధర్మార్థకములగు రు–వు–రు–ను–ము (రు ఙ్మ) పరమగునపుడు ధాతువునకు 'దు' వర్ణకము ఆగమ మగును. ఉదా॥ ప్ర॥ వండుదురు. మ॥ వండుదువు - వండుదురు; - ఉ॥ వండుదును - వండుదుము.

3. " లాట్టు రు ఙ్మ పరంబగునపు డెదగాగమంబు నువర్ణకంబు పరంబగునపుడు డెడు గెడిగాగమంబులును బహుళంబుగా నగు" (బాల-క్రియా-23). అనగా- తద్ధర్మాదులందు వచ్చు లాట్టునకు ను వర్ణకము పరమైనపుడు ఎడు గెడిగాగమములును, రుఙ్మ పరమగునపుడు ఎదగాగమమును అనుగు. ఉదా॥ ప్ర॥ వండెడును - వండెడిని - వండెదరు; మ॥ వండెదవు - వండెదరు; ఉ॥ వండెదను - వండెదము.

4. " లిఙ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు" (బాల-క్రియా-24). అనగా - భూత - తద్ధర్మాదులందు మధ్యమ పురుషైకవచనమునకు వచ్చు 'వ' కారమునకు లోపంబు విభాషగా వచ్చును. ఉదా॥ వండితి - వండితివి; వండుదు - వండుదువు ; వండెదు - వండెదవు.

5. "తిర్యగ్జడంబులు వాచ్యంబులగునపుడు లిఙ్లాట్టుల ప్రథమ బహువచనంబున కేకవచనంబగు" (బాల-క్రియా-25). అనగా - తిర్యక్కులును జడములును

చెప్పబడినపుడు లిట్, లాట్టుల ప్రథమపురుష బహువచనమునకు ఏకవచనమగును. ఉదా॥ చిలుకలు పలికెను – చిలుకలు పలుకును – చిలుకలు పలికెడును; మేఘములు గర్జిల్లెను – మేఘములు గర్జిల్లును – మేఘములు గర్జిల్లెడును.

6. "తద్ధర్మార్థక విశేషణం బసహాయతం త్రికాలవాచి యగు" (ప్రౌఢ-క్రియా-1). అనగా – తద్ధర్మార్థక ధాతుజ విశేషణము ఇతర పదముల సహాయము లేని యెడల మూడు కాలములను బోధించును. ఉదా॥ వర్తమానము – వారి యనునయించు సితకృష్ణతంతురాజి తతంత్రమది (భార–ఆది–1ఆ) (అనునయించు = అనునయించుచున్న). భూతము – మార్తాండతనయుండు తొడరి మనకు జేయుదుండగములు (జై.భా–1ఆ) (చేయు = చేసిన) భవిష్యత్తు – జనమేజయు చేయు సర్పయాగమున (భార. –ఆది. 1ఆ) (చేయు = చేయగల).

7.అ) "తద్ధర్మ భూత క్రియ లార్యార్థ పరకంబులై ప్రశ్నార్థకంబులగు" (ప్రౌఢ–క్రియా–3). అనగా ఆర్యార్థకములైన అయ్య, అమ్మ, అన్న వంటి పదములు పరమందున్నపుడు భూత తద్ధర్మార్థక క్రియలు ప్రశ్నార్థకము అగునని అర్థము. ఉదా॥ పంచితయ్య (భార – సభా–1ఆ). దీనికి – పంపితివా? అని అర్థము. సన్మానితులై వర్తింతురయ్య (భార–సభా.–1ఆ). దీనికి వర్తించుచున్నారా? అని అర్థము.

ఆ) "ఒక్కొకచో తద్ధర్మక్రియ యార్యార్థపరకంబై వ్యతిరేకవ్యంజక ప్రశ్నార్థకంబగు" (ప్రౌఢ–క్రియా–4). అనగా – ఒక్కొకచోట తద్ధర్మార్థక క్రియ ఆర్యార్థ పరకమైనపుడు వ్యతిరేకార్థమును స్ఫురింపజేయు ప్రశ్నార్థకమగునని అర్థము. ఉదా॥ సురాంగన లెల్ల నిట్టి నీ చేతకు మెత్తురమ్మ (మను – 3 ఆ). ఇచ్చట 'మెత్తురా?' అన్న ప్రశ్నవాచకమునకు 'మెచ్చరు' అన్న వ్యతిరేకార్థము స్ఫురించును.

ఇట్లు తద్ధర్మాదులు ఏర్పడుచున్నవి.

## ఇ) ఆశీశ్శాప సంప్రార్థన విధులు (లూట్టు)

1. "లూట్టు డుజ్ఞున కెడు త వర్ణంబులు ద్రుతాంతంబులగు" (బాల–క్రియా–26). అనగా– ఆశీశ్శాప సంప్రార్థన విధులందు వచ్చు డు – రు, వు– రు, ను– ము (డు జ్ఞు)లకు బదులు ద్రుతాంతములైన 'ఎడు', 'త' ప్రత్యయములు కలుగును. ఉదా॥ ఆశీస్సు॥ మీకు మేలు కలిగెడును – మీకు మేలు కలుగుతను. శాపము॥ నీకు

రాక్షసత్వంబు గలిగెడును - నీకు రాక్షసత్వంబు గులుగుతను. సంప్రార్థనము: హరి గృపగాంచెడును - హరి నను గృపగాంచుతను.

2. "విధియందు లూట్టునకు మారుగా నది యను తచ్ఛబ్దంబును ము నుగాగమంబు నగు" (బాల-క్రియా-27). అనగా - విధియందు లూట్టునకు బద 'నుగాగమ' యుక్తమైన 'అది' అను శబ్దము కలుగును. ఉదా: మైత్రుడు నా నిర్దిష్ట కార్య చేయునది.

3. "ఎడు త ల ద్రుతంబున కచ్చు పరంబగునపుడు మకారంబగు" (బా క్రియా - 28). అనగా - ఆశీరాద్యర్థకములైన 'ఎడు, త్' ల ద్రుతమునకు అ పరమగునపుడు 'మ' కార మాదేశమగును. ఉదా: నీకు మేలు కలిగెడు మని (కలిగెడున్ + అనియె); నీకు మేలు కలుగుత మనియె (కలుగుతన్+అనియె).

4. "లూణ్మధ్యము వు రు లకు ముడు ఙ్జు లగు" (బాల-క్రియా-29). అన ఆశీరాద్యర్థకములందు వచ్చు లూట్ మధ్యమ పురుష ప్రత్యయములైన 'వు-రు'ల బదులు 'ము-డుజ్' అను వర్ణకములు వచ్చును. ఉదా: ఆశీస్సు: దీర్ఘాయువగుము దీర్ఘాయుల రగుడు. శాపము: రాక్షసుడ వగుము - రాక్షసుల రగుడు. సంప్రార్థన నన్ను రక్షింపుము - నన్ను రక్షింపుడు. విధి : నా చెప్పిన పని చేయుము - నా చెప్పి పని చేయుడు.

5. " ఉభయ ప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు" (బాల-క్రియ 30). అనగా - ఉభయార్థకమైన 'మనము' అను దానికి ప్రార్థనార్థమున (బాల-క్రియ 22 చే) ఆగమమయిన 'దు' వర్ణము యొక్క ఉత్వమునకు అత్వమగును. ఉ మనము వందుదము.

6. అ) "మధ్యమ ముడుఙ్జులు ముఙ్జునా బడు" (బాల-క్రియా-31). అ లూట్ పరమగునపుడు మధ్యమ పురుషయందగు 'వు-రు'లకు బదులు 'ము-డు' వచ్చును. అట్లు వచ్చిన 'ము-డు' లను రెంటిని కలిపి 'ముఙ్జు' అనబడును.

ఆ) సంప్రార్థనంబుల ముఙ్జున కదాదులు విభాష నను ప్రయుక్తంబు ల (బాల-క్రియా - 33). అనగా -సంప్రార్థనమునందు వచ్చు మధ్యమపురుష ముడుఙ్జులకు 'అ-ఆ' మొదలగునవి విభాషగా అనుప్రయుక్తములగును. ఉదా: వందు (అ) - వందుమా (ఆ) - వందుమి (ఇ) - వందుమీ(ఈ).

7. "ఏదాదు లనుప్రయుక్తంబులగునపుడు ముజ్జునకు వుజీ రుజీ యగు " (బాల-క్రియా-34). 'ఏ, ఏ, ఒ, ఓ, అమ్మ, అయ్య' మున్నగునవి ఏదాదులు. ఇవి పరములగునపుడు మధ్యమపురుష మువర్ణమునకు వుజీయు, డుజ్జునకు రుజీయు నగు. వినకువె - వినకువే; వినకురె - వినకురే.

8. "ప్రార్థనమునం దన్ప్రయాంత క్రియాల మీద గద కదవు పూర్వకంబు లన్నాదు లనుప్రయుక్తంబులగు" (ప్రౌఢ-క్రియా-9). అనగా - ప్రార్థనార్థమున అన్ ప్రత్యయాంతములైన క్రియారూపములపైన 'కద-కదవు' అను పదములను పూర్వమందు కలిగిన 'అన్న' మొదలగు పదములు అనుప్రయుక్తము లగును. ఉదా॥ ప్రోవ గదన్న - ప్రోవగదవన్న; ప్రోవగదయ్య - ప్రోవగదవయ్య; ప్రోవగదమ్మ - ప్రోవగదవమ్మ; ప్రోవగదే - ప్రోవగదవే.

ఇట్లు ఆశీ శ్శాప సంప్రార్థన విధి రూపము లేర్పడుచున్నవి.

## ఎఫ్) వ్యతిరేకము (లజీ)

1. "వ్యతిరేకక్రియ అర్థత్రయబోధకంబగు" (ప్రౌఢ-క్రియా-8). అనగా - వ్యతిరేకార్థకమైన క్రియ భూత భవిష్యత్ వర్తమాన కాలములు మూడింటిని బోధించునది అగును. ఉదా॥ వర్తమానము॥ పాఱడు లేచి దిక్కులకు (భాగ-8స్కం) (పాఱడు = పాఱుచున్నవాడు కాడు). భూతము ॥ ఱెక్కలు రావు పిల్లలకు (భాగ-7స్కం) (రావు= వచ్చినవి కావు). భవిష్యత్తు ॥ "నలుని కాని నళినదళనేత్ర వరియంపదట్టె" (భార-అర-2ఆ) (వరియింపదు= వరియించునది కాదు).

ఇక్కడ- వ్యతిరేక క్రియ త్రికాలములకు బోధకముగానున్నది. అందువలన 'అర్థత్రయబోధకము' అనుటకన్న, 'కాలత్రయబోధక' మనుట సముచితము అన్న సూర్యశ్రీ గారి అభిప్రాయము సముచితముగా నున్నది (బాల-ప్రౌఢ-వ్యాఖ్య-II-పు. 257).

2. "వ్యతిరేకంబున ముజ్జు పరంబగునపుడు కుజీ యగు" (బాల-క్రియా-72). అనగా - వ్యతిరేకార్థకమున మధ్యమపురుష ప్రత్యయములైన ము డులు పరములైనపుడు ధాతువునకు కుజీ యగును. ఉదా॥ నీవు వండకుము - మీరు వండకుడు.

ఇట్లు బాల-ప్రౌఢ వ్యాకరణకర్తలు సమాపక క్రియారూపములను వివరించినారు.

# 3. అసమాపక క్రియలు

## ఎ) భావార్థము

1. "టవర్ణకంబు భావంబునందగు" (బాల-క్రియా-35). భావమనగా ధాతువు యొక్క అర్థము. అట్టి ధాత్వర్థమును బోధించునపుడు 'ట' వర్ణక మగును. ఉదా: వండుట-పండుట-వినుట- కనుట.

2. "భావంబునం దనుప్రయుక్తంబగు కొనుటకున్ గోలు విభాష నగు" (ప్రౌఢ-క్రియా-17). అనగా- భావార్థమునందు అనుప్రయుక్తమయిన 'కొనుట' అనుదాని కంతటికి బదులుగా 'కోలు' అనునది విభాషగా అగును. ఉదా: ఇచ్చుకోలు- ఇచ్చుకొనుట; పుచ్చుకోలు- పుచ్చుకొనుట.

3. "కొఱకు కంటె పొంటెలు పరంబులగునపుడు భావార్థక టవర్ణకంబునకు లోపంబు విభాషనగు" (ప్రౌఢ-క్రియా-14). అనగా- కొఱకు, కంటె, పొంటె అనునవి పరమగునపుడు భావార్థకమైన టవర్ణకమునకు లోపము విభాషగా అగును. ఉదా:- 1. దాని జూపు కొఱకునె కాదె యీయయ్యబట్టి తెచ్చుట (కళా-3ఆ)- (చూపుటకొఱకు). 2. పతి కలుగుకంటె సౌఖ్యము సతులకు నొండొకటి కలదె(విక్ర-6ఆ) - (కలుగుట కంటె). 3. చీడపట్టె నిట్టలంబుగ జడిపట్టు పొంటె (హరి.పూ-7ఆ) - (పట్టుటపొంటె). పక్షమున: చూపుట కొఱకు- కలుగుట కంటె- పట్టుటపొంటె.

4. "కజీ వర్ణకంబు పురార్థయోగంబున విభాషను భావంబునం దగు" (బాల-క్రియా-36). అనగా- మునుపు- ముందు మొదలైన అర్థములు కలవానితో కలిసియున్నపుడు ధాతువునకు ప్రత్యయము విభాషగా నగును. ఉదా: వండక మునుపు-వండుటకు మునుపు; చేయక మునుపు - చేయుటకు మునుపు.

మునుపు- ముందు- మున్ను- తొల్లి అనునవి పురార్థకములు.

5. "వ్యతిరేక భావమున మిజీయగు" (బాల-క్రియా-33). అనగా- వ్యతిరేకార్థక ధాతువునకు 'మిజీ' అను ప్రత్యయము కలుగును. ఉదా: వండమి- పండమి.

6. "తి దు ట లు పరంబులగునపు డన్వాదుల ను స్థానంబున సున్నయు, నుండు దులోపంబును విభాషనగు" (బాల-క్రియా-58). అనగా- 'తి-దు-ట' అనునవి పరమగునపుడు 'అను' మొదలైనవాని 'ను' వర్ణమునకు లోపమును విభాషగా అగును. ఉదా: అందురు- అంట; ఉందురు- ఉంట. పక్షమున: అనుదురు- అనుట; ఉండుదురు- ఉండుట.

## బి) క్త్వార్థము

1. " సమానాశ్రయంబులం బూర్వకాలంబునం ది వర్ణకంబగు" (బాల-క్రియా-38). అనగా- ఏకాశ్రయములగు క్రియలలోపల ఏది పూర్వకాలికమగునో దానిని చెప్పు ధాతువునకు 'ఇ' వర్ణకమగును. ఇదియే క్త్వార్థమనబడును. ఉదా: వండి- పండి-విని-కని.

2. "ఒక్కొకచో భూతార్థ కాసమాపక క్రియ హేత్వర్థకంబు నగు" (ప్రౌఢ-క్రియా-15). అనగా- ఒక్కొక్కచోట ఈ క్త్వార్థక క్రియ హేతువును కూడ బోధించునని అర్థము. ఉదా: రాహు కంఠము దెగి దేహము ధరణిబడియె (భార-ఆది-2ఆ). ఇందులో 'దేహము ధరణి బడుట' కు కారణము 'రాహుకంఠము తెగుట'. ఇక్కడ 'తెగుటవలన' అన్న హేత్వర్థమునకు బదులు 'తెగి' అను క్త్వార్థకరూపమే వచ్చినది.

3. "కజి వ్యతిరేక క్త్వార్థంబునం దగు" (బాల-క్రియా-39). అనగా- వ్యతిరేకార్థమును బోధించు క్త్వార్థకమునకు 'కజి' ప్రత్యయమగును. ఉదా: వండక- పండక- కొట్టక- తిట్టక.

## సి) తుమర్థము

1. "తుమర్థ భావలక్షణములందు నుజి యగు" (బాల-క్రియా-40). సంస్కృతమున 'గంతుమ్- భోక్తుమ్' మొదలైన వానికి 'తుమ్' అను ప్రత్యయము కలుగుచున్నది. వానిని తుమర్థకములందురు. తెలుగులో ఇట్టిచోట్ల ధాతువునకు 'నుజి' రాగా 'వండను' వంటి రూపము లగును.

అన్యక్రియకు లక్షణభూతమైన క్రియ భావలక్షణ మనబడును. అనగా - ఒక క్రియ యొక్క కాలమును గుర్తించుటకు మరొక క్రియ సహకరించునపుడు సహకరించినక్రియ లక్షణము; సహకారమునందిన క్రియ లక్ష్యము. ఉదా: చైత్రుండు

వండ నతిథి వచ్చెను. ఈవాక్యమున – వండుట, వచ్చుట అను రెండు క్రియలున్నవి. వీనిలో 'వచ్చుట' అను క్రియ లక్ష్యము; 'వండుట' అను క్రియ లక్షణము. కావున వండు అను ధాతువునకు 'నుఙ్' వర్ణకము కలిగి 'వండను' అని అయినది. ఉదా: తుమర్థము: చైత్రుండు వండను బోయెను. భావ లక్షణము : చైత్రుండు వండ నతిథి వచ్చెను.

## ఈ) అన్నంతములు

'అన్' అంతమందుగల క్రియలు అన్నంతములు (వండన్ – పండన్).

1. "వ్యాపారోన్ముఖత్వంబున నన్నంతక్రియలకు బాఱు ధాతు వనుప్రయుక్తంబగు" (ప్రౌఢ – క్రియా -19). అనగా – వ్యాపారము యొక్క అనుకూలతను సూచించునపుడు అన్నంత క్రియలకు 'పాఱు' అను ధాతువు అనుప్రయుక్తమగును. ఉదా: పండబాఱిన పొల మెండబాఱె – అనగా పండుటకు అనుకూలముగా ఉన్న పొలము ఎండబాఱెను అని అర్థము. అందువలన 'ఎండన్' అన్న అన్నంతరూపమునకు 'పాఱు' ధాతువు అనుప్రయుక్తమైనది.

2. "తిగుచు ధాతువు నన్నంతరూపములు దివ్వఁ తివ ననియు" (ప్రౌఢ-క్రియా-20). అనగా – 'తిగుచు' అను ధాతువుపై 'నుఙ్' ప్రత్యయము కలుగగా (ప్రౌఢ-క్రియా-10 చే) 'తిగువన్' అని యగును. దానితో పాటు ప్రస్తుత సూత్రముచే 'తివ్వన్ · తివన్' అను రూపములును ఏర్పడును. ఉదా: తివ్వన్ – ఎవ్వరికిని మోపెట్టను దివ్వను శక్యంబు కాని దృఢకార్ముకమున్" (భార -ఆది-7ఆ). తివన్ – "కొప్పు వట్టి తివం బోవ" (కళా – 3ఆ).

## ఉ) చేదర్థము

1. "చేదర్థంబునందు వృత్తంబగు భావలక్షణంబునందు న వర్ణకంబు ద్రుతాంతంబగు" (బాల – క్రియా -41). అనగా – చేదర్థము నందును, భూతార్థక భావలక్షణమునందును ధాతువునకు ద్రుతాంతమైన 'న' వర్ణకము వచ్చును. ఉదా: చేదర్థకము: వానలు గురిసినం బంటలు పండును. భూతార్థక భావలక్షణము: వాడు రమ్మనిన బోయితిని.

2. "చేదాద్యర్థకాంతంబైన యుండున కున్నాదేశంబు విభాషనగు" (బాల-క్రియా-57). అనగా - చేదర్థమునందును, భూతార్థక భావలక్షణమునందును ధాతువునకు (బాల-క్రియా-41చే) వచ్చిన 'న' వర్ణకముతో నున్న 'ఉండు' ధాతువున కంతటికిని బదులు 'ఉన్న' అనునది విభాషగా ఆదేశమగును. ఉదా॥ ఉన్నను - ఉండినను.

## ఎఫ్) ఆనంతర్యార్థము

అనంతరముయొక్క భావము ఆనంతర్యము.

1. "ఆనంతర్యంబున డు వర్ణకంబు ద్రుతాంతంబగు" (బాల-క్రియా-42). అనగా - ఆనంతర్యార్థమున ధాతువునకు ద్రుతాంతమైన డు వర్ణకము కలుగును. ఉదా॥ జాబిలి తోతెంచుడుం గువలయంబులు వికసిల్లె.

2. "కొన్ని యెడల భావార్థక రూపము టు శబ్ద పరకంబై యానంతర్యార్థకంబయ్యెడి" (ప్రౌఢ-క్రియా-12). అనగా - కొన్నియెడల భావార్థకము (టు) కూడ 'ఉ' శబ్దమును చేర్చుకొని ఆనంతర్యార్థమును బోధించును. ఉదా॥ అనుటయు లుబ్ధకుం డిట్లయెన్ (భార-అర-5ఆ).

## జి) శత్రర్థము

సంస్కృతమున 'శతృ' ప్రత్యయము ఏ అర్థమున వచ్చునో దానిని శత్రర్థమని యందురు (గచ్ఛన్ - పిబన్). అనగా వర్తమానార్థమని భావము. అట్టి వానికి తెలుగున 'చు' ప్రత్యయము చేరును. ఈ శత్రర్థకము అసమాపక క్రియారూపము.

1. "చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునందగు" (బాల-క్రియా-43). అనగా - క్రియతో అన్వయించు శత్రర్థ ధాతువునకు ద్రుతాంతమైన 'చు' ప్రత్యయము కలుగును. ఉదా॥ చూచుచుం బోవుచున్నాడు - చూచుచు బోయెను- చూచుచుం బోవగలదు.

ఇట్లు బాల - ప్రౌఢవ్యాకరణకర్తలు అసమాపక క్రియా రూపములను వివరించినారు.

## 4. ధాతుజ విశేషణములు

ధాతువులనుండి ఏర్పడిన విశేషణములు ధాతుజ విశేషణములు. 'ఎడి - ఎడు-తల్లోపము - ఉన్న - కల-న-ని' అను ఏడు ప్రత్యయములు చేరుటవలన తెలుగులో ధాతుజవిశేషణము లేర్పడుచున్నవి.

1.(అ) "తృవర్ణకార్థంబునం దెడి యెడు వన్నియ లగు" (బాల-క్రియా - 44). సంస్కృతమునందు కర్త్రర్థమున తృ ప్రత్యయము కలుగును (కర్తృ-భర్తృ). అట్టి తృవర్ణకార్థక ధాతువునకు 'ఎడి-ఎడు' అను ప్రత్యయములు కలుగును. ఉదా: ప్రహరించెడివాడు - ప్రహరించెడువాడు (ప్రహర్త).

(ఆ) వానికి లోపంబు బహుళంబుగా నగు" (బాల-క్రియా -45). అనగా - పూర్వసూత్రముచే విధింపబడిన 'ఎడి-ఎడు' అను ప్రత్యయములకు లోపము బహుళముగా అగును. ఉదా: ప్రహరించువాడు (ప్రహర్త).

2. "ఉన్న కలజి న వర్ణకంబులు భవత్ - భావి-శతృ -క్త వదర్థంబులం దగు" (బాల-క్రియా - 46). అనగా - వర్తమానార్థమున 'ఉన్న' అను ప్రత్యయమును, భవిష్యదర్థమున 'కలజి' అను ప్రత్యయమును, భూతార్థమున 'న' అను ప్రత్యయమును కలుగును. ఉదా : వండుచున్నవాడు - వండగలవాడు - వండిన వాడు.

3. "వ్యతిరేక తృవర్ణకార్థమున నిజి యగు" (బాల-క్రియా-47). అనగా- వ్యతిరేక తృవర్ణకార్థక ధాతువునకు 'నిజి' యగును. ఉదా: వండనివాడు.

ఇట్లు తెలుగులో ధాతుజవిశేషణము లేర్పడుచున్నవి.

# 5. ప్రేరణార్థకములు

ధాతువు ఏ అర్థమున బోధించునో, ఆ అర్థమును నిర్వహించుటకు వేరొకరిని ప్రేరేపించుట 'ప్రేరణము' అనబడును. తెలుగులో ప్రేరణార్థకము లేర్పడు విధానము ఇందు వివరింపబడినది.

ప్రేరణార్థకప్రత్యయములను చేర్చుటకు పూర్వము సంస్కృతధాతువులకును, కొన్ని తెలుగు ధాతువులకును 'ఇంచు'గాగమము కలుగును. అందువలన ఇంచుగాగమమైనపుడు సంస్కృత ధాతువులలో కలుగు మార్పులు ముందుగా వివరింపబడినవి.

'పచ్, వచ్, భుజ్ వంటి సంస్కృత ధాతువులను, 'అంగల – ఆవుల –తిలక– పరిక' వంటి తెలుగుధాతువులను తెలుగులో వాడవలెనన్నచో 'ఇంచు' అను ప్రత్యయమును చేర్చి తీరవలెను (బాల–క్రియా–63). ఉదా॥ పచించు – వచించు – అంగలించు – ఆవులించు – తిలకించు మొదలైనవి. 'ఇ – ఉ – ఋ'లు అంతమందున్న సంస్కృతక్రియలకు 'ఇంచుక్కు' పరమగునపుడు ధాతువులకు వరుసగా – అయు – అవు – అరు' గాగమము లగును (బాల –క్రియా – 64). ఉదా ॥ జి – జయించు; నీ– నయించు; ద్రు – ద్రవించు.; ధృ – ధరించు; లూ – లవించు. కాని 'నిర్జి'కిని, నామ ధాతువులకును అయుగాగమము కలుగదు (బాల–క్రియా–65). ఉదా॥ నిర్జించు – నుతించు – స్తుతించు.

లఘువు ఉపధగా కలిగిన సంస్కృత ధాతువులకు ఇంచుక్కు పరంబగునపుడు గుణమగును. అనగా 'ఇ, ఉ,ఋ' లకు వరుసగా 'ఏ,ఓ,అర్' అని అగును(బాల–క్రియా– 66). ఉదా॥ ఇ ॥ భిద్ – భేదించు; ఖిద్ – ఖేదించు ॥ ఉ॥ ఘుష్ – ఘోషించు; పుష్ – పోషించు ॥ ఋ॥–వృష్–వర్షించు; హృష్ – హర్షించు.

'స్పృశ్' ధాతువునకు గుణము విభాషగా నగును (బాల–క్రియా–67). ఉదా॥ స్పర్శించు – స్పృశించు.

'లిఖ్, భుజ్, రుచ్,కృశ్' ధాతువులు లఘూపధ కలిగినవైనను గుణము లేదు (బాల–క్రియా–68). ఉదా॥ లిఖించు – భుజించు – రుచించు – కృశించు. కాని బాల–

క్రియా - 50 చే 'ఇంచు' గాగమము కలిగి లిఖించు - లిఖియించు; భుజించు - భుజియించు వంటి రెండు రూపములును కలుగుచున్నవి.

'సృజ్' ధాతువునకు నిర్మాణమను నర్థమున గుణము కలుగదు (బాల-క్రియా-69). ఉదా॥ చతుర్ముఖుండు ప్రజలను సృజించె. కాని ఆ ధాతువునకు 'వి' అను ఉపసర్గను చేర్చినప్పుడు గుణమగును. ఉదా॥ అతండు విషయంబుల విసర్జించె.

ఇట్లేర్పడిన క్రియా పదములపై 'ఇంచు, చు, పు' అను ప్రేరణార్థకరూపములు చేరుచున్నవి.

1. "సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కాగు" (బాల-క్రియా-70). అనగా - అన్నివిధములైన ధాతువులకును ప్రేరణార్థమున 'ఇంచు' గాగమమగును. ఉదా॥ వచించు + ఇంచు; వండు+ఇంచు.

"ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారమున కగు" (బాల-క్రియా-87). అనగా - ప్రేరణార్థమున వచ్చు 'ఇంచుక్కు' పరమందుండగా, ధాతువు యొక్క 'చ' కారమునకు 'ప'కార మగును. ఉదా॥ వచింపించు. ఇట్లే - పచింపించు - ఆవులింపించు.

కాని, వండు- పండు- వంటి ధాతువులు, బాల-క్రియా -70 సూ.చే రావలసిన ఇంచు గాగమము లేకయే తెలుగున ప్రయోగింపబడును. అందువలన వానికి ప్రేరణేంచుక్కు మాత్రము చేరును. ఉదా॥ వండించు - పండించు.

2.(అ) " రంజాదుల యించుక్చకారంబునకు సబిందుంబున క ప్రేరణంబున ద్విరుక్తలకారంబగు" (బాల-క్రియా-71). అనగా - 'రంజ్' మున్నగు ధాతువులకు బాల-క్రియా-70 చే ఇంచుగాగమమై 'రంజించు' వంటి రూపము లేర్పడును. వానిలోని బిందుపూర్వకచకారమునకు (ంచు), అప్రేరణార్థమున దిర్వ్యక్తలకారము వచ్చును. ఉదా॥ రంజిల్లు - భాసిల్లు - వర్ధిల్లు-విలసిల్లు-రాజిల్లు.

ఆ). "ఇంచుక్కు పరం బగునపుడు రంజాదుల యించుక్కునకు లోపంబగు" (బాల-క్రియా-72). అనగా -'రంజ్' మున్నగు ధాతువులకు ప్రేరణార్థమున ఇంచుగాగమముకలుగగా, బాల-క్రియా-70చే స్వార్థమున కలిగిన 'ఇంచు' లోపించును.

ఉదా॥ రంజించు –భేదించు––సంధించు. ఇది – బాల–క్రియా–71 చే వచ్చిన 'రంజిల్లు భాసిల్లువంటి వానికి వర్తించదు.

3. అ) "చుగాగమం బాచ్చికంబున కసంయుక్త న ల డ రాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగానగు" (బాల–క్రియా–73). అనగా – అసంయుక్తములైన 'న–ల–డ–ర'లు అంతమందున్న ఆచ్చిక ధాతువులకు ప్రేరణార్థమున చుగాగమము బహుళముగా నగును. ఉదా॥ పూను – పూనుచు; తేలు – తేలుచు; విను – వినుచు.

ఈ విధి బహుళము కనుక – బాల–క్రియా–70 చే – పూనించు – తేలించు – వంటి రూపము లేర్పడును.

'విను' ధాతువునకు – బాల–క్రియా–78చే – 'వినిపించు' అని అగును.

బాహుళకముచే కొన్నింటికి చుగాగమము లేదు. ఉదా॥ అను – అనిపించు; తిను–తినిపించు; కను–కనిపించు.

'కనిపించు' అనుదానికి దీర్ఘమును వచ్చును – కానిపించు.

ఆ) అట్లు పుగాగమంబు మాన్వాదులకగు"(బాల–క్రియా–74). పై సూత్రమున చెప్పినట్లు, 'మాను' మొదలైన ధాతువులకు 'పు' గాగమము బహుళముగా నగును. ఉదా॥ మాను – మానుచు – మానుపు; మను–మనుచు–మనుపు.

బాహుళకము చేత – 'మను' ధాతువునకు ఇంచుగాగమముతో కూడిన ప్రేరణార్థకరూపము కలుగదు.

4. "చుక్పువర్ణకంబు పరంబులగునపు డిత్వంబున కుత్వంబగు" (బాల–క్రియా–75). అనగా – ప్రేరణార్థకములయిన 'చు,పు' లు పరమైనప్పుడు ధాతువు యొక్క ఇత్వమునకు ఉత్వమగును. ఉదా॥ తెలుపు (తెలి+పు); కలుపు (కలి+పు); తడుపు (తడి+పు).

ఈ 'చు,పు'లు ఆగమములైనప్పుడు, బాల–క్రియా–76 చే వాని చివరి యక్షరము లోపించును. అప్పుడు – తెలి – కలి–తడి– వంటి రూపము లగును. వానికి పుగాగమము పరమైనచో ఇత్వమున కుత్వము కలిగి – తెలియు – కలియు – తడియు– వంటి రూపము లేర్పడును.

5. "అట్లు చుక్పుగాగమంబు అడంగ్వాది మాయ్వాదులకగు; నగుచో వాని కడ్రవాలు లోపించు" (బాల-క్రియా-76).

అడగు - కరగు-కలగు-నలగు-ఇత్యాదులు అడంగ్వాదులు.

మాయు - ఉడుగు-కడచు-బిగియు- ఇత్యాదులు మాయ్వాదులు.

వీనికి ప్రేరణార్థమున చుక్పుగాగమములు బహుళముగా నగును. అప్పుడు వాని చివరి అక్షరము లోపించును.

అ). ప్రేరణేంచుక్కు కలిగినచో - అడగించు -కరగించు-కలగించు-నలగించు.

చివరి అక్షరము లోపించునచో - అడచు (అడగు+చు). ఇట్లే - కరచు - కలచు, నలచు.

ఆ). మాయించు - ఉడిగించు - కడపించు - బిగియించు.

చివరి అక్షరము లోపించినచో - మాపు - ఉడుపు - కడపు. బాహుళకముచే కొన్నింటికి చుగాగమము ఒక్కటియు, కొన్నింటికి పుగాగమ ఒక్కటియు మాత్రమే కలుగును. ఉదా: విఱుగు +చు = విఱుచు - దీనికి పుగాగమ రూపము కలుగదు. ఇట్లే- చూపు, నేరుపు లకు పుగాగమము మాత్రమే కలుగును.

6. "ఇంచుక్చుక్పుగామంబులు పరంబులగునపు డాగమాదేశలోపంబులు పెక్కు దెఱంగులం గానంబడియెడి" (బాల-క్రియా - 7). అనగా - ధాతువునకు ప్రేరణార్థమున 'ఇంచు-చు-పు' అనునవి ఆగమమైనప్పుడు ఆగమాదేశలోపములు పెక్కు విధములుగా కనిపించును. ఉదా: అగు - కావించు; వచ్చు - రావించు - రప్పించు; త్రెగు-త్రెంచు-త్రెంపు; చచ్చు - చంపు.

'పోవు'నకు 'పుచ్చు' అగును. ఉదా: మోసపోవు - మోసపుచ్చు.

7. "అన్వాదుల కించుక్కు పరంబగునపుడు పుగాగమంబగు; మానునకు విభాషనగు" (బాల-క్రియా-78). అనగా - 'అను -కను-తిను-విను' వంటి వానికి ఇంచుక్కు పరమగునపుడు పుగాగమ మగును. ఉదా: అనిపించు - కనిపించు- తినిపించు-వినిపించు.

మానునకు పుగాగమము విభాషగా నగును - మానిపించు - మానించు.

8. "అడ్డాదుల కించుక్కు పరంబగునపుడు గుగాగమంబగు; నప్పాదులకు విభాషగా నగు" (బాల-క్రియా-79).

అడ్డము - ఓర-చిత్తము-పెల్ల - ఇత్యాదులు అడ్డాదులు. వీనికి ఇంచుక్కు పరమగునపుడు 'గు' వర్ణము ఆగమమగును. ఉదా॥ అడ్డగించు - ఓరగించు - చిత్తగించు-పెల్లగించు.

అప్ప - ఒప్ప-పల్లము-కోప - ఇత్యాదులు అప్పాదులు. వీనికి ఇంచుక్కు పరమగునపుడు 'గు' గాగమమగును. ఉదా॥ అప్పగించు - ఒప్పగించు - పల్లగించు - కోపగించు.

9. "ఆడోడు కూడుల డకారంబునకుం జుక్కు పరంబగునపుడు రేఫంబగు" (బాల-క్రియా-80). అనగా - 'ఆడు-ఓడు-కూడు' ల డకారంబునకు చుక్కు పరమగునపుడు రేఫము వచ్చును. ఉదా॥ ఆడు-ఆడించు-ఆరుచు; ఓడు-ఓడించు-ఓరుచు; కూడు-కూడించు - కూరుచు.

10. "చెడునకుం జుక్పుగాగమంబులును, డా కలఘురేఫంబు నగు" (బాల-క్రియా-81). అనగా - 'చెడు' నకు చుక్ - పుగాగమములును, 'డ'కారమునకు శకటరేఫమును అగును. ఉదా॥ చెఱుచు - చెఱుపు.

11. "పడునకుం జుక్కును, డా కలఘురేఫంబునగు" (బాల-క్రియా-82). అనగా - 'పడు' ధాతువునకు ప్రేరణార్థమున 'చు' వర్ణము పరమగునపుడు 'డ' కారమునకు శకటరేఫమగును. ఉదా॥ పఱుచు.

12. "శబ్దపల్లవంబగు పడున కించుక్కు విభాషనగు; నగుచో డాకు లఘురేఫంబగు" (బాల-క్రియా-83). అనగా- శబ్దపల్లవమున ఉత్తర పదముగానున్న 'పడు' నకు ఇంచుక్కు విభాషగా నగును. అప్పుడు 'డ'కారమునకు లఘురేఫ మాదేశమగును. ఉదా॥ వెలువడు - వెలువరించు ; చొప్పడు-చొప్పరించు.

ఈవిధి విభాష కనుక - వెలువఱుచు, చొప్పఱుచు - అనియు నగును. విలక్షణార్థముల నిచ్చు ధాతువులకు ధాతువు లనుప్రయుక్తమగునపుడు ఏర్పడునవి శబ్దపల్లవములు. ఉదా॥ చను+తెంచు = చనుదెంచు (వచ్చు).

13. "ప్రేరణంబునం దించుక్కు మీద నించుక్కు లేదు" (బాల-క్రియా-84). అనగా - ప్రేరణార్థమున కలిగిన ఇంచుక్కుమీద మరొక ఇంచుక్కు కలగదు.

ఇట్లనుటవలన ప్రేరణార్థమున వచ్చు చుక్, పుగాగమములపైన ఇంచుగాగమము కలుగవచ్చునని తాత్పర్యము (వృత్తి). ఉదా: చచ్చు - చంపు-చంపించు; నొచ్చు - నొంచు-నొప్పించు.

14. "ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారమునకగు" (బాల-క్రియా- 87). అనగా - ప్రేరణార్థకమయిన ఇంచుక్కు పరమందుండగా ధాతువు యొక్క చకారమునకు పకారమగును. ఉదా: వచించు - వచింపించు; పిలుచు - పిలిపించు.

15. "ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తుపరంబగునపుడు పవలగు" (బాల-క్రియా-88). అనగా ముత్తు పరమైనప్పుడు, ఆగమ చకారమునకు పకారమును, అన్యచకారమునకు వకారమును, ఆదేశముగా వచ్చును. ఉదా: ఆగమ చకారమునకు : వచింపదు - వచింపుము. అన్యచకారమునకు: పిలువదు - పిలువుము. కాని కవిత్రయేతర ప్రయోగములలో మాత్రము ఇంచుక్ చకారమునకు పకారముకనిపించుటలేదు (ప్రౌఢ-క్రియా-16). ఉదా: ఎవ్వారిఁ బోరించని క్షణము (కళా-2ఆ); ఊహించ నొక నాల్గు (కళా-3ఆ).

16."అన్నంత క్రియ చేయుయోగంబునం బ్రేరణార్థకంబగు"(ప్రౌఢ-క్రియా-18). అనగా నుజ్యంత ధాతువుపై 'చేయు' అనునది చేరి, ప్రేరణార్థకము నొసగును. ఉదా: చొక్కుచుఁ జొక్క చేయుచు (కళా-2ఆ) (చొక్కఁజేయు = చొక్కించు)

17. " కరగు తలగు మెఱయ్యాదు లంతర్భావిత ప్రేరణంబులు"(ప్రౌఢ-క్రియా-34). అనగా 'కరగు - తలగు-మెఱయు' మున్నగు ధాతువులు, ఇంచుగాదులు చేరకయే ప్రేరణార్థము నిచ్చును. ఉదా: బంగారమును కరగెను - అనగా 'బంగారమును కరగించెను' అనియే అర్థము.

ఇట్లు బాల-ప్రౌఢవ్యాకరణకర్తలు ప్రేరణార్థక క్రియలు ఏర్పడు విధానమును వివరించినారు.

# X. కృదంత పరిచ్ఛేదము

క్రియాపరిచ్ఛేదమున- ధాతువునకు అనేక ప్రత్యయములు విధింపబడినవి. అవి చేరుట వలన వివిధ విధములైన క్రియారూపము లేర్పడుచున్నవి. వీనిలో- డుఞ్- రు-వు- రు-ను-ము అనునవి ప్రథమ- మధ్యమ- ఉత్తమ పురుష క్రియలపై చేరుచున్నవి. ఎడు- ఎడి- ఉన్న- కలఁ- న- నిఁ- వంటి ప్రత్యయములు చేరుటవలన- వండెడు- వండెడి- వండుచున్న- వండగల- వండిన- వండని వంటి విశేషణ రూపము లేర్పడుచున్నవి. ఇ- కఁ-నుఁ-డును- చును -వంటి ప్రత్యయములు చేరి- వండి- వండక- వండను- వండుడును- వండుచును వంటి అసమాపకక్రియారూపములేర్పడుచున్నవి. క్రియా పరిచ్ఛేదములో విధింపబడిన పై ప్రత్యయములు కాక, ఈ పరిచ్ఛేదమున మరికొన్ని ప్రత్యయములు విధింపబడుచున్నవి. క్రియా పరిచ్ఛేదములో చెప్పబడిన వానికన్న భిన్నములైన ప్రత్యయములను 'కృత్తులు' అందురు. ఏ యర్థమున ఏ కృత్ప్రత్యయములు కలుగునో వ్యవహారమును బట్టి తెలిసికొనవలయునని సూరి కృదంత పరిచ్ఛేద ప్రారంభమున (బాల-కృదంత-1) నిర్దేశించినాడు.

కాని, ఇవి పూర్వపరిచ్ఛేదములోవలె అన్ని ధాతువులకును సామాన్యము విధింపబడిన ప్రత్యయముల వంటివి కావు. ఇవి కొన్ని నిర్దిష్టధాతువులకు, నిర్దిష్టార్థములంద మాత్రమే విధింపబడినట్టివి.

మరొక విశేషము- కొన్నిధాతువులపైన విధింపబడిన ఈ కృదంత ప్రత్యయములు, అవి చేరి, వానిని విశేష్యములుగా మార్చుచున్నవి (మొలచు- మొలక).

అంతేకాక- ఇవి చేరుటవలన ధాతువు చివర కొన్ని మార్పులు వచ్చుచున్నవి. అందువలననే సూరి- "ఇటం గృత్కగతపవేములు పరంబగునపుడు కగచయవలకు లోపంబగు" (బాల-కృదంత-2). అనగా- క-గ-త-ప-వ-ఇమి- అను ప్రత్యయములు పరములగునపుడు, ధాతువు చివరనున్న -క-గ-చ-య-వ- అను వర్ణములకు లోపము కలుగుచున్నది.

కృత్ప్రత్యములును, అవి చేరుటవలన కలుగుచున్న మార్పులును ఇట్లున్నవి:-

1. "కవర్ణకం బలుగ్వాదులకగు" (బాల-కృదంత-3). అలుగు, ఎఱుగు, తునుగు, నడచు వంటి ధాతువులకు 'క' ప్రత్యయము కలుగును. ఉదా: అలుగు- అలుక; ఎఱుగు- ఎఱుక; తునుగు- తునక; నడచు- నడక; మొలచు- మొలక. వచ్చునకు రా అగును - రాక. క, పులు పరమగునపుడు కనునకు దీర్ఘము- కానిక- కానుపు. కినియు, ముదియుల కుత్వంబగును- కినియు- కినుక; ముదియు- ముదుక.

2. "ఇమి వర్ణకం బలుగ్వాదులకగు"(బాల-కృదంత-4). కలుగు- కూరుచు- నేరుచు- తాలు- వంటి ధాతువులకు 'ఇమి'ప్రత్యయము వచ్చును. ఉదా: కలుగు+ ఇమి= కలిమి (ఇట-బాల-కృదంత- 2 చే ధాతువు చివరి అక్షరమునకు లోపము). కూరుచు- కూరిమి; నేరుచు- నేరిమి; తాలు- తాలిమి.

3. "తజ్వర్ణకంబు చేయ్యాదులకగు"(బాల-కృదంత-5). చేయు- కూయు- గీయు- నేయు- మూయు- వ్రాయు -వంటివానికి 'తజ్' వర్ణకము కలుగును. ఉదా: చేయు+త=చేత (2వసూ. చే ధాతువు చివరి అక్షరమునకు లోపము). ఇట్లే- కూత- గీత- నేత- మూత-వ్రాత.

4. "కువర్ణకం బడంగ్వాదులకగు" (బాల-కృదంత-6).అడగు- పెనగు- మెలగు- లోగు- వేగు- వంటివానికి'కు' వర్ణకము కలుగును. ఉదా: అడకువ- పెనకువ- మెలకువ- లోగువ- వేకువ.

5. "టవర్ణకం బాడ్వాదులకగు; నగుచో నంతలోపంబగు" (బాల-కృదంత-7). ఆడు- ఊరు- తేరు- పండు- పాడు- వండు- వంటివానికి 'ట' వర్ణకమగును. అప్పుడా ధాతువు చివరి అక్షరమునకు లోపము వచ్చును. ఉదా: ఆడు- ఆట; ఊరు- ఊట; తేరు- తేట; పండు- పంట; పాడు- పాట; వండు- వంట.

ఈ 'ఆట' శబ్దము అనుప్రయుక్తమైనప్పుడు ప్రాయికముగా అది క్లీబసమమగును. ఉదా: కోలాటము- పోరాటము.

6. "టువర్ణకంబు పడ్వాదులకగు; నగుచో నవి యాద్యక్షర శేషంబులయి దీర్ఘంబునొందు" (బాల- కృదంత-8).పడు- చెడు- కఱచు- పొడుచు- వ్రేయు-

వంటివానికి టువర్ణకమగును. ఉదా॥ పడు- పాటు; చెడు- చేటు; కఱచు- కాటు; పొడచు- పోటు; వ్రేయు- వేటు.

7. "ప వర్ణకంబు తిరియ్యాదులకగు" (బాల-కృదంత-9). తిరియు- పొలయు- మురియు- వంటివానికి ప వర్ణకమగును. ఉదా॥ తిరిపము- పొలపము- మురిపము. కలియునకు అత్వము నగును- కలపము.

8. "డయ్యు దయ్యు నొచ్చు పుచ్చుల కివర్ణంబగు; అగుచో వాని కడహల్లులు పకారంబులగు" (ప్రౌఢ-కృదంత-1). డయ్యు-దయ్యు- నొచ్చు- పుచ్చు- అనువానికి 'ఇ' వర్ణకమగును. అప్పుడు వాని చివరి హల్లులు పకారమగును. ఉదా॥ డప్పి- దప్పి- నొప్పి- పుప్పి.

9. "తవర్ణకం బావులించు లోనగువాని కగు" (బాల-కృదంత-10). ఆవులించు- కుళ్ళగించు- గిలిగించు- మొదలగువానికి 'త' వర్ణకమగును. ఉదా॥ ఆవులింత- కుళ్ళగింత- గిలిగింత.

10. "పువర్ణకంబు మాయ్యాదులకగు" (బాల-కృదంత-11). మాయు- మేయు- కాచు- చూచు- తలచు- రాచు- మొదలగువానికి 'పు' వర్ణకమగును. ఉదా॥ మాపు- మేపు- కాపు- చూపు- తలపు- రాపు.

"రాయున కిడి వర్ణకంబునగు" (ప్రౌఢ- కృదంత-2). 'రాయు'న కు 'పు' వర్ణకమేకాక 'ఇడి' వర్ణకమును కలుగును. ఉదా॥ రాయిడి- రాపు.

11. "ఇకవర్ణకం బంజ్యాదుల కగు" (బాల-కృదంత-12). అంజు- అమరు- ఓపు- కూడు- కోరు- మొదలగువానికి 'ఇక' వర్ణకమగును. ఉదా॥ అంజిక- అమరిక- ఓపిక- కూడిక- కోరిక.

12. "ఈర్చుబ్బు కందు దువ్వు వడ్డించుల కెన వర్ణకంబగు; అగుచో ఈర్చు ఉబ్బుల చకార బకారంబులు పకారంబులగు; వడ్డించు నించు లుప్తంబగు" (ప్రౌఢ- కృదంత-3). ఈర్చు- ఉబ్బు- కందు- దువ్వు- వడ్డించు- అనువానికి 'ఎన' వర్ణకమగును. అప్పుడు 'ఈర్చు'లోని చకారమునకును 'ఉబ్బు'లోని బకారమునకును 'ప' కారమగును. ఉదా॥ ఈర్పెన- ఉప్పెన. మిగిలిన వాటికి 'ఎన' కలుగగా- కందెన- దువ్వెన. 'వడ్డించు' అనుదానికి 'ఇంచు' లోపము కలుగును- వడ్డన.

13. "పుర వర్ణకంబు కాచు, దాచు, దాయ్యాదులకగు" (ప్రౌఢ- కృదంత- 4). కాచు- దాచు- దాయు- అనువానికి 'పుర' వర్ణకమగును. ఉదా: కాపురము- దాపురము (దాచిన సొమ్ము)- దాపురము (ప్రాప్తి).

14. "బడియేల్వాదుల కగు" (బాల-కృదంత-14). ఏలు-కట్టు-గిట్టు -చెల్లు -తీరు -పెట్టు- మ్రొక్కు- సాగు -మొదలైన వానికి 'బడి' వర్ణకమగును. ఉదా: ఏలుబడి- కట్టుబడి- గిట్టుబడి- చెల్లుబడి- తీఱుబడి- పెట్టుబడి- మ్రొక్కుబడి- సాగుబడి.

15. "గడ చేర్వాదులకగు" (బాల-కృదంత-15). చేరు- తేఱు- మను- విడు- వంటివానికి 'గడ' వర్ణకమగును. ఉదా: చేరుగడ- తేఱుగడ- మనుగడ- విడుగడ.

16. " ఎక్కు దిగులకుం బ్రేరణార్థంబున మతివర్ణకంబగు; అగుచో నెగు ఎక్కున కాదేశంబగు" (ప్రౌఢ-కృదంత-5). ఎక్కు- దిగు- అనుధాతువులకు ప్రేరణార్థమున 'మతి' అను ప్రత్యయము కలుగును. అప్పుడు 'ఎక్కు' నకు 'ఎగు' అనునది ఆదేశమగును. ఉదా:ఎగుమతి- దిగుమతి.

'ఎగువ' అనునదియు ఇట్లేర్పడినదే. అచ్చట 'వ' ప్రత్యయము కలిగినది.

17. "ఇకి కోర్యాదులకగు"(బాల-కృదంత-16).కోరు-పూను-పోలు-మను- వంటివానికి 'ఇకి'వర్ణకమగును. ఉదా: కోరికి -పూనికి - పోలికి - మనికి.

18. "వువర్ణకంబు మన్వాదులకగు" (బాల-కృదంత-17). మను-కాచు- కొలుచు-చచ్చు-నిలుచు-పూచు-వంటివానికి 'వు'వర్ణకమగును. ఉదా: మనువు-కావు- కొలువు-చావు-నిలువు-పూవు.

"వు వర్ణకం బులియ్యాదుల కగు" (ప్రౌఢ-కృదంత-6). 'ఉలియు' మొదలగువానికి 'వు' వర్ణకమగును. ఉదా: ఉలివు (చలనము).

19. "అవర్ణకంబు గీఱ్ఱాదులకగు" (బాల-కృదంత-18). గీఱు-ఊదు- ఎండు-కాయు-మీటు-పాయు- మొదలగువానికి 'అ' వర్ణకమగును. ఉదా: గీఱ-ఊద- ఎండ-కాయ-మీట-పాయ.

20. "అక వర్ణకంబు మాఱ్వాదులకగు" (బాల-కృదంత-19). మాఱు-అమ్ము-అంపు-వంటివానికి 'అక' ప్రత్యయము కలుగును. ఉదా॥ మాఱు-మాఱకము; అంపు-అంపకము. వండు 'డ'కారంబునకు 'ట' కారమగును - వంటకము.

21. "డువర్ణకం బాడ్వాదులకగు; అగునపుడు పకారంబు చయలకగు" (బాల-కృదంత-20). ఆఱు-అమ్ము-అల్లు-త్రోచు-దంచు-పెంచు-మాయు-వంటి వానికి 'డు' వర్ణక మగును. అపుడు ధాతువు చివరి చయలకు 'ప'కారమగును. ఉదా॥ ఆఱుడు-అమ్ముడు-అల్లుడు-త్రోపుడు-దంపుడు-పెంపుడు-మాపుడు.

22. "ఉవర్ణకం బడుక్వాదులకగు" (బాల-కృదంత-21). అడుకు -అంటు-మొదలగువానికి 'ఉ' వర్ణకమగును. ఉదా॥ అడుకు (అడుకు+ఉ); అంటు (అంటు+ఉ). ఇట్లే - ఒప్పు -ఒఱుగు-ఒసగు.

23. "కాచు వీచులకు వలివర్ణకంబగు" (ప్రౌఢ-కృదంత-3). 'కాచు-వీచు' శబ్దములకు 'వలి' వర్ణకమగును. ఉదా॥ కావలి-వీవలి.

24. "వడి ప్రభృతు లిట్లెఱుంగునది" (బాల-కృదంత-22). 'వడి' మున్నగు ప్రత్యయములు కలుగు విధానమును మహాజనుల ప్రయోగములను బట్టి తెలిసికొనవలెను.

ఎ) వడి - కొలువడి (కొలత); గెలువడి(జయము); నడవడి.
వ్యతిరేకంబునవచ్చినచో - లేవడి.

బి) వి - తనివి - తెలివి - విరివి.

సి) అవు- తగవు - నగవు - ఉఱవు.

డి) ఇ - చేయి - వ్రాయి.

ఇ) కలి - వినుకలి.

కృదంత ప్రత్యయము లింకను ఉండవచ్చును. వానిని మహాజనుల ప్రయోగములనుబట్టి తెలిసికొనవలెను.

# X I. వాక్య పరిచ్ఛేదము

బాలవ్యాకరణమున - అక్షరములు, వానిచే ఏర్పడుచున్న పదములు, వానిపైన చేరుచున్న విభక్తులు, ఆవిభక్తులు లోపించుటవలన ఏర్పడుచున్న సమాసములు, క్రియలు, కృత-తద్ధితములు వివరింపబడినవి. కాని అవి అన్నియు కూర్చబడిన, అర్థబోధకమగువాక్యము ఏర్పడు విధానము వివరింపబడలేదు. పైవాని అన్నింటి ప్రయోజనము వాక్యముగా నేర్పడి భావబోధకములగుటయే. అందువలన సంపూర్ణ భావప్రకటనకు భాషలో ప్రధానమైనది వాక్యము. అట్టి వాక్యమును గురించి బాలవ్యాకరణమున లేకపోవుట లోపముగా భావించి, ప్రౌఢవ్యాకర్త ఈ 'వాక్య ప్రకరణము'ను కూడ తన ప్రౌఢవ్యాకరణమున చెప్పియున్నాడు.

1. "వ్యాకమునా యోగ్యతాకాంక్షా సహితంబగు నర్థముగల యాసత్తియుక్త పదసముదాయంబు" (ప్రౌఢ-వాక్య-1) - వాక్యమనగా యోగత్య, ఆకాంక్ష, ఆసత్తి అను లక్షణములుగల పదముల సముదాయము.

'యోగ్యత' అనగా- పదముల అర్థములకు పరస్పర సంబంధమున బాధ కలుగకుండుట. ఉదా॥ నిప్పుచే తడుపుచున్నాడు - అన్నప్పుడు నిప్పు యొక్క లక్షణము తడుపుట కాదు. కనుక అన్వయమున బాధ కలుగును. కనుక ఆ వాక్యములోని పదములకు యోగ్యత లేదు.

'ఆకాంక్ష' అనగా - నిలుపుదలలేక పైపై పదార్థముల మీదికి పోయెడు ఆదరము. అనగా ఒక పదము తక్కిన పదములను గూర్చి తెలిసికొనవలయునన్న ఆకాంక్షను కలిగింపవలెను. కనుక అది వినువారికి, ఇంకను తెలుసుకొనవలయునన్న ఆపేక్షారూపమైనది. ఉదా॥ గోవు గుఱ్ఱము - 'ఇదిగోవు' అన్నప్పుడు 'ఏది గోవు' అని ఆకాంక్ష కలుగుటకు అవకాశమున్నది కాని, 'గోవు గుఱ్ఱము' అన్నపుడు అట్టి అవకాశము లేదు. కనుక ఆ పదములకు ఆకాంక్ష కుదరదు.

'ఆసత్తి' అనగా పదములచేరిక. అనగా - ఇప్పుడొక మాట చెప్పి, తరువాత ఎప్పుడో యోగ్యత - ఆకాంక్ష గల పదములను చెప్పినను ఆసత్తి లేకపోవును. పదములను వ్యవధానములేకుండ, చేర్చి పలుకుటవలన ఆసత్తి కలుగును. అట్లుకాక

'దేవదత్తుడు' అని నేడు చెప్పి, 'పోవుచున్నాడు' అని మఱునాడు చెప్పినచో అది వాక్యము కాదు. అచట ఆసత్తి యను లక్షణము లోపించినది.

కనుక 'యోగత్య – ఆకాంక్ష – ఆసత్తి' అను మూడు లక్షణములను కలిగినదే వాక్యము.

ఈ వాక్యము రెండు విధములుగా ఉండును – 1. క్రియాన్వయము కలిగినవి. రాముడు రావణుని సంహరించెను – ఈ వాక్యములోని 'రాముడు' 'రావణుడు' అన్న రెండు పదములు 'సంహరించెను' అన్న క్రియాపదముతో అన్వయము కలవియే. 2. క్రియేతరాన్వయము కలిగినవి. ఉదా॥ రాముని తమ్ముడు లక్ష్మణుడు – ఈ వాక్యమున క్రియాపదము లేక పోయినను, అర్థబోధనమున విప్రతిపత్తి లేదు (ప్రౌఢ-వాక్య-1-వృత్తి).

2. "పదమనగా బ్రయోగార్హంబు నన్వితంబు నేకంబు నర్థబోధకంబునైన వర్ణము లేక వర్ణసముదాయము (ప్రౌఢ-వాక్య-2). అనగా – ప్రయోగించుటకు అర్హమైనది, ఇతరపదములతో అన్వయములేనిది, ఒక్కటియైనది, అర్థబోధకమైనది అయిన వర్ణము లేదా వర్ణసముదాయము.

ఎ) ప్రయోగానర్హము – కేవల ప్రాతిదికములు ప్రయోగమునకు అనర్హములు. కనుక 'ఖ-ఘట' వంటివి వాక్యములు కాజాలవు.

బి) అన్వితము– "ఖంబు ఘటంబున దోచెడి" – అన్నప్పుడు అది పరస్పరాన్వయముగల పదసముదాయమగును. అట్టి సంబంధ సూచకము లున్నంతవరకు దానిని పదము అనరాదు.

సి) అనేకము – "ఖంబును ఘటంబును" – అన్నప్పుడు అందు ఒక్కటికాక రెండు పదములున్నవి. కనుక అనేక మనబడునుగాని, పదముకాదు.

డి) అనర్థబోధకము – "క–చ–ట–త–ప"అన్నప్పుడు అవి అర్థబోధకములుగా లేవు. కనుక పదములు కాజాలవు.

కావున – ప్రయోగార్హము, అనన్వితము, ఏకము, అర్థబోధకమైనది అయినదే పదమనబడును.

3. "పదము లవి నామములు క్రియ లవ్యయంబులని త్రివిధంబులు" (ప్రౌఢ-వాక్య-3). అనగా – పదములు –నామములు, క్రియలు, అవ్యయములని

మూడు విధములు. వీనిలో - వస్తువాచకశబ్దములు నామములు. వ్యాపారమును బోధించునవి క్రియలు. లింగ విభక్తి వచన శూన్యములు అవ్యయములు.

4. "పదములకు బరస్పరముగల సంబంధ మన్వయ మనంబడును" (ప్రౌఢ-వాక్య-4). అనగా- వాక్యములో వివిధ పదములకు గల పరస్పర సంబంధమును 'అన్వయ' మందురు.

5. "విషయబోధకము వాక్యము" (ప్రౌఢ-వాక్య-5). అనగా - తెలియ దగిన విషయమును బోధించునది వాక్యము.

6. "ఉద్దేశ్య విధేయ భిన్నంబు విషయంబు" (ప్రౌఢ-వాక్య-6). అనగా - విషయమున రెండంశములుండును. అవి - 1. ఉద్దేశ్యము - అనగా ఉద్దేశించి చెప్పదగినది. అది వక్తృశ్రోతల కిరువురికిని తెలియునది. 2. విధేయము - అనగా ఉద్దేశ్యమును బట్టి తెలియదగినది. అది వక్తకు మాత్రమే తెలియును.

7. సంపూర్ణ మసంపూర్ణమని వాక్యంబు ద్వివిధంబు" (ప్రౌఢ-వాక్య-7). అనగా- సంపూర్ణవాక్యమనియు, అసంపూర్ణవాక్యమనియు వాక్యము రెండు విధములు. సమాపక క్రియలు గలవాక్యము సంపూర్ణవాక్యము. అసమాపకక్రియలు గల వాక్యము అసంపూర్ణవాక్యము.

8. "వాక్యసముదాయము మహావాక్యము నాబడు; అయ్యది రామాయణాదికము" (ప్రౌఢ-వాక్య-8). అనగా- వాక్యముల యొక్క సమూహమును 'మహావాక్య'మందురు. రామాయణాదులలో ఎన్నో వాక్యములున్నందున దానిని 'మహావాక్య' మందురు. ఇచ్చట 'మహావాక్య'మన్నది 'మహాకావ్యము' నకు పర్యాయముగా వాడబడినది. అంతేకాని- సుదీర్ఘముగా నున్నంత మాత్రమున దానిని మహావాక్య మనరాదని భావము.

9. "క్రియాన్వయ వాక్యంబులు కొన్ని వ్యంగ్యార్థ ద్యోతకంబులగు" (ప్రౌఢ-వాక్య-9). అనగా- క్రియతో అన్వయించు వాక్యములుకొన్ని వ్యంగ్యార్థమును బోధించునని అభిప్రాయము. వ్యంగ్యార్థమనగా శబ్దములచే చెప్పబడు అర్థమునకు విరుద్ధమైన అర్థము. ఉదా: వాడు వచ్చునేని వీడువచ్చును - అని అన్నప్పుడు 'వాడురానిచో వీడును రాడు' అన్న వ్యతిరేకార్థమును స్ఫురించును.

10. "ఇట్లనియె, అనిన - భావ్యర్థకథన ప్రారంభ పరిసమాప్తులం గ్రమంబుగనగు" (ప్రౌఢ-వాక్య-10). అనగా- జరుగబోవు అర్థమును చెప్పునప్పుడు పూర్వవాక్య ప్రారంభమున 'ఇట్లనియె, అనియును. ప్రారంభించిన వాక్య పరిసమాప్తి యందు 'అనిన' అనియు క్రమముగా అగును.

11. "కొన్ని యెడలం దదాదులు విశేషణంబు లధ్యాహారంబులగు" (ప్రౌఢ-వాక్య-11). అనగా- కొన్ని సందర్భములలో 'ఆ-ఈ' అను విశేషణములు ప్రయోగింపబడకపోయినప్పటికి, వానిని అధ్యాహారముచేసికొని అన్వయించుకొనవలెను. ఉదా: కలకంఠికంటి కన్నీరొలికిన సిరి యింట నుండ నొల్లదుసుమతీ! - ఇందు 'ఇంటన్' అనగా 'ఆ ఇంటియందు' అని అన్వయించుకొనవలెను.

12. "కొన్ని యెడల సంబంధంబునం బూర్వవాక్యంబునందలి పదం బధ్యాహారం బగు" (ప్రౌఢ-వాక్య-12). అనగా - సంబంధమును బట్టి కొన్నిచోట్ల పూర్వప్రయుక్తమైన పదములను తిరిగి గ్రహింపవలయును. ఉదా:గొంతి సంకటపాటుఁ గోడలి బన్నంబు (భార-భీష్మ-2ఆ). ఇచట - గొంతి సంకటపాటును, ఆగొంతి కోడలి బన్నంబును- అని అన్వయించుకొనవలెను.

13. "న్యూనవచో వాక్యంబున దర్వచనంబు లధ్యాహారంబులగు" (ప్రౌఢ-వాక్య-13). 'ఐన-ఏని-ఏ-ఓ' - వంటివి న్యూనవచనములు. వీనితోకలసియున్న వాక్యమున, వానిని అధ్యాహారము చేసికొనవలెను. ఉదా: 'ఎత్తెఱగున ధర్మ క్రియ జిత్తంబున జేర్పవలయు జీవించుతఱిన్ (భార-అను-4ఆ). ఇందులో - 'ఎత్తెఱగున' అన్నచోట, 'ఎత్తెఱగుననైన' అని అధ్యాహారము చేసికొనవలయును.

14. "కొన్ని యెడల కర్తృకర్మక్రియ లధ్యాహార్యంబులగు" (ప్రౌఢ-వాక్య-14). కొన్ని సందర్భములలో కర్తకాని, కర్మకాని, క్రియకాని అధ్యాహార్యమగును. ఉదా: కర్తకు : నన్ను జూచి నగరె (భార-అర-2ఆ) - (జనులు నన్ను జూచి నగరె?)

కర్మకు : దవదహనం బుదగ్రతరుదాహము చేయుచునున్న జూచి (భార-అర-2) - (దాహముచేయుటను - అని అధ్యాహారము చేయవలెను).

క్రియకు : ప్ర॥ అక్కడ నెవడున్నాడు? - జ॥ రాముడు (రాముడున్నాడు - అని అధ్యాహారము చేయవలెను).

15. "అనేక కర్తృకక్రియకు సమీపకర్త యొక్క లింగవచనంబులగు" (ప్రౌఢ-వాక్య-15). అనేక కర్తలున్న క్రియకు, దాని సమీపకర్త యొక్క లింగవచనములు అగును. ఉదా: తమసేనలూ వారును విశ్రమించిరి (ఉ.హరి-4ఆ). ఇచ్చట - 'విశ్రమించిరి' అను క్రియకు "సేనలు, వారు' అను రెండు కర్తలుకలవు. వానిలో క్రియకు సమీపమున నున్న కర్త 'వారు' అనునది కనుక, క్రియ 'విశ్రమించిరి' అని అయినది.

16. "కొన్ని యెడలం గాని క్రియాపూర్వకంబు పూర్వవిరుద్ధోతరార్థకంబగు" (ప్రౌఢ-వాక్య-19). అనగా - క్రియాపూర్వకమైన 'కాని' అను అవ్యయము, దానికి పూర్వమందున్న వాక్యభాగము యొక్క అర్థమునకు విరుద్ధమైన అర్థము నుత్తరభాగము నందున్నట్లు సూచించును. ఉదా: వాడువచ్చును గాని కార్యవ్యాసంగము చేత రాడాయెను.

17. "కొన్ని యెడల వ్యాసవాక్యమునకుముందు సంగ్రహవాక్యంబు నొండగు" (ప్రౌఢ-వాక్య-20). అనగా - కొన్ని చోట్ల వ్యాసవాక్యమునకుముందు సంగ్రహవాక్యమును అగును. అది శ్రోత నభిముఖుని చేసికొనుటకు ఉపకరించును. ఉదా: అయ్యా! యేను నీకుంబ్రియంబుసేసెద? నీ హృదయేశ్వరియైన దమయంతి పాలికింబోయి నీ గుణంబులు దానికి వర్ణించి చెప్పి యక్కన్య యన్యుల నపేక్షింపక నీయందబద్ధయనురాగ యగు నట్లు చేసెద (భార-అర-2ఆ).

18. "కొన్ని యెడల వాక్యంబు వాక్యాంతరగర్భంబునగు" (ప్రౌఢ-వాక్య-21). అనగా- కొన్ని చోట్ల ఒక వాక్యమునడుమ మఱొక చిన్న వాక్యమును చేరియుండువచ్చును. ఉదా: ఇందులకెంత కాలంబయ్యె రానికారణం బేమి? (భార-అర-2ఆ). ఇందులో - "ఇందులకు రానికారణంబేమి?" అనునది ప్రధానవాక్యము. "ఎంతకాలంబయ్యె" అన్నది వాక్యాంతరము. అన్వయక్లేశము కలుగనంత వరకు ఇట్లుండుట తప్పుకాదు.

19. "పద్యంబులకుఁ గులకంబగు" (ప్రౌఢ-వాక్య-23). కులకమనగా పద్యమునకు పద్యాంతరముతో నన్వయము (వృత్తి). అనగా ఒక పద్యములోని వాక్యభావము ఆపద్యములో పరిసమాప్తి కాక, తరువాతి పద్యములో సమాప్తము కావచ్చును. ఇట్లు ఒక పద్యము, పద్యాంతరముతో అన్వయము కలిగియున్నచో 'కులకము' అనబడును. ఉదా: "తానొక పండ్లు చెచ్చెరన్--- కొనివచ్చుడు ...." (భార-ఆది-2ఆ - 198,199ప.)

ఇట్లు ప్రౌఢవ్యాకరణకర్త వాక్యలక్షణములను వివరించినాడు.